# నుడి - నానుడి

రచయిత : **తిరుమల రామచంద్ర**




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1241 ప్రతులు : 2000

ప్రథమ ముద్రణ : జనవరి. 1963

ద్వితీయ ముద్రణ : మార్చి, 1971

తృతీయ ముద్రణ : మే, 1987



వెల : రూ. 12-00

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,

విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాదు-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,

విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,

తిరుపతి, హన్మకొండ, గుంటూరు, కాకినాడ.

ISBN : 81-7098-008-9

---

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైదరాబాద్-29.

# మనవి మాటలు

నేను ముప్పయ్యేండ్ల క్రితం "వాట్స్ డిక్షనరీ ఆఫ్ కమర్షియల్ ప్రొడక్ట్స్ ఇన్ ఇండియా, బర్మా అండ్ సిలన్" అనే నిఘంటువును చూచినప్పుడు దానిలోని పద పదార్థ విచారం చదివి నివ్వెరపోయాను. ఎంత గొప్ప పరిశ్రమ అది! అలాటిది తెనుగులో ఉంటే ఎంత బాగుండును?-అని అనిపించింది. కాని, అది నాబోటి ఒంటరిగాడు చేయడం సాధ్యమా!

పదకొండు సంవత్సరాల క్రితం ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక ప్రారంభించి నప్పుడు ఒక పదాన్నో, పదబంధాన్నో కథలాగా మౌలికంగా చర్చించాలనీ. ఆ చర్చ ఒక పుటకు మించరాదనీ అప్పటి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు ఆదేశించారు. ఆ సదవకాశం జారవిడువలేక రెండు సంవత్సరాలపాటు "నుడి-నానుడి" అనే శీర్షికకింద వారం వారం ఒక పదం చర్చ జరిపాను ఆ పదాలలో కొన్నిటి సంకలనమే ఈ గ్రంథం.

సంస్కృతంలో పద పదార్థచర్చ సాగినంతగా తెనుగులో సాగలేదు. తెనుగులోనే కాదు; మరే భాషలోనూ సాగలేదన్నా తప్పులేదు. తెనుగులో ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు జరిపిన చర్చ తెనుగు తోబుట్టువులలోని సమానార్థక సరూప పదాలు తెలుపడంవరకే పరిమితమైంది. నేను ఈ వ్యాసాలలో ప్రతి పదాన్ని తెనుగు తోబుట్టువులలోని సమానార్థక సరూప పదంతో తులనాత్మకంగా తరచి చూపడమే కాక ఆ పదం పుట్టు పూర్వాలను మానవ జాతి పరిణామ దృష్టితోను, సంఘ పరిణామ దృష్టితోను తెలుసుకొనడానికి ప్రయత్నించాను. పనస, ఉప్పు, పాలు, సీతాఫలప్పండు, మగువ, ఉల్లి, వేప, కోమటి, చింత, తెరవ, పాడి వంటి పదాల చర్చలో నా పరిశ్రమను సహృదయులు గుర్తిస్తారు. ఏమైనా ఇలాటి పద వ్యుత్పత్తి జిజ్ఞాసోద్యమానికి నా పరిశ్రమ నాంది కాగలగడం నా అదృష్టం. పద చర్చలో అక్కడక్కడ సంస్కృత శాబ్దికులపై విసుర్లు కనిపిస్తాయి అవి వాదబలం కోసం విసిరినవే కాని, అవజ్ఞతో కాదని మనవి.

వేప. పులుసు మొదలయిన పదాల ఆద్యుచ్చారణను ఊహించడంలో కొన్ని ప్రయోగ పరిశీలనలు చేశాను. వాటికి నా భార్య సౌభాగ్యవతి అనంత లక్ష్మీదేవి, కుమార్తె చిరంజీవిని నీరజ ఎంతో తోడ్పడ్డారు. అప్పుడప్పుడు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార సంస్కృత పండితులు, న్యాయ

వ్యాకరణ వేదాంత శిరోమణులు శ్రీ టి. హెచ్. విశ్వనాథశాస్త్రి గారితో చర్చలు జరిపాను. భాషాశాస్త్ర పారంగతులు కీర్తిశేషులు శ్రీ కోరాడ రామ కృష్ణయ్యగారికి వీటిని చదివి వినిపించాను. వారి సూచనలు చేర్చాను. నాట్యకళ సంపాదకులు శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు చదివి ఆనందించారు. వీరందరికీ కృతజ్ఞుణ్ణి.

ఉస్మానియా విశ్వ విద్యాలయ భాషాశాస్త్ర శాఖాధ్యక్షులు డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తి గారు (ఎం. ఏ, పిహెచ్ డి. పెన్సిల్వేనియా) నాకు భాషాశాస్త్ర బంధువులే కాక, పరిశ్రమశీలాది గుణగణ సంపదతోను అత్యాప్తులు, అడిగిన వెంటనే మున్నుడి వ్రాసి పెట్టినందుకు వారికి కృత జ్ఞత తెలుపడం నాకు నేను కృతజ్ఞత తెలుపుకొనడమే—

ఇలాటి చర్చ కొనసాగించడానికి అవకాశ మిచ్చిన శ్రీ నార్ల వెంక టేశ్వరరావుగారికి, ఈ వ్యాసాలను పుస్తక రూపంగా ప్రచురించడానికి అనుమతించిన ఆంధ్రప్రభ అధిపతులు శ్రీ భగవాన్‌దాస్‌జీ గోయంకాగారికి, ఎడిటర్ శ్రీ నీలంరాజు వేంకట శేషయ్యగారికి కృతజ్ఞుణ్ణి.

భాషాశాస్త్ర గ్రంథానికి బొమ్మలేమిటని నవ్వుకుంటారేమో! భావం మాటలతో చెప్పడం కన్నా బొమ్మ గీచి చెప్పడం సుబోధకం, మనోరంజకం కదా! శ్రీ బాపుగారి బొమ్మలు నా భావాలను వివరించడమే కాక వాటికి మెరుగులు కూడా దిద్దాయి. వారికి, వారి మధురోదార స్నేహానికి ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని మిత్రుడు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తికి అంకిత మిస్తు న్నందుకు ఆనందిస్తున్నాను. స్వయంకృషి స్వావలంబనాల మూర్తి శ్రీ కృష్ణమూర్తి. పాదరసం కన్నా చురుకుగా పరుగులు వారే ఈయన మేధ ఏ రంగంలో ప్రసరించినా కొత్త రంగులు విరజిమ్ముతూ ఉంటుంది; నాకు ఎప్పటికప్పుడు ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది.

ఆంధ్రావళికి విశ్వ విజ్ఞానం పంచిపెట్టడమే పనిగా పెట్టుకున్న విశా లాంధ్ర ప్రచురణాలయం- విజయవాడ- వారు ఈ గ్రంథం ఎంతో శ్రద్ధగా ప్రచురించారు. వారికి, ఆ సంస్థ నిర్వాహకులకు సర్వదా కృతజ్ఞుణ్ణి.

మద్రాసు-6. భాషాసేవకుడు,

శుభకృత్తు, కార్తిక పూర్ణిమ. **తిరుమల రామచంద్ర**

# మున్నుడి

వ్యక్తులలాగానే మాటలకు గూడా విలక్షణమైన చరిత్ర ఉంటుంది. కొన్ని వేల ఏండ్ల జీవితచరిత్ర గల మాటల్లో క్రమంగా ఏర్పడ్డ ధ్వనుల మార్పులు, అర్థ పరిణామాలు, కొన్ని శాస్త్రీయ ప్రమాణాలను ఇట్టి ఉద్ధరించటం-ఒక రూపమైన భాషా పరిశోధన. వాడుకలో నలిగినకొద్దీ నియమబద్ధంగా ఉచ్చారణలు మారి శబ్దరూపాలు మారిపోతాయి. కొన్ని శతాబ్దుల క్రిందట మన పూర్వులు ఉచ్చరించే క్రొత్త, ప్రాత, వాండు, ఱెక్క - అనే మాటలు నేడు కొత్త, పాత, వాడు, రెక్క - గా మనం పలుకుతున్నాం. అలానే వాక్య సందర్భాల్లోను, రాజకీయ సాంస్కృతిక పరిస్థితుల్లోను వచ్చే మార్పులవల్ల పదాల అర్థాలు కూడా మారిపోతుంటాయి. పూర్వుల భాషలో తగవు అంటే 'ధర్మం, తగినది' అని అర్థం; తగవులాడుట ధర్మ నిర్ణయానికి చేసే వాగ్వాదం. ఇప్పు డీ అర్థంలో కొంత భాగం పోయి 'కేవల వివాదం, పోట్లాట' అనే అర్థమే నిలిచిపోయింది. నేటి మిరపకాయ పూర్వపు మిరియపుకాయ గాదు. వర్ణపరిణామంలోలాగా అర్థపరిణామంలో అవాంతర దశలు నిరూపించటం సులభసాధ్యం గాదు.

మాటలపుట్టుకలు తులనాత్మక దృష్టితో పరిశీలిస్తేనే గోచరిస్తాయి. కాని ఈ రకమైన పరిశీలన నిర్వహించటంలో ఎన్నో 'అగాధాల్లో' పడకుండా తప్పుకోవాలి; ఉదా॥ నేటి తెలుగులో పెరుగు 'వర్ధిల్లు', పెరుగు 'దధి' - అని రెండు రకాల వాడుక వుంది. ఎవరన్నా చప్పున దేహాభివృద్ధికి వుపయోగించేది కాబట్టి 'దధి' అనే అర్థం వచ్చిందంటే - చాలా విశ్వసించ

దగ్గ వ్యుత్పత్తిలాగానే కనిపిస్తుంది కాని తులనాత్మక దృష్టితో చూస్తే ఈ పోలిక యాదృచ్ఛికం, భ్రాంతిదాయకం అని వెంటనే తెలుస్తుంది. దథ్యర్థక మైన శబ్దానికి మూలరూపం పెఱుగు, దానికి చెందిన ధాతువు పేఱు 'ముద్దకట్టు', కన్నడంలో సోదర శబ్దాలు పేఱ్, పెరుప్ప (ఇక్కడ సంయోగంలో ఱ, రగా మారింది), హెప్పు అని కనిపిస్తాయి. 'వర్ధిల్లు' అనే అర్థంలో అన్ని ద్రావిడ భాషల్లోను ధాతువు పేర్, పెరు అని సాధురేఫ తోనే వుంది.

'నుడి - నానుడి' అనే ఈ గ్రంథంలో శ్రీ తిరుమల రామచంద్ర గారు ఎన్నో తెలుగు మాటల వ్యుత్పత్తులు సులభగ్రాహ్యమైన శైలిలో చర్చించారు. ఈ వ్యాసాల్లో శ్రీ రామచంద్రగారికి సంస్కృతాంధ్ర భాషల్లో వున్న పాండిత్యమే గాక, ఇతర భాషల్లో వారికున్న చొరవ, పరిశోధనాత్మక బుద్ధి వ్యక్తమౌతాయి శాస్త్ర విషయాలను అందరికీ ఆప్యాయంగా వుండే రీతిని చెప్పటం వీరి ప్రత్యేక శక్తి మాటల పుట్టుకలు పోల్చి సమన్వయించ టంలో ఎన్నో సాంఘిక, సాంస్కృతిక విజ్ఞాన విశేషాలు పాఠకులకు అందించారు. చాలా మాటలకు వీరు కల్పించిన వ్యుత్పత్తులు శాస్త్ర చర్చకు నిలబడతాయి. కొన్ని నిలబడకపోయినా, శబ్దోత్పత్తి విజ్ఞానాభిలాష పాఠ కుల్లో కలిగించటంలో వీరి ప్రయత్నం కృతార్థమైందనే నేను భావిస్తున్నాను.

హైదరాబాదు,
డిసెంబరు 10. 1962.

భద్రిరాజు కృష్ణమూర్తి

అంకితం

మిత్రుడు

# శ్రీ రాంభట్ల కృష్ణమూర్తికి

# ద్వితీయ ముద్రణ మనవి మాటలు

కథ, కమామీషు కాని పుస్తకం ద్వితీయ ముద్రణ పొందడమే తెలుగునాట అరుదు. ఈ 'నుడి-నానుడి' ఎనిమిది సంవత్సరాలకే ద్వితీయ ముద్రణ పొందినందుకు కొంచెం గర్వపడుతూ, విశాలాంధ్ర ప్రచురణాలయం—విజయవాడ నిర్వాహకులను అభినందిస్తున్నాను.

ఈ ముద్రణలో నాలుగైదుమాటల వివరణ చేర్చాను. దాని బాగోగులు పఠితలే చూస్తారు.

మద్రాసు-5
సాధారణ, ఫాల్గుణ పూర్ణిమ

భాషాసేవకుడు,
**తిరుమల రామచంద్ర**

# తృతీయ ముద్రణ మనవి మాటలు

"నుడి-నానుడి మళ్ళీ ముద్రించదలచాము. మార్పులు చేర్పులు ఉంటే చేసి ఇవ్వండి" అని విశాలాంధ్ర ప్రచురణాలయం నిర్వాహకులు, మిత్రులు శ్రీ రాజేశ్వరరావుగారు నన్ను అడిగినప్పుడు నాకు ఆశ్చర్యమేమీ కలుగలేదు. వారి అనవరత కృషిలో ఏ పుస్తకమైనా, ఎన్ని సార్లయినా ప్రచురణ పొందుతుందని నా విశ్వాసం.

ఈ సందర్భంలో అనుష్టుప్ చక్రవర్తి శ్లోకం జ్ఞాపకం వచ్చింది. కృష్ణరాయలు గజపతి అంతఃపురాన్ని జయించి "కటకందాకా మందేరా!" అని చాటి విజయనగరానికి తిరిగి వచ్చినప్పుడు కవులందరూ అహమహమికతో అతనిని పొగడారు. అనుష్టుప్ చక్రవర్తి ఇదేం మహాపని అన్నట్టు ఒక్క అనుష్టుప్ చెప్పాడు:

"కృష్ణరాయ స్తువంతు త్వాం
కవయో న వయం స్తుమః,
నరసింహ కిశోరస్య
కియాన్ గజపతే ర్జయః?

కృష్ణరాయా! నిన్ను కవులు ఎంతైనా పొగడనీ, నేనుమాత్రం పొగడను. నీవు నరసింహకిశోరుడివి. మరి సింగపుకొదమకు గజపతిని గెలవడం ఏమి గొప్ప ?" కనుక విశాలాంధ్ర ప్రచురణాలయం ఇలాటి పుస్తకాలను ఎన్నిసార్లయినా ప్రచురించగలదు.

ఈ తృతీయ ముద్రణలో మరికొన్ని పదాలు చేర్చాను; తక్కిన వాటినీ సవరించాను. ఒకవిధంగా ఇది రివైజ్డ్ ఎడిషన్ అనవచ్చు. నా కుమార్తె సౌ. డాక్టర్ నీరజాచక్రవర్తి చేసిన కొన్ని సూచనలూ చేర్చాను.

ఈ విధంగా ఒకరో ఇద్దరో కృషి చేయడం కాదు. తెలుగు పునరుజ్జీవనానికి ఎన్నో సంస్థలు నేడు పుట్టాయి. అవి కొందరు భాషా తత్త్వవేత్తలను నియమించి వ్యుత్పత్తి పదకోశాన్ని నిర్మించాలి. విశాలాంధ్ర ప్రచురణాలయంవారే అలాటి ఉద్యమానికి ఎందుకు పూనుకోరాదు?

విశాలాంధ్ర ప్రచురణాలయం నిర్వాహకులకు మరొకమారు కృతజ్ఞతావందనాలు అర్పిస్తున్నాను.

హైదరాబాద్-29
ప్రభవ, వైశాఖపూర్ణిమ

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# విషయసూచిక

# చెంబూ - కంచం

## 1



మనం ప్రతిదినమూ ఎన్నో వస్తువులను చూస్తూంటాము; వాడుతూంటాము. ఎన్నో సంగతులు వింటూంటాము. కాని, వాని మూల తత్త్వం ఏమిటో, అవి ఎన్ని మార్పులు పొంది ప్రస్తుతం మనకు అగుపడే రూపంలో స్థిరపడినాయో ఆలోచిస్తామా ?

ఎన్నో విషయాలు, వాని పుట్టుపూర్వాలు తెలియకుండానే, మన నిత్యజీవితంలో మెలగుతూంటాయి. మనం ప్రయోగించే మాటలూ అంతే. నిత్యమూ వాడుతున్నాము గదా అని ఏ మాటకైనా పుట్టుపూర్వాలు చెప్పుకోగలమా మరి? అన్ని శబ్దాలూ మొదట ఏదో అర్థంలో యౌగికాలేనేమో! మన ప్రయోగదశకు వచ్చే వేళకు రూఢాలయి, తమ తాత తండ్రులను మరపిస్తున్నాయి.

ఒక నుడినో, నానుడినో తడవండి; ఒక్కొక జాతి సంపూర్ణ చరిత్రే బయటపడుతుంది. మనం దినమూ వాడే చెంబూ కంచాల సంగతే చూడండి. పాపం ! ఎన్ని వేల యేళ్ళుగా ఈ రెండూ అవినాభావంగా వున్నాయో ! ఈ రెండింటిలో కంచంకంటే చెంబే వయస్సులో పెద్దదని తోస్తుంది. ఏమి టీ పేర్లు? రూపాన్ని చూచి పెట్టిన ముద్దు పేర్లా? రూఢిగా వచ్చిన పేర్లా? నేను మట్టుకు ఇవి వీని సొంత పేర్లు కావనీ, వీని వంశాల పేర్లేననీ నిర్ణయించుకున్నాను.

చెంబును మీటండి ! ఏమి చెబుతుందో వినండి ! సెమెటిక్ జాతులు రాగిని మొట్టమొదట కనిపెట్టాయి. బహుశా ప్రపంచంలోకల్లా మొదటి లోహం రాగే నేమో ! ఇతర లోహాలలో రాగి కలిసిపోయేటంతగా మరొక

లోహం కలిసిపోదు. బంగారుకంటె ముందు దీనిని కనిపెట్టడంవల్లనేమో రాగిలో బంగారం వుందంటారు పెద్దలు. తమిళ్‌లో దీనిని "సెంబు-సెప్పు" అంటారు. ఎర్రనిది అని దీని అర్థం. చెంపప్పు, చెప్, సెన్, కెన్, కెంపు, చెంగ్, చెన్ అనే పదాలన్నీ యీ జాతివే. ఎర్రగా మెరుగ్గా వుండేదంతా అందమైనదనే భావం ప్రబలిన కాలం లోనిదే చెన్ను అనే పదం ఇది లాక్షణికంగా అందమనే అర్థంలో నిలిచింది. రాగి ఎర్రనిది కనుక వర్ణవాచకమైన "చెన్‌పు" లోహవాచకంగా వాడుకకు వచ్చింది.

సెమెటిక్ జాతులు రాగిని ఎక్కువగా వాడుతాయి. ముసల్మానులు రాగిపాత్రలను ఎక్కువగా ఉపయోగించడం దీనికి సాక్ష్యం. ఆర్యభాషలు మాట్లాడే ముసల్మానుల కందరికీ, ఈ లోహం వాడుక సెమెటిక్ జాతుల నుంచి వచ్చిందే. వీరు మొదట తమకు కావలసిన సామగ్రిని రాగితోనే చేసుకొనేవారు క్రమంగా ఇతర లోహాలను వాడుకోసాగారు. శెప్పుతో చేయబడింది కనుకనే శెంబు, చెంబు. ఇది మొదట్లో రాగితోను, తర్వాత ఇతర లోహాలతోను చేసినా, చెంబు అనే రూఢి అయింది. రాగిది కాక పోయినా, నేడు చెంబు అంటే నీరు తోడుకొనే, నీరు నిలువ చేసుకొనే చిన్న పాత్ర విశేషం అని రూఢి అయింది.

ఇక కంచం సంగతి. కంచువల్ల యిది తయారయిందనడంలో సందేహ మేమీ లేదు. కాని దీని తల్లి సరాసరి "కాంస్యం" అనడం అవసరం లేదు. ఇది ఎక్కువగా వాగుతుందని అందరికీ తెలుసు. కనుక కంగ్-చ్ మని మ్రోగడాన్నిబట్టి కంచు అయిందేమో! కాంస్యమన్న మాట కూడా పూర్తిగా ధ్వన్యనుకరణవాచకమే.

తెలుగువారం కంచును ఎక్కువగా ఆదరించాము కంచుతో జీవించే వారు కంచరు లయ్యారు. కంచర శబ్దం రూపాంతరమే కంసల, కంసాల. కంసాలులు బంగారు పనిచేసినా, కంసాలులుగానే మిగిలారు; సొన్నారులనే వ్యవహారం క్వాచిత్కంగా మనదేశంలోను, విశేషంగా ఉత్తరాపథ భాషల

లోను ఉన్నా. కంచు తెలుగుదేశంలో ప్రాచీనమైన లోహ మనుకుంటాను. ఆంధ్ర కర్నాటక ప్రాంతాలలోని చెంచులు, కోయలు మొదలయిన అనాది జాతులు దీనిని ఆభరణాలుగాను ఉపయోగించడాన్నిబట్టి రాగి తర్వాత కంచే ప్రాచీన లోహ మనుకుంటాను.

ఆంధ్రదేశంలో స్వర్ణకారులకు "కంసాలి బత్తులు" అనే వ్యవహారం వుంది. తమిళంలో బత్తుణ్ని పత్తర్ అంటారు. వంగదేశంలో పాత్రా అనే ఒక తెగ వుంది. పాత్రాలు స్వర్ణకారులు. వీరు ఆంధ్రదేశం నుంచి వంగదేశానికి వలస వెళ్ళారు. ఈ పాత్రాలు ఒరిస్సాలోని పాత్రోలు మహాపాత్రోలు కారు.

వీటన్నిటినిబట్టి రాయి, లోహం, కర్ర పనులన్నీ మొదట ఒక్క తెగవారే చేసేవారని అనుమానించవచ్చు. వీరు ఒక తెగ బ్రాహ్మణులే. చేతి పనులు ప్రధానమైనందున తక్కిన బ్రాహ్మణుల తెగలనుంచి వేరయి వుంటారు. రాతిపని చేస్తున్నందున వీరికి పత్తర్, బత్తుడు అనే వ్యవహారం వచ్చింది. పత్తర్, బత్తుడు ప్రస్తరశబ్ద భవాలు. రాతిపని మాని బంగారుపని చేస్తున్నా ఆ పేరు పోలేదు! కర్ర, రాయి, బంగారు, కంచు, ఇనుము— పనిచేసే ఈ 'గండాచార్యు' లందరూ పూర్వం ఒక్క తెగవారే; క్రమంగా పాంచాలులు, పాంచాణంవారు అయారు.

ఇంతకూ ఏమిటంటే, కొన్ని మాటల చాటున కొన్ని కూటాల వేల యేండ్లగాథ మణిగివుంటుం దనే.



4

# వాన



కొన్ని పదాలకు మొదట ఒక అర్థం వ్యవహారంలో వుంటుంది. క్రమంగా దానికి చూచాయగా సంబంధించిన మరొక అర్థం వాడుకలోకి వస్తుంది. తర్వాత అది తండ్రిని మించిన కొడుకవుతుంది. దాని మూలస్వరూపం ఏమిటనే చర్చ వచ్చినప్పుడు, ఏదో లాక్షణికంగా ఏర్పడింది అని సరిపెట్టుకోవలసి వస్తుంది.

వాన అనే పదాన్నే తీసుకుందాం. వాన, నీరు, గాలి అనేవి ప్రాణిమాత్రానికి అత్యావసరమైనవి కదా! అయినప్పుడు, ప్రతి జాతికి యిలాంటి పదాలు, ఏవో సంకేతాలు తప్పవు. కాని, మన వాన మాత్రం అలాంటిది కాదు; వింతైన పదం.

తమిళ, మలయాళ, కర్ణాటక భాషలలో వానకు అర్థమిచ్చే మషై, మష, మళె శబ్దాలతో తెనగు వానపదాని కేమిటా పోలిక లేదు. అయితే దీని సంగతి ఎలా తెలుస్తుంది? ఒక్కసారి మనం వాన పడే ఆకాశం వైపు చూడవలసి వుంటుంది. తమిళంలో ఆకాశానికి వానం అంటారు. దేవలోకం ఎక్కడో పైన వుందనే నమ్మకం మనకు అనాదిగా వుండడాన్నిబట్టి దీనికి దేవలోకం అనే అర్థం కూడా క్రమంగా వచ్చింది. మేఘానికి వానకూ కూడా వానం వాడారు కన్నడంలో. బాఞ్, బాం, బాన, వాన శబ్దాలను అతి ప్రాచీనుడైన శబ్దమణిదర్పణకారుడు ఆకాశం, వాన అనే అర్థాలలో వాడాడు. దీనినిబట్టి మొదట వారందరూ వాన పదాన్ని ఆకాశానికి వాడేవారని, క్రమంగా ఆ పదమే ఆకాశాన్నుంచి పడే వర్షానికి వ్యవహరించారని ఊహించవచ్చు.

తెలుగువారు తొలి గుంపునుంచి విడిపోయే కాలానికి ఇతర నాగరి కతలవల్ల వచ్చిన పదాలు తెలుగులో చేరాయి. ఆకాశానికి మరొక పదం వాడుకలోకి వచ్చింది. వాన శబ్దం మొదట సూచించే అర్థం మరుగై, తర్వాత లాక్షణికంగా వచ్చిన నీళ్ళు పడడం అనే అర్థం రూఢమైంది.

మనకు ఆకాశ వాచకాలు బయలు, చదలు, నింగి, విన్ను, విను, మిన్ను, మిను, ఉప్పరంవంటి వున్నాయి. ఇవన్నీ చాలవరకు మీద, పైన, అంతరాళంలోనికి అనే అర్థ మిచ్చేవి. ప్రాచీనమైన వాన శబ్దం మాత్రం పాత అర్థం కోల్పోయింది గనుక, నిఘంటుకారులు దానిని ఆకాశార్థక పదాలలో చేర్చలేదు.

మనకు సోన అని మరొక చక్కనిమాట వుంది వానకు. ఇది చాల ఇటీవలిదయి వుంటుంది. ఇటీవలి దంటే నిన్న మొన్నటి దని కాదు. వానకు తర్వాతిది. సొనగా కారు, ఎడతెగక పడు అనే అర్థాలనుబట్టి చొన, జొన, జోన, సోన అయి వుంటుంది.

తలెత్తి చూచారు, మనవారు. ఏదో గుమ్మటంలాగ ముసురుకొని, కప్పుకొని మబ్బుగా వుంది: ముసుర్, మొయిల్, ముయిల్, మబ్బు అనుకున్నారు. అందుతుందేమో నని చేయెత్తి చూచారు. అందలేదు. మీదుగా మీన్, మేల్, మిన్‌గా వుంది. మిన్ను, విన్ను అని నిశ్చయించుకున్నారు. (ఆకాశానికి కూడా మొయిలు, మబ్బు అని వాడి వుంటారేమో! క్రమంగా మేఘాలనే అర్థంలో రూఢమయాయి. సంస్కృతంలోనూ, అభ్రశబ్దం ఆకాశానికి, మేఘానికి వాడబడింది.)

మయి-మెయి (=నలుపు) అనే ధాతువు ద్రావిడ భాషలో ఉన్నది. మైసఇన్, కృష్ణానది. దీని సంస్కృతీకరణమే కృష్ణ. కాటుకను తమిళ్‌లో 'మై' అంటారు. మయిల్, మెయిల్ యీ ధాతువునుంచి వచ్చాయి మయిల్ నుంచి మొయిలు, దాని నుంచి ముసురు. యకారం సకారంగా మారడం సహజం. చేయు - చేసు; పోయు - పోసు. మయ్ ధాతువుకు "బు"

ప్రత్యయం చేరిస్తే మబ్బు (నలుపు నుంచి మబ్బు అనడం సులభం) ఈ విధంగానూ యీ పదాలు వూహించవచ్చు.

ఇంతైనా, "బాణం" అనే సంస్కృత శబ్దమే మన వానకు పుట్టిల్లు కాకూడదూ?—అనే ఆక్షేపణ వుంది. దీనికి చక్కని సమాధానం చెప్ప వచ్చు. మన వాన శబ్దం జాతకం కట్టడం ప్రారంభిస్తే ఎన్నో వేల సంవత్స రాలకు ముందుకు వెళ్ళుతుంది. దక్షిణాదిలోని ఆదిమ జాతులలో ఈ శబ్దం ఆకాశం అనే అర్థంలో వుండడమే సంస్కృత పండితులకు చక్కని జవాబు. తోడ తెగవారు ఆకాశాన్ని బాన్ అంటారు. కోటలు వనమే అంటారు. బడగలు బానూ అంటారు. కురంబలు బానా అని, ఇరుళ్ తెగవారు వనూ అని అంటారు. ఎన్నో సహస్రాబ్దాలనుంచి తమ జాతి లక్షణాలను రక్షించు కుంటూ వస్తున్న వీరిలో ఈ పదం చాలవరకు సదృశోచ్చారణతో వుండడం వింత కాదూ? కాని, తెలుగులో మాత్రం ఈ పదం ఆకాశార్థం నుంచి ఎప్పుడు జారిపోయిందో?

ఆర్మీనియాలో లేక్‌సియావాన్ అనే పెద్ద సరస్సు టర్కీవారు ఆక్రమించుకొన్న ఆర్మీనియా భాగంలో వాన్ అనే ఒక సరస్సు ఉందని, వీటిలోని వాన్ పదం జలవాచకమవి, సంస్కృతంలో వన బాణ శబ్దాలకు ఇవి సోదరులని, కనుక వీటన్నిటి మూలం మరొకటి ఉండవచ్చని శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి అంటున్నారు. పరిశీలించాలి.



# నీరు - వెల్లువ

7



ప్రపంచంలో అందరికన్నా ముందు కనులు తెరచి నాగరికత వైపు ముందంజవేసిన దాక్షిణాత్యులకు నీటికి వాడుకునే పదాలు లేవంటే నమ్మడ మెలా?

నీరు సంస్కృతంలోని నీరంనుంచి పుట్టిందని సంస్కృత పండితుల వాదం. నిజానికి ఈ పదం దక్షిణాది భాషలనుంచి సంస్కృతంలో తర్వాతి కాలానికి చేరింది. నీరశబ్దం వేదంలో లేదు. వేదంలో నీటికి ప్రచురంగా ప్రయోగించిన పదాలు ఉత్, ఉదకం, అప్, ఆపః! వైదికులలో వ్యవహారాన్నిబట్టి కూడా ఉదకశాంతి, అపామార్జనం కాని, నీరశాంతి కాదు.

ఒక చోటినుంచి మరొక చోటికి తీసుకుపోయేది అనేది నీర శబ్దానికి సంస్కృత పండితులు చెబుతున్న వ్యుత్పత్తి (నీయతే అనే నేతి) ఇది మన జాతి నావిక నైపుణ్యం, నౌకావ్యాపారం, నాగరికత అభివృద్ధి అయిన తర్వాత తోచిన అర్థం. నీటిద్వారా ఒకచోటినుంచి మరొకచోటికి పోయే నాగరిక వ్యాపారం మొదట్లో ఆదిమ సంఘానికి సాధ్యం కాదు. అప్పటి వారు ప్రకృతిని చూచి భయపడుతూ క్రమంగా భయం సన్నగిల్లి దానిని వుపయోగించుకొనేవారు.

సంస్కృత పండితులు చెప్పే మరొక వ్యుత్పత్తి కూడా వుంది నీటికి. అగ్ని దేని నుంచి పుట్టిందో అది అని, అగ్ని నుంచి పుట్టింది అని. ఇది — ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః — అనే వేద ప్రమాణానికి అనుగుణంగా తర్వాత అతికించబడిందే.

నీర్ శబ్దానికి తమిళంలో నీళ్ళు, సముద్రం, రసం, పన్నీరు, మూత్రం, పిత్తపు నీరు, కొన్ని నక్షత్రాలు, ముత్యాలు రత్నాలలో కనిపించే నిగనిగ, తళుకు, గుణం, పరిస్థితి అనే అర్థాలున్నాయి కన్నడ, తుళు మలయాళభాషల్లోను నీర్ జలవాచకమే.

మన పూర్వులు అత్యవసరమైన జీవిత సామగ్రి కోసం పోరాడే అనాగరిక యుగంలో నిగనిగ మెరిసే ఓ వస్తువును చూచారు. మెరిసే నీళ్ళు వారి కంటికీ, వొంటికీ చలవనిస్తూ, తన్ను ఉపయోగించమన్నట్టు ఆహ్వానించాయి. నిగనిగలాడేది గనుక నిగష్, నిగర్, నీరు, నివురు అయింది. (నిగనిగలాడేది గనుక నీర్ అని చెప్పడానికి అవకాశం లేదని కొందరన్నా, కిట్టెల్ వంటి పండితులు అంగీకరించలేదు).

నీరు జలసామాన్య వాచకంలో రూఢమయింది. నివురు నీరుక్రమ్ము అనే అర్థం యిస్తుంది. దీనికి దగ్గరి నెమ్ము అనే పదం చెమర్చు, చెమ్మగిలు అనే అర్థాలలో వుంది నెగడు, నెగలు అనే మరి రెండు పదాలు నెగడుమంటలు అనే అర్థమిచ్చేవి కూడా ప్రకాశం, వెలుతురు అనే భావంలో వచ్చినవే

నిగనిగను బట్టే నీరు అన్న శబ్దం పుట్టిందనడానికి వెల్లువ అనే మరొక పదం కూడా సాధకం. కృష్ణవేణి, కృష్ణవెణ్ణా, వెణ్ణా, పెన్నా, పెన్గంగా, తామ్రపర్ణి శబ్దాలలో వెణ్ణా, పెణ్ణా అనే ధ్వని మనకు వినబడుతుంది.

'వాన వల్లప్పలు' అని వానకాలంలో పిల్లల అరపులు మనమంతా వింటూనే వున్నాము. ఈ వల్లప్పలు, వెల్లువ పదాలలోనూ వెణ్ణ ధ్వనికి దగ్గరగావుండే వెల్ల ధ్వని వినబడుతుంది. వీటిని పరికిస్తే, వీటన్నిటికీ మూలశబ్ద మొకటి వుండాలని. అది ఒక కోవనుంచి చీలిన భాషలలో మూల ధ్వనికి భంగంలేకుండా మార్పు చెందినదని స్పష్టమౌతుంది.

అనాది దక్షిణ మానవ సంఘం మిలమిల మెరిసే నీటిని మొదట చూచినప్పుడు దానికి కొన్ని సంకేతాలు పెట్టుకుంది. వాటిలో ఒకటి

క్రమంగా నదులలోనూ, గుంటలలోనూ, వరదలలోనూ వున్న నీటికి వ్యవహరించుకొంది. నాగరికత నదులవారినకొద్దీ వేర్వేరు జలాశయాలకు వేర్వేరు పేర్లు వచ్చాయి.

వెళ్ళం అనే పదం జలపర్యాయంగా మలయాళ భాషలో ఇప్పటికీ సర్వసాధారణంగా వ్యవహరించబడుతుండడంవల్ల వెణ్ణా, వెల్లువ, వల్లప్పలు, పెన్నా, పర్ణి, పిణ్ణె శబ్దాల మూలరూపం వెళ్ళం కాని, వెణ్ణం కాని అయివుంటుంది. కరగించి పోతపోసిన ఆరని వెండివలె వున్న నీటిని చూచి వెళ్, వెళ్ళం. వెణ్ణం శబ్దాలను మన ఆదిపురుషులు ప్రయోగించి వుంటారు. తర్వాత, తర్వాత తాము చూచిన నదులకూ అదే వ్యవహరించారు. భాష విరివి కాను కాను ఆయా భూమిగుణ ప్రధానంగా నీటిని పేర్కొన్నారు. నల్లమట్టిలో పారే వెణ్ణం కృష్ణవెణ్ణ అయింది. కాని మట్టిలో పారే వెణ్ణం తామ్రపర్ణి అయింది. కావిఏరే కావేరి.

ఈ వెళ్ — వెళ్ళ శబ్దమే క్రమంగా తెల్లని వస్తువులను సూచించే పెక్కు పదాలకు మూలమయినా కొంత మార్పుచెంది మనకు మాత్రం ప్రవాహార్థంలోనే నిలిచిపోయింది: తమిళంలో ప్రాచీన సాహిత్యంలో జలార్థంలో వున్నా. మలయాళంలో నిత్య వ్యవహారంలో జలవాచిగా నేడు మసలుతున్నది.

వెళ్ళం, వెల్లువ శబ్దాలు అధికవాచకమైన, పెర్ అనేదాని రూపమైన పెల్లునుంచి వచ్చాయని అనుకున్నా, వెణ్ణ శబ్దం పుట్టుక విషయంలో విప్రతిపత్తి వుండదు.



# తూర్పు – పడమర



చంద్రగతిని బట్టి నెల ఏర్పడినట్టే సూర్యగతిని బట్టి దిక్కుల వ్యవహారం ఏర్పడింది అన్ని భాషలలోను. దిక్కులను సూచించే పదాల పుట్టుకను పరిశీలిస్తే ఈ రహస్యం మనకు తెలుస్తుంది.

సూర్యుడు పుట్టుకుని వచ్చే దిక్కును మనం తూఱుపు, తూరుపు, తూర్పు అని అంటున్నాము. మన సోదర భాషలయిన కన్నడ, తమిళాలలో పూర్వానికి వ్యవహరించే పదాలతో తూర్పుకు అర్థంతో పోలిక వుందే కాని రూపంలో పోలిక కనిపించదు. కన్నడంలో తూర్పుకు పర్యాయపదాలు మూడ, మూడల్, మూడలు, మూడణ అనేవి. తమిళంలో కిళక్కు. కనుక తూర్పు అచ్చంగా తెలుగుపదం.

మనకు ప్రొద్దుపొడుచు అని మరొక ముచ్చటైన వ్యవహార ముంది. కడలి కడుపును చీల్చుకు వచ్చినట్టు కనిపిస్తున్న సూర్యుని చూచిన మనవారు మొదట ఈ సుందర జాతీయం కల్పించుకున్నారు. ఈ జాతీయం ఆధారంగా మనం మరికొంత ఆలోచిస్తే తూర్పు పదం కూడా పొడుచుకొని వచ్చు, దూరి వచ్చు అనే అర్థంతోనే ఏర్పడిందని నమ్మవచ్చు. ఇంతకూ కొన్ని ప్రాంతాలలో పొద్దు తూరింది అనే పలుకుబడి కూడా వుంది.

తూరు అనే పదానికి దూరు, ప్రవేశించు, చొచ్చు, ఎత్తు అనే అర్థాలున్నాయి. తూర్పెత్తడం, తూర్పారబట్టడం మనకు తెలిసినవే. సూర్యుడు తూరి—దూరి వచ్చే ప్రాంతం గనుక తూరు అనే పదం మొదట ఏర్పడి వుంటుంది. ప్రొద్దుతూరు అనే పదసముదాయం నుంచి మొదటిపదం వ్యవహారంనుంచి తొలగి తూరు మాత్రం మిగిలింది. తూరు పదానికి ఉచ్చా

రణలో కలిగే తొందరనుబట్టి కడపట వుకారం చేరగా తూరువు అయి క్రమంగా తూరుపు, తూర్పు అయాయి తూరువు పదం మనకు కనిపించదు. భావార్థకపదాల తుదను అనవసరంగా కేవలం ఉచ్చారణవల్లనే - వు చేరిన పదాలు మనకెన్నో వున్నాయి; చెరు-వు, మరు-వు, కొలు-వు మున్నగునవి (ఈ వు-పు తర్వాత కృత్ప్రత్యయాలయాయి)

ధాన్యాన్ని ఆరబట్టడంలో గంపలతోనో, చేటలతోనో ధాన్యరాశి నుంచి ముంచెత్తవలసి వుంటుంది. ఇలా చేయడం ధాన్యంలోని దుగ్గు దూర తొలగించడానికే ప్రాధాన్యమయినా, తొలగించడానికి జరిగే కార్య కలాపం హంగునుబట్టి - గంపలతో నింపి విసురుగా పైకెత్తడంబట్టి-తూర్పు పట్టడం అనే వ్యవహారం వచ్చింది. దిక్కును సూచించే పదానికీ, దీనికి భేదం తెలియడంకోసం తూర్పుతోపాటు ఎత్తడం, ఆరబట్టడం అనే పదాలు చేర్చి వ్యవహరించవలసి వచ్చింది.

మూడు అనే పదం మనకు విపరీతార్థంలో వుంది. "వాని కేదో మూడింది!" అని అంటుంటాము ఎవరి వెర్రివేషాలన్నా చూచినప్పుడు, కోపంకొద్దీ ఏదో విపరీతంగా పుట్టుకవచ్చిం దన్నమాట. అంటే, పుట్టిన తర్వాత కలిగిన పరిణామానికి మనం ప్రాధాన్య మిచ్చినా మన్నమాట. కాని, మూడు పదం కన్నడంలో మామూలుగా పుట్టు, ఉదయించు, కని పించు, ఎక్కు అనే అర్థాలలో వుంది. సూర్యుడు మొదట పుట్టిన స్థలం మూడ మూడల్, మూడలు. కడపటి లకారం అనునాసికంగా మారి మూడణ అయింది.

తమిళంలో తూర్పుకు వ్యవహరించే కిషక్కు పదంలో తెలుగు పొడుచు, తూర్పు పదాలలోని భావావేశం కాని, మూడలు అనే కన్నడ పదంలోని సహజ సౌందర్యం కాని కనిపించదు. సూర్యుడు మొదట క్రిందుగా కనిపించినచోటు కిషక్కు. మన క్రింది, క్రి పదాలకు మూలరూపమయిన కీష్ పదమే యీ కిషక్కు పదానికి తల్లి.

పొద్దుమనిగే దిక్కును తెలిపే పదాలు మనకు రెండు వున్నాయి - పడమర, వెనుక. వెనుక అనే పదం వెనక, వెన్క అనే రూపాలు కూడా పొందింది. కన్నడంలో మన పడుమరలను పోలిన పడువలు అనే పదం వుంది. పడుమర పుట్టుక తెలుసుకొనడానికి పడువలు తోడ్పడుతుంది. పడు అనే పదానికి పండుకొను, క్రిందికి పోవు, అస్తమించు, గడచు, మరణించు అనే అర్థాలు కన్నడంలో వున్నాయి. తెలుగులోనూ యీ అర్థాలే వున్నాయి. కాగా, పడువల సూర్యుడు పడిపోతున్న వలను—దిక్కు. పడువల క్రమంగా పడుమర-పడమర అయింది.

వెనుక, వెన్క అనే పదాలు పిన్, వెన్, పిన్చు, వీపు అనే పదాల వంటివి. మొదటి వాచకం సూర్యుని పాఠంలో చెప్పినట్టు మనం సూర్యునికి ఎదుట నిలుచుంటే మన వీపు వెనుక వుండే దిక్కు అన్నమాట.

సూర్యుడు పడిపోవడ మనడం అశుభంగా భావించారేమో, తమిళులు పశ్చిమానికి మేఱ్కు అన్నారు. మేఱ్ అనగా మీద. సూర్యుడు ఉదయించి మీదికి వెళ్ళిన తర్వాత వుండే దిక్కు మేఱ్కు. మేఱ్ పదమే మేల్. మేలిమి మున్నగువాని తొలి స్వరూపం.

తమిళంలో కిషక్కు, మేఱ్కు అనే పదాలు ఆ దేశపు నైసర్గిక స్థితినిబట్టి వచ్చినవని కాల్డ్వెల్ అన్నారు.



# తెన్ను

13



ఉత్తర, దక్షిణ దిక్కులను సూచించే తెలుగు పదాలు వాడుక నుంచి ఎలా, ఎప్పుడు జారిపోయాయో - వాటి స్థానాన్ని సంస్కృతపదాలు ఎప్పుడాక్రమించుకున్నాయో చెప్పలేము ఆ పదాలు పాత సాహిత్యంలో మాత్రం కొన్ని చోట్ల కనిపిస్తున్నాయి; దానిని బట్టే అవి ఒకప్పుడైనా వాడుకలో వుండేవని నమ్మడానికి అవకాశం వుంది.

ద్రవిడభాష లన్నిటిలోను దక్షిణదిక్కుకు ఒకప్పుడు వాడుతున్న మాట తెన్. మనకు తెన్‌తో చేరిన పదాలు కొన్ని వున్నాయి - తెన్ను, తెనాలి, తెంకి, టెంకి, టెంకణం, టెంకణాలు, టెంకాయ, టెంకిచేప లాటివి. ఇవన్నీ దక్షిణ దిక్కుతో సంబంధం కలవే.

తమిళంలో తెన్ పదానికి అందం, స్వచ్ఛం, మధురధ్వని, పాట, మాధుర్యం, దక్షిణం, టెంకాయ, కుడిపక్క మున్నగు అర్థా లున్నాయి. దిగ్వాచకంలో తెరుక్కు అనే పదం వుంది. కన్నడంలోని తెం, తెన్, తెంక, తెంగు, తెంకల్, తెంకలు, టెంగు, టెంకలు పదాలు దక్షిణానికి వాడుకలో వున్నాయి. తెన్ను పదానికి తమిళనాడులోని కొన్ని మండలాలలో క్రిందికి నెట్టు, వెనకకు తోయు అనే అర్థా లున్నాయి. తెన్ దిక్కు పుట్టుకను తెలుసుకొనడానికి మన కీ అర్థం తోడ్పడుతుంది.

మనకు ఎడమనుంచి కుడివైపు వ్రాసే అలవాటు సహస్రాబ్దాల నాటిది. ఎడమవైపును ఎగువగాను, కుడివైపును దిగువగాను వాడడం కద్దు. సూర్యునికి ఎదురుగా మనం నిలబడి దిక్కులను పేర్కొన్నప్పుడు ఎడమ ప్రక్క వుండేది ఎగువదిక్కు (ఉదీచీ). కుడిప్రక్క వుండేది దిగువదిక్కు

(అవాచీ) సూర్యుడు ఉత్తరాయణంలో ఉత్తరంవైపు, దక్షిణాయనంలో దక్షిణంవైపు వాలివుంటాడు. కాగా, సూర్యుడు కిందకి వాలివున్నవైపు తెన్-తెన్ను-తెంకు-టెంకణం అని వూహించవచ్చు.

తెంకణం దక్షిణ దేశం. మన నన్నెచోడుడు టేంకణాదిత్యుడు. తెంకణం అనేది కడప, కర్నూలు, నెల్లూరు మండలాలకు ఒకప్పుడు వాడుకయి వుండేది. ఆపైనవున్న ప్రాంతానికి దక్షిణానవుందన్నమాట. ఆ ప్రాంతాలను పాలించిన నన్నెచోడుడు - నెల్లూరు జిల్లావాడే గనుక - టేంకణాదిత్యుడని బిరుదు పెట్టుకొని వుంటాడు. తెనాలికి తొలిరూపం తెన్నాలి. 'తెన్నాలి రామకృష్ణుకు తిన్నాదయ తట్టెడంత' అని ప్రాసలో ఒక చాటువు వుంది. కనుక తెన్నాలి నేడున్నట్టు పట్టణ విశేష వాచకం కాక, ప్రాంత వాచకం కావచ్చు. ఆ పై ప్రాంతానికి దిగువగా-దక్షిణంగా వుండే దేశం తెన్నాడు. క్రమంగా తెన్నాడి అయి, నేడు తెనాలి అయింది; కాకినాడు కాకినాడ అయినట్టు. టెంకాయ - తెన్‌కాయ మనకు. మనకంటే దిగువగావున్న తమిళులకు కూడా యింకా దిగువనుంచీ వచ్చిందే. వేరుసెనగ - మనిలా కొట్టై - మనిలా ద్వీపంనుంచి, టెంకాయ ఆ పరిసర ద్వీపాలనుంచి భారత దేశానికి వచ్చినవని వృక్షశాస్త్రజ్ఞు లంటున్నారు. తెమ్మెర పదానికి దక్షిణపు వాయువు అనే అర్థం ప్రచారంలో వుంది. తెన్ - ఈరల్ కన్నా తెమ్— ఈరల్ అని విగ్రహం చేసుకుని అర్థం చెప్పడం వుచితం. తెమ్ - చల్లని, నీటి తడిగల అనే అర్థాన్ని చెమ్మ, తేమ అనే పదాలు బలపరుస్తాయి. చెమ్మ క్రమంగా తెమ్, తెమ్మ, తేమ అయింది.

మొదట దక్షిణ దిగ్వాచకంగా వున్న యీ తెన్ క్రమంగా వైపు అనే అర్థంలో వ్యవహృతమై తర్వాత దారి అనే అర్థం కూడా వచ్చి, 'దారి తెన్ను' అనే నానుడిగాను పరిణమించింది. ఉదాహరణకు: సంస్కృతంలో వర్షశబ్దం మొదట కేవలం వర్షఋతువే. తర్వాత అది ఆవృత్తంగా ఏర్పడే సంవత్సరకాలానికి అర్థమయింది.

తెన్ను - దిగువ ఉండే దిక్కు అనడానికి సంస్కృతంలోని అవాచీ శబ్దాన్ని వివరించడం అప్రస్తుతం కాదు. అవాక్, అవాజ్ పదాలకు కింద, కిందుభాగం అని అర్థం. అవాచీ కిందిదిక్కు. అవాజ్ అంచతి - సూర్యుడు ఏ ప్రాంతంలోనయితే క్రిందుగా చరిస్తాడో, ఆ దిక్కు అవాచీ.

సంస్కృతంలోని దక్షిణ పదానికీ, దక్ష్ క్రియకూ గల అర్థాలనుబట్టి చక్కని కథ పేనవచ్చు. దక్ష్ క్రియకు పెరుగు, వృద్ధిపొందు, చంపు, సాధించు సమర్థుడగు వంటి అర్థా లున్నాయి. దక్షిణ శబ్దానికి దిక్కు అనే అర్థంతోపాటు సమర్థుడు, న్యాయశీలుడు, వినీతుడు మున్నగు పెక్కు అర్థా లున్నాయి. ఆర్యులు క్రమంగా మన దేశంలో వ్యాపిస్తూ వచ్చారనే వాదాన్ని మనం అంగీకరిస్తే దక్ష్, దక్షిణ శబ్దాల అర్థాలు దానిని ధ్రువపరుస్తాయి. ఆర్యులు త్రోసుకుని వచ్చారనుకోండి మన దేశం మీదికి, మొదట తమ ఎదిరిని చంపుతూ, జయం పొందుతూ, దేశాన్ని సాధిస్తూ, అభివృద్ధికి వచ్చారు. అలాంటివారంతా దక్షులు. ఓడిపోయిన అనాదివారంతా క్రమంగా అణగిమణగి వుంటూ వచ్చారేమో! వారిని చూచి దక్షులని-వినీతులని, ఎంతో న్యాయశీలురని ప్రశంసించారేమో విజేతలు!

ఇండో యూరోపియన్ భాషలు కొన్నింటిలో జెన్, డెన్ వంటి పదాలు దక్షిణ దిగ్వాచకాలుగా ఉండడంవల్ల ద్రవిడ భాషలలోని తెన్‌కు, జెన్, డెన్ లకు మూలపదం మరొకటి కావచ్చునని శ్రీ శివలెంక రాధాకృష్ణ గారు అంటున్నారు.



16

# వడకు



సంస్కృతంలో ఉత్తర దిక్కును సూచించే పదాల పుట్టుక తెలుసు కోడంలో చిక్కేమీ లేదు. సూర్యుని చుట్టి వస్తున్న భూగోళంలో— ధ్రువనక్షత్రాన్ని కేంద్రంగా భావించి భూభ్రమణం గుర్తించినప్పుడు— దక్షిణం అవాచి— కింది దిక్కు; ఉత్తరం ఉదీచి - పై దిక్కు. తెలుగు, కన్నడ, తమిళ భాషావర్గంలో తెన్ పదానికి కింది దిక్కు అనే అర్థం చెప్పకో గలిగాము గాని, ఉత్తర దిక్కుకు వ్యవహరించే పదాల అర్థం కొంత చిక్కుపడకుండా నిర్ణయించుకోలేము

తెనుగులో ఉత్తర దిక్కును సూచించే పదాలలో బడుగు, బడువు, వడకు ప్రాచీనమైనవి. ఈ పదాలను పోలినవే తమిళ, కన్నడాలలో వున్నాయి. తమిళంలో వడ, వడక్కు; కన్నడంలో బడగు, బడగ, బడగల్, బడ. వీటన్నిటికీ ఉదీచీ అనే పదంవలె పై దిక్కు అని చెప్పడానికి వీలు పడదు. కాగా, చలి అని అర్థమిచ్చే వడ, వలి పదాలు వీటికి మూలమయి వుంటాయేమో పరిశీలిద్దాం

తెలుగులో చలిని సూచించే పదాలలో వలిపిరి, వలి అనేవి వున్నాయి వలి కల్గించేవాడు కనుకనే చంద్రుడు వలి ముద్ద, వలి వెలుగు అయ్యాడు. వలికన్నా పాతదైనది వడ శబ్దం. వడతో చేరిన మాటలు మనకు చాల కొద్దిగా వున్నాయి; వడగల్లు, వడగాడ్పు, వడపప్పు. వడగల్లు = చలిరాయి, మంచురాయి. వడపప్పు = నానవేసిన చల్లని పప్పు. వడగాడ్పు మాత్రం మనకు వేడిగాలి. ఉత్తరపు వేడిగాలి కాబోలు! ఈ వడ అనేమాట పుట్టుకే ఉత్తరదిక్కును సూచించే వడకు, బడుగు, బడువు పదాల మూలస్వరూప జ్ఞానానికి తోడ్పడుతుంది.

చలికి మనదేహం కంపిస్తుంది; వదవద వణకుతుంది; గడగడ లాడుతుంది; తడబడుతుంది; ఈ అనుకరణంవల్ల వణకు, వడకు పదాలు పుట్టాయి. కన్నడంలో బళకు, బళంకు పదాలున్నాయి. బళకు అనే పదానికి వడకు అని అర్థం; బళంకు అన్నదానికి వంగు అని అర్థం. ఇవి కూడా అనుకరణ వాచకాలే. చలివల్ల కలిగే చేష్టితాన్ని తెలిపే యీ పదాలు క్రమంగా చలికే పర్యాయాలుగా పరిణమించాయి. ఈ మాట కలయికతో వేరే మాటలు కూడా పుట్టుకువచ్చాయి; వడకు గుబ్బలి = హిమవత్పర్వతం, వడగల్లు = మంచురాయి. తమిళంలోను వడమలై = కైలాసం; వడ కాట్రు = ఉత్తరపు గాలి; వడకోడై = పశ్చిమోత్తరపు చలిగాలి.

ఇంచుమించు భూమధ్యరేఖ దరిదాపులలో స్థిరపడిపోయిన ద్రావిడులకు ఉత్తరం వైపు పోనుపోను చలి ఎక్కువ కావడంలో వింతేమి లేదు. తమకు ఎగువగా వున్న ఉత్తరాన్ని చలిదిక్కు, వడదిక్కు, వడకు, బడుగు, బడువు అని వ్యవహరించుకొని వుంటారు. వడంకులోని అనునాసికం ఎప్పుడు జారిపోయి వడకు అయిందో చెప్పలేము.

ఉదకమండలం ప్రాంతంలో ఒకజాతి ఆనాదివారున్నారు. వారిని బడగరు లంటారు. బడగ తెగవారన్నమాట చలిదేశంలో వున్నందువల్లనే వీరికి ఈ పేరు వచ్చింది. బడగరులు చలిప్రాంతంలో వున్నవారు అని మనం సులభంగా అర్థం చెప్పుకోవచ్చు. వడ, బడ అనే మాటలు మొదట చలికి, తర్వాత చలి ఎక్కువగా వున్న ఉత్తరదిక్కుకు సంకేతమయిందనడానికి బడగరు లొక నిదర్శనం.

అయితే వడగాడ్పు అనే పదానికి ప్రసిద్ధంగా వేడిగాలి అనే అర్థం రూఢమై వుండగా, వడ శబ్దానికి చలి అనే అర్థం మాత్రమే వుందని వాదించడం వల్ల అతివ్యాప్తిదోషం రాదా అనే ఆక్షేపణ వుండనేవుంది. ఈ ఆక్షేపణను మనం డొంకతిరుగుడు సమాధానంతో సర్దుకోవలసి వుంది.

మనకు తీవ్రతను సూచించే వఱ వఱపువంటి పదాలు పెక్కువున్నాయి. వఱపు క్షామం, వఱ తీవ్రత, వేడి. కన్నడంలో మన వఱపును పోలిన బఱ అనే మాట వుంది దానికి బీడుపడిన, ఎండిపోయిన అనే అర్థాలున్నాయి బఱకు అనే కన్నడ పదానికి వట్టిపోయిన ఆవు అని అర్థం వడి అనే కన్నడ పదానికి ఎండవడ వేడి అనే అర్థాలున్నాయి. చలికాలంలో ఉత్తరంనుంచి వడగాలి చలిగాలి విసురుగా వీచి ఒళ్ళు కొంకర్లు పోయేట్లు చేస్తుంది. ఎండాకాలంలో ఉత్తరం నుంచి వీచిన గాలిని, ఇతర ఋతువులలో ఇతర దిక్కుల నుంచి వీచిన గాలి తీవ్రతను, విసురునుబట్టి మన పూర్వులు ఉత్తరపు వడ (చలి) గాలితో పోల్చి వుంటారు ఆ తీవ్రతను సూచించడానికి వడ అనే పదాన్ని ఎండకాలంలో వీచే ఉత్తరపుగాలికి కూడా తగిలించి వాడటంవల్లనో, వఱ, వడి, వేడి, వడ పదాల వుచ్చారణ సామీప్యాన్నిబట్టి కలిగిన అర్థ వ్యత్యాసంవల్లనో వడగాలి అనగానే వేడిగాలి అనే అర్థం రూఢమయి వుంటుంది. తమిళంలో వడక్కాటు పదానికి ఉత్తరపు గాలి అనే అర్థం మారకపోవడం సముద్రం మీదుగా వీచే వేడి గాలిని (లాంగ్ షోర్ విండ్‌ను) దక్షిణపు వడగాడ్పులు అని మనం వ్యవహరించడం వడగాడ్పులు అనే పదం మొదట్లో వేడిగాలి అనే అర్థంలోకాక చలిగాలి అనే అర్థంలోనే వాడుకలో వుండిందనడానికి నిదర్శనాలు. ఒకటేమో చలి గాలి; మరొకటేమో వడను (చలిని, తేమను) ఆర్చే గాలి.

ఉదక్ అనే అతి ప్రాచీనమైన సంస్కృతపదమే వడకు అన్న దానికి మూలం కాకూడదా? కావచ్చు. అప్పటికీ, అది శీతబాధానుకరణ వాచకమే నని సమాధానం ఉండనే వుంది.



19

# రోలు - రోకలి



''మనం ఈనాటి వాళ్ళమా? రాతియుగం నాటి వాళ్ళం. మనిద్దరికీ మొదట్లో ఒకే పేరు వుండేవి. నిజానికి మనం కవలలం. మనలో ఎవరిని పిలిచినా యిద్దరం పలికేవారం. జనానికి చెడ్డ చికాకుగా వుండేది. ఇప్పుడేమో నీవు ఆర్యుణ్ణని అంటూ మొగం యింత చేసుకుంటావు'' అన్నది రోలును చూచి రోకలి.

''అబ్బే. నేను ఒప్పుకొను. నేను ఆర్యుణ్ణే. ఉదూఖలం నా తల్లి'' అన్నది రోలు.

''ఓరి వెర్రిబ్బాయి! ఉదూఖలంగారు కూడ ఉత్తరాదివారు కారు! మనవారే! వారి పేరు వుచ్చారణే చెప్పడం లేదూ! కాని సంస్కృత పండితులు మాత్రం ఉదూఖలం అన్నదాన్ని పగలగొట్టి ఏదో అర్థం చెపుతా రనుకో! అది సుతరామూ నసిపడదులే. వాళ్ళు చెప్పేదేమిటంటే, ఊర్ధ్వం = మీద, ఖం - ఆకాశం వుంది గనుక ఉదూఖలం; మీద బోలుగా వుండేదీ అని'' అంటూ చరిత్ర మొదలుపెట్టింది రోకలి.

''ఇంతకూ, పూర్వం మనద్దరికీ భేదం ఏమీ లేదన్నానుగా. మొదట మనల్ని వాడుకొనే మానవజాతికి పదాలు పరిమితంగా వున్నాయి. వాటినే సదృశ రూపగణాలుగల వస్తువులకు వాడేవారు. రాను రాను సమాజం, జ్ఞానం పెరిగినకొద్దీ పదాలలో మార్పులు వస్తాయి. నీవు, నేను మొదట ఎటుబడితే అటు దొర్లే గుండ్రటి రాళ్ళం; ఉరళ్‌కల్. దొర్లే గుండ్రటి రాళ్ళయిన మనం క్రమంగా చేరి ఉరోంగల్ అని తమిళంలోను, ఒరళు అని కన్నడంలోను పేర్లు పొందాము. తెలుగువారు ఆ రెండిటి కోవనుంచి విడి

పోయేనాటికి మొదటవున్న ఉకారం ప్రక్కనవున్న ర లో చేరిపోయి రో అయింది తుదను తెలుగు పదాలకు సహజమైన ఉకార ఇకారాంత సంప్రదాయానికి అనుగుణంగా రోలు. రోకలి అయాము అప్పటికి నాకూ నీకూ పనిలో కొంత తేడా వచ్చింది. నీవు మొద్దుగా వుండడం, నేను పీలగా వుండటం చూచి నిన్ను దొర్లించుకొనే వెళ్ళేవారు. కనుక తిరుగు దొర్లు అనే పనికి ప్రాధాన్యం కలిగి రోలు అన్నంతవరకు మిగిలావు. తర్వాత కల్లుచేరి ఉరళ్‌గల్ అయింది ఉరళ్‌గల్ అంటే, రోలు, రోకలి, రుబ్బుడు రాయి, పచ్చడి నూరే పాత్రం-ఏదైనా కావచ్చు. సంఘం విస్తరించడంతో పేర్లూ, వాటితో నిర్దేశించబడే వస్తువులూ కొంత మారుతుంటాయన్నానుగా!

"చూచావా, నా తమ్ముడు రోకలిబండ! ఎంత చురుకుగా పనిచేసినా బండ అనేమాట తప్పించుకోలేకపోయాడు. వాడు బండ కాదుగా మరి? పూర్వం ఎప్పుడో ఈ జనం రెండు చదునుపాటి బండలతోనే తమ వస్తువులను దంచుకొనడం, నలగగొట్టుకొనడం జరిపేవారు. మే మిద్దరం రాతియుగం నుంచి నాగరికులమై క్రరరూపంలోకి వచ్చినా రోకలి, రోకలిబండ అనే పేర్లు పోలేదు నీకు పాత పేరూ మారలేదు; రూపమూ మారలేదు.

"ఇక ఉదూఖలం సంగతా? వాడు మనవాడే, ఆర్యుడు కాడు. పైన బయలు, బోలుగా వుండనే అర్థం చూస్తే విడ్డూరంగా లేదూ? ఈ భూగోళానికి కూడా పైనేమిటి, చుట్టూనూ బయలేగా? దానితో ఈ వ్యుత్పత్తి అతివ్యాప్తం కాదూ! నీ సవతి చెల్లెలు మరొకతె వుంది; ఖల్వం. ఒత్తు ఖ పలకడంతో భయపడనక్కరలేదు. ఉత్తరాదివారితో చేరి వెలుపలి వేషం మారిందిగాని నిజానికి మన యింటి ఆడపడుచే" అన్నది రోకలి.

"అయితే ఆర్యులకు రోలు, రోకలి అంటే తెలీ దంటావా? ఈ ద్రావిడీగాళ్ళే వారికి దంచడం, రుబ్బడం నేర్పారంటావా?" అని ప్రశ్నించింది రోలు ఉక్రోశంతో.

"వాళ్ళకూ మనలాంటివారు లేరనిగాని, దంచడం, నూరడం తెలీదని గానీ నా అభిప్రాయం కాదోయ్! పేర్లసంగతి చెప్పాను గాని. నిజం చెప్పాలంటే దంచడం. చెరగడం ఆర్యులు ఎప్పుడు నేర్చారని? కట్టె పుడకలు రాచి మంటలు చేసుకుంటూ, పచ్చిమాంసం తింటూ క్రమంగా మృగాలను వున్న దున్నట్టుగా నిప్పులో వేసి ఉడికించి తింటూ వున్న ఆర్యులు యవలు నూరడం, పిండి కొట్టడం యెప్పుడు నేర్చా రంటావు? ద్రావిడీల సంప్రదాయం వారిపై పడలేదంటావా? వారికి మనలాటివారు వేరే వున్నారేమోగాని, మనం మాత్రం పూర్తిగా దక్షిణాదివారం" అన్నది రోకలి.



# తెడ్డు-
# గరిటె



రోలు వ్యక్తిత్వాన్ని చూచి పులినిచూచి నక్కవాతపెట్టుకున్నట్టు తెడ్డు నేను ఆర్యుణ్ణని తెగ తిరగడం ప్రారంభించింది కుండలో. తను తండూః అనే సంస్కృత శబ్దంనుంచి పుట్టానని గరిటెతో అన్నది. ఉష్ణభయం లేకుండా తరింపజేస్తాను గనుక, నెరపడానికి ఎంతో తోడ్పడుతాను గనుక, తను తౄ ప్లవన తరణయోః అనే ధాతువునుంచి గాని, తను విస్తారే అనే ధాతువు నుంచి గాని పుట్టానని సంస్కృత పండితులు చెబుతారని తెగ విర్రవీగుతూ అన్నది. "నీవు వెయ్యి చెప్పు, మావాడివే. తడ, తండు జాతివాడివి ఇవి రెండు ప్రస్తుతం తమిళంలో కార్ర, కామ అనే అర్థంలో వున్నాయి. గడ్డ తల పెరిగి గెడ్డ అయినట్టు నీవూ తెండు, తెడ్డు వయ్యావు. ఇదిగో! నీ పక్కింటావిడ 'దర్వి' ఉన్నదే, ఆవిడ ఉత్తరాదిది''అని గరిటె చీకొట్టింది.

"అయితే, నీ సంగతో?" అంది తెడ్డు. ''నేను పూర్తిగా ద్రావిడీని. నా పని కరండదం—అనగా కలియబెట్టడం, త్రిప్పడం. మొదట కరండి అయ్యాను. తెలుగువారు గరిటె అని అంటారు నన్ను'' అని జవాబు చెప్పింది గరిటె.

''నాకు చూడగా నీవూ నాలాగే కర్రజాతి దానివిలాగే వున్నావు. నీ పాతపేరు కరండిలో కర్రధ్వని లేదూ? తుదలో వున్న రెండక్షరాలూ బహుశా మరొక పదం మొదటి అక్షరాలయి వుంటాయి''అని తెడ్డు అన్నది.

"అయినా కావచ్చు. మన ఆర్య సోదరుడు కంబి వున్నాడే, వాడు కూడా ద్రావిడీయేమోనని నా అనుమానం. కంబికి సంస్కృత పండితులు చెప్పే అర్థంకూడా ఒకేధోరణిసుమా; తృష్ణ నివారణకోసం దాన్నికోరుతారట.

కనుక కంచి అయిందట కమ్మిలాగవుంది గనుక కంబి అయిందేమో! అందుకోసం నీవు ఇకమీద అర్యుణ్ణనే వ్రేరివేషాలు వేయకేం?" అన్నది గరిటె.

"అంతేకాదు, రెండువేల ఏళ్ళనాడు హాలుని కాలంలోను మన కర్ర జాతివారు చాలామంది వివిధ రూపాలలో ఉన్నారు. వారిలో ఒక చటుఅం అంటే అన్నం, కూరలు మొదలగునవి తోడుకొనడానికో మరెందుకో వాడుకునే చిన్న కర్ర పళ్ళెం లేక కర్రగరిటె. ఇది పూర్తిగా చెట్టునుంచి వచ్చినట్టు దాని ముఖమే చెబుతుంది. హ్రస్వ చకారం ప్రాకృతంలో వాచికంలో వున్నా వ్రాతలో లేదు. కనుక చట్టు అం అయి, క్రమంగా సంస్కృతంలో చటుక అని చేరిపోయింది" అని తన పాతవారిని వివరించింది గరిటె. చట్టువం అని భారత ప్రయోగం.



# పులి మీద పుట్ర



"దొంగలమీద దొర వున్నాడు. పులిమీద పుట్ర వుంది" అని మన నాయనమ్మలూ, అమ్మమ్మలూ చిన్నప్పుడు కథలు చెప్పగా మనమంతా విన్నాము. జనాన్ని దోచుకుని నానాబాధలూ పెట్టే దొంగలను శాసించేవాడూ వున్నాడని, మనుష్యులను పొట్టబెట్టుకునే పులివంటి క్రూరమృగాన్ని అదుపాజ్ఞలలో పెట్టే మరొక ఏదో వుందని మన లేత మనస్సులకు నచ్చ జెప్పడమే ఆ కథల వుద్దేశం.

తీరా, మనం పెద్దవాళ్ళం అయాక చూస్తే "పులిమీద పుట్ర" అనే నానుడి ముసలమ్మలు చెప్పిన కథకు ఎంతమాత్రమూ సంబంధంలేని మరొక అర్థంలో వున్నట్టు తెలుసుకున్నాం. అసలే యింట్లో ఇబ్బంది పడుతున్నా మనకోండి! మరొకరు అకస్మాత్తుగా వూడిపడతారు. "పులిమీద పుట్రలాగ వీ డెక్కడ వచ్చిపడ్డాడు రా బాబూ!" అని లోలోపల విసుక్కుంటాం.

కష్టాలు మీద మీద విరుచుకుపడ్డప్పుడు కలిగిన మనస్థితిని తెలిపే నానుడులు మనకు బోలె డున్నాయి - గోరుచెట్టుపై రోకలిపోటు, ఉండే కర్మంలో_ ఉపాకర్మ లాంటివి. ఇలాటి వాటి పుట్టుకను ఎక్కువ శ్రమ లేకుండానే తెలుసుకోగలుగుతున్నాం. కాని "పులిమీద వుట్ర"లో పులికీ, పుట్రకూ గల సంబంధం ఏమిటో, అమ్మమ్మల కథే నిజమో. వ్యవహారంలో వున్న అర్థమే నిజమో తెలుసుకోవడం కొంచెం శ్రమ.

"పులిమీద పుట్ర"లోని పులి అమ్మమ్మలు చెప్పే పులి మాత్రం కాదు. ఇది పాము పాముకు పురుగు అనే వ్యవహారం తెలుగుదేశమంతటా వుంది. "పాము కరిచింది" అనడానికి మారు "పురుగు తాకింది, పురుగు ముట్టింది" అని గ్రామాల వ్యవహారం.

పురుగు పదం పాతరూపం "పుళ్షు" ద్రావిడ భాష లన్నిటిలోను ఒకప్పుడు వ్యవహారంలో వున్న "ళ్ష" అనే ఉచ్చారణ తమిళ, మలయాళ భాషలలో నేటికీ నిలచింది: కన్నడంలో ప్రాచీన భాషలో (పళగన్నడంలో) వున్నా, నవీన భాషలో "ళ" గాను, తెలుగు "ఱ" "డ" "ళ"లు గాను మారిపోయింది. ఉదాహరణకు కోళ్షి - కోడి, వళ్షి - వడి, వళి లాంటివి ఎన్నో వున్నవి.

పుళ్ష, పుళ్షి, పుళ్షు అనే మూడు పురుగు పూర్వరూపాలూ కన్నడంలో వున్నవి. క్రిమి, పాము అనేవి ఈ పదాలకు అర్థాలు. తెనుగులో పురుగు, పుళి, ప్రువ్వు అనే మూడు మాటలున్నాయి. పురుగుకు ముందు రూపం పురు. పురు క్రమంగా బహువచన ప్రత్యయమైన గులలోని గుకారంతో చేరి విడిపోయి పురుగు అయింది పుళి సాహిత్యంలోకి, నిఘంటువుల్లోకి యెక్కకపోయినా, ప్రజల నాలుకపై పులిగా నిలిచిపోయింది; ఎలుక పదానికి ప్రాచీన రూపమయిన "ఎలి" నిఘంటువులలో లేకపోయినా, ఎలి పాషాణం అనే ఒక్క వ్యవహారంలో మాత్రమే మిగిలిపోయినట్టు క్రమంగా పులి శబ్దానికి వ్యాఘ్రం అనే అర్థ భ్రాంతి కూడా కలిగింది.

పులి అనేది వ్యాఘ్రం కాదు;పురుగు అని మనం నిర్ధరించుకున్నప్పుడు ఈ నానుడి పుట్టుకను సులభంగా ఊహించుకోవచ్చు ఒక పాము మనపై పడితేనే తలప్రాణం తోకకు వచ్చి గిలగిల తన్నుకుంటాం కదా! అమాంతంగా పుట్టకు పుట్టే మనపై విరుచుకుపడితే మన గతేమిటి? కైముత్య న్యాయం!

మన పూర్వులు కొందరు ఏ గుట్ట క్రిందనో, పుట్టలు ఎక్కువగా వుండే మెట్టక్రిందనో కాపురం వున్నారనుకోండి! వర్షాకాలం. వర్షం పడి పాములు క్రిందికి రావడం, వర్షం మరింత తీవ్రం కాగా, పుట్టకు పుట్టే పెల్లగించుకుని మీదపడడం సంభవించి వుంటుంది. అప్పుడు "పులి, పులి మీద పుట" పడడం ప్రత్యక్షంగా చూచిన ఒక రసికుడు కష్టాలు ఒకదాని మీద మరొకటి పడినప్పుడు దానిని ఉపమానంగా తీసుకొని చమత్కరించి వుంటాడు అదే వ్యవహారంలోకి వచ్చివుంటుంది.

పురుగు శబ్దానికి పులి ప్రాచీన రూపమైనట్టు, పుట్ట శబ్దానికి పుట ప్రాచీన రూపం నిఘంటుకారులు దీని జోలికి వెళ్ళలేదు ద్రావిడభాషలో రెండు బండిరాలు చేరినప్పుడు ట్రకారోచ్చారణ కలుగడం సంప్రదాయం. పుట్ట పురుగులు - పాములు - వున్న స్థలంగా నేడు వ్యవహారంలో వున్నా మొదటి అర్థం పామే. పుట పదాన్ని మరింత గట్టిగా చెప్పదలచినప్పుడు తుది హల్లును ఒత్తి పలకడంలో పుట్ర పుట్ట అయింది. హెచ్చు అపాయం దాపురించిందని అనడానికి దంద్వపదాలు, సమాసాలు పురుగూ - పుట్రా వంటివి వాడినట్టే తీవ్రతను, ఆధిక్యాన్ని తెలుపడానికి రెండు పదాలు వాడడం ఇతరత్రా కూడా వుంది: కర్ర గట్రా, గడ్డా గుడుసూ, మిట్టుమిట్టా, నగా నట్రా. గట్రా అనేది కర్రను ఊది పలకడంవల్ల కలిగిన మారురూపమే!

ట్ర తమిళ, మలయాళాలలో మాత్రమే నిలిచింది. కన్నడంలో "త్త"గాను, తెలుగులో "ట్ట"గాను మారింది తమిళంలో పుఱ్ఱు అని వ్రాసినా ఉచ్చారణ మాత్రం పుట్రు కన్నడంలో పుత్తు తెలుగులో పుట్ట మన వైయాకరణులు పుట్ర పదాన్ని ఎందుకు గ్రహించలేదో? ప్రజలు మాత్రం "పురుగూ పుట్రా", "పులిమీద పుట్ర" అనే రెండు నానుడుల లోను దీనిని భద్రపరచారు. పురుగూ పుట్రా - అన్నప్పుడూ, పురుగు పామే ననడం విస్పష్టం.

పురుగు కరిచేది గనుక, క్రూరమృగమైన వ్యాఘ్రం కూడా కరిచేదే గనుక ఉభయత్రా వున్న పని సాదృశ్యాన్నిబట్టి వ్యాఘ్రానికి కూడా పులి అనే వ్యవహారం వచ్చిందేమో!



# ప్రొద్దు — నెల



సూర్యుని పేర్కొనే పదాలు తెలుగులో దాదాపు ముప్పయి వున్నాయి. వాటిలో ప్రొద్దు, వెలుగు అనేవి చాల పాతవి. గాములరేడు, మిన్కులఖరణి వంటి తక్కినవన్నీ కవులు సంస్కృత పదాలకు పర్యాయాలుగా కల్పించినవే.

ప్రొద్దు అనే పదం మొదట సూర్యుడు అనే అర్థంలో వుండి, క్రమంగా దినం, కాలం అనే అర్థాలలోను వ్యవహరింపబడుతూ వచ్చింది. ఉదాహరణకు — ప్రొద్దు పొడిచింది. ఈ ప్రొద్దు, అప్పుడు, యిప్పుడు, ఎప్పుడు.

ఈ ప్రొద్దు పుట్టుక తెలుసుకొనడానికి మనం తెనుగు తోబుట్టువుల తోడ్పాటు పొందవలసి వుంటుంది.

తమిళంలో సూర్యునికి ఞాయిఱ్ మున్నగు పర్యాయాలతోపాటు పొళ్ళుదు అనే పాత పదం వుంది. దీనికి కాలం, సమయం, జీవితం, క్షణం, సూర్యుడు అనే అర్థాలున్నాయి. కన్నడంలో పొళ్తు, పొత్తు పొర్తు అనే పదాలున్నాయి. ఇవన్నీ పొళ్ళుదుతో సంబంధం కలవే. పొళ్ళుదు అనే పాత పదం పొళ్తు, పొత్తు, పొర్తు అని కన్నడంలోను; ప్రొద్దు, పుడు (ఏ + పొళ్ళుదు—ఎప్పొళ్ళుదు = ఎప్పుడు) అని తెనుగులోను మారిపోయింది.

మనకు 'పొద్దు పొడిచింది', 'భళ్ళున తెల్లవారింది' అని చక్కని ప్రయోగాలున్నాయి. సూర్యుడు దేనినో చీల్చుకొని వస్తున్నట్టు తోచడం వల్ల, సూర్యుడింకా కొన్ని గంటలకు ఉదయిస్తాడనగానే చీకట్లు విరిగి

పోవడంవల్ల ఈ చక్కని ప్రయోగాలు మన భాషకుల మనస్సుకు తట్టి వుంటాయి సూర్యుడు చీల్చుకొని, తూరి వచ్చే దిక్కు తూర్పయినట్లు; పొడుచుకుని, తూరి వచ్చేది ప్రొద్దు అయివుంటుంది. తమిళ, కన్నడాలలో పోళ్ ధాతువుకు చీల్చు, ముక్కలు చేయు, బారుగా తెరచు, లోపలికి జొర బడు, నశింపజేయు అనే అర్థా లున్నాయి. తెలుగులోని పొలియించు, బొలియించు ధాతువులు పోళ్‌తో సంబంధం కలవే ఈ పోళ్ పోళుదు గాను, ప్రొద్దుగాను మారిందని వూహించవచ్చు.

ప్రొద్దు చాల పాత మాట అనడానికి తెలుగుదేశంలోని అనాది జాతుల వ్యవహారమే సాక్షి. ఎరుకలవారు సూర్యునికి ప్రొద్దు అని నేటికీ వాడుతున్నారు.

ప్రొద్దు అనే పదం సంస్కృత బ్రధ్న శబ్దంనుంచి పుట్టిందనే వాదం ఒక తరంక్రిందే ఖండించబడింది.

చంద్రుని గతి ప్రపంచంలోని చాల జాతులకు దారిచూపింది. క్రమ బద్ధమయిన చంద్రగతిలోని హెచ్చుతగ్గులు పెక్కు జాతుల కాలవ్యవస్థకు మూలమయ్యాయి నెల శబ్దం అర్థపరిణామమే దీనికి తార్కాణ.

చంద్ర పర్యాయాలు తెలుగులో దాదాపు ముప్పయి వున్నాయి. వాటిలో నెల, జాబిల్లి అనే మాటలు చాల పాతవి.

తమిళంలో మన నెలకు ముందురూప మనదగిన "నిలా" వుంది. దానికి చంద్రుడు, వెన్నెల, కాంతి, వైభవం అనే అర్థా లున్నాయి. కాని, నెల (మాసం) అనే అర్థం లేదు తమిళంలో "తింగళ్" అనే మరొక పదానికి చంద్రుడు, నెల అనే అర్థా లున్నాయి. మనకు అతి సన్నిహితంగా వున్న కన్నడంలో తింగళు అనే పదం వుంది గాని, నెల పదం కనిపించదు. ఈ తింగళ్ పదానికి కూడా చంద్రుడు, నెల అర్థాలే వున్నాయి.

చంద్రునిలో మనకు కనిపించే ముఖ్యలక్షణం కళల హెచ్చు తగ్గులు. కాని, మన ఆదిపురుషులు హెచ్చడానికి మాత్రమే ప్రాధాన్య మిచ్చి, చంద్రు

నికి ఒక సంకేతం ఏర్పరచుకొన్నారేమో! ఈ దృష్టితో మనం ఆలోచిస్తే నిళ్, నిల్ వంటి శబ్దం నిలా, నెలలకు మూలమయినట్టు తోస్తుంది.

తమిళంలో నిళ్ క్రియకు వ్యాపించు, నింపు, నెరవు, నెరయు అనే అర్థా లున్నాయి. కాయగూరలు రంగు మార్చు, రంగువచ్చు శోభించు అన్న అర్థాలు దీనికై క్రమంగా వచ్చాయి. నిఱం—రంగు, కాంతి, వన్నె, నిఱై - గొప్పతనం, నిండుదనం, వ్యాప్తి.

ఈ నిఱ శబ్దం తెలుగు కన్నడాలలో నెఱ, నెఱవు, నెఱపు నిఱవు, నెఱి, నిఱి శబ్దాలుగా మారింది కన్నడంలో నెఱ, నెఱవులకు అందం, క్రమ బద్ధత, నిండుదనం మున్నగు అర్థా లున్నాయి. తెనుగులో నెఱ శబ్దం పూర్ణార్థకంలోను, వ్యాపనార్థంలోను వుంది.

దీనినిబట్టి నిళ్ క్రమంగా నాడునాటికి వృద్ధి పొందే నిలా, నెల అయిందని వూహించవచ్చు. నిల, నెల చంద్రునికి, చంద్రుని కాంతికి, చంద్రగతి కారణంగా ఏర్పడిన దినాల లెక్కకు వ్యవహార మయినందున కలుగుతున్న ఇబ్బందిని తొలగించడానికి చంద్రకాంతిని వెణ్ణిలవు (వెళ్ + నిల = తెల్లని చంద్రకాంతి) వెన్నెల అని మార్చి పలకడం ప్రారంభించారు. చంద్ర శబ్దం తెనుగుజాతి వాడుకలోకి పూర్తిగా వచ్చిన మీదట నెల శబ్దం మాసార్థంగానే స్థిరపడింది.



30

# అ వ్వా యి చు వ్వా



దీపావళికో బాణసంచా కాల్చారు కదూ! మతాబాలు వెలిగించారు; అవ్వాయిచువ్వాలు ఎగురవేశారు; సిసింద్రీ విసిరేశారు; ఉప్పుడుపొట్లాం త్రిప్పారు; అవుటు పేల్చారు; చిచ్చుబుడ్లు ముట్టించారు; కప్పగంతులు వేయించారు; వెల్లుల్లి వుండలను నేలకేసి కొట్టారు; పిచ్చికలు, వెలక్కాయలు—ఇంకా యెన్నో వెలిగించి ఆనందించారు గదూ!

ఈ బాణసంచా పద్ధతి మనదే ననుకున్నారా? కాదు. దీపావళి పండుగలో మనవారు దీపాలు వెలిగించి, కొరువులు ఆకాశానికి చూపి ఆనందించేవారు. పితృదేవతలకు దారి చూపడానికి కొరువులు చూపాలని ధర్మశాస్త్రం చెబుతున్నది. ముస్లిం సంస్కృతితో సంబంధం కలిగింది మొదలు యీ బాణసంచా కాల్చడం దీపావళిలో ప్రధానాంగ మయింది.

మహమ్మద్ పైగంబర్ మక్కాకు తిరిగి వెళ్ళిన రాత్రిని ముస్లింలు "షబే బరాత్" అని పండుగ చేసుకొంటారు. ఆ రోజు బాణసంచా విపరీతంగా కాల్చబడుతుంది. పైగంబర్ బయలుదేరిన రాత్రి చిమ్మచీకటి గనుకను, విజయోత్సాహంతోను, రకరకాల దీపాలు, మతాబాలు వెలిగించి టపాకాయలు ప్రేల్చి వుంటారు. ఊరేగింపుగా, మెరవణిగా వెళ్ళిన రాత్రి షబ్-ఇ-బరాత్.

బాణాలు, ఆయుధాల స్థానంలో వాడకానికి వచ్చాయి. కనుక బాణాలయాయి. బాణాల విధము, గుంపు: బాణసంచు, బాణసంచా.

నిప్పుతో యుద్ధం చేయడం కాకతీయరాజుల కాలంనుంచి తెలుగు దేశంలో వుంది. అల్లావుద్దీన్‌ఖిల్జీ సేనాని మల్లిక్ కాఫూర్‌తో కాకతీయులు నిప్పుతో యుద్ధం చేశారని చరిత్ర చెబుతున్నది.

విజయనగర రాజుల కాలానికి తుపాకి మందును ఉపయోగించే ఫిరంగులు, తోపులు మున్నగు రకరకాల ఆయుధాలు విరివిగా వాడకానికి వచ్చాయి దానితోపాటు దీపావళి వేడుకలు కూడా విస్తారంగా జరిగాయి కృష్ణదేవరాయల కాలంలో వసంతోత్సవానికే ప్రాధాన్యమున్నా, దీపావళి కూడా వైభవంతో జరిగేవి. కళాపూర్ణోదయంలో "బిరుసుం గ్రోవి ముట్టించిన తెరంగున" (8-వ ఆశ్వాసం) అని వర్ణించబడింది.

విజయనగర రాజుల కాలంలోనే "ఆకాశ భైరవ కల్పం" అనే సంస్కృత గ్రంథం రచించబడింది. దానిలో దీపావళీ వర్ణన విశేషంగా వుంది అమావాస్య వెనుకటి రోజు తెల్లవారుజామున లేచి తలంట్లు, రాత్రి పటాకాలు కాల్చడం మున్నగునవి శాస్త్రీయంగా జరగాలని ఈ కల్పంలో విధించబడింది.

ఉత్సవాల్లో, ఊరేగింపుల్లో బాణసంచా కాల్చేవారు. "బిరుసులు, చివ్వలు, బెళగు చంద్రజ్యోతులును నభంబెల్ల వెలుంగజేయ" అని కూచిమంచి తిమ్మకవి రసికజన మనోరంజనంలో (6-వ ఆ) వర్ణించాడు చంద్రజ్యోతి అనేది మతాబా.

మతాబు, మతాబా. అవ్వాయిచువ్వా, అవుటు మున్నగు ఈ బాణసంచా పదాలన్నీ మనవారి నోట్లో నలిగి నలిగి తెనుగు మాటలుగా వినవస్తున్నాయి గాని, నిజానికి వీటిలో పెక్కు పార్సీవి; పార్సీద్వారా వచ్చిన ఇంగ్లీషువి.

మతాబాను తీసుకోండి దీనిని మనవారు "చంద్రజ్యోతి" అన్నారు. ఈ మాట నిజంగా ఎంతో ఆలోచించి పెట్టిందే! మతాబా, మతాబు అనేవి మహతాబ్ అనే పార్సీ తద్భవాలు. మహతాబ్ నీలపురంగు గల కాంతి, చంద్రుడు. ఆఫ్తాబ్ సూర్యుడు. మొట్టమొదట నీలపురంగు, వెన్నెలరంగు మతాబాలే తయారుచేసి వుంటారు. తర్వాత తర్వాత ఎరుపు మొదలయిన రంగులవి తయారయి వుంటాయి. దీనిని పగలువత్తి అని కూడా అన్నారు.

అవ్వాయిచువ్వా, అవాయీ చువాయీ అనేమాటలూ పార్సీ తద్భవాలే. అవాయీ అనే మాటకు పైకి ఎగిరే బాణం అని ఏ నిఘంటువులో నన్నా అర్థం చూడవచ్చు. అవ్వాయి చువ్వాయికి మూలం హవాయీ సువా-గాలిని

చీల్చుకుని వెళ్ళే దబ్బనంవంటి బాణం అకార, హకారాల స్థానం ఒకటే గనుక, హంస అంచ అయినట్టు, హవాయీ అవాయీ అయింది; అవ్వాయి కూడా అయింది క్రమంగా సువాయి అనే పదం మరుగయిపోయి అవాయి అని మాత్రమే కొన్ని చోట్ల వ్యవహారంలో మిగిలింది. మరికొన్ని చోట్ల సువా జువ్వగా మిగిలి వెనుక తారాచేరి తారాజువ్వ. పేకజువ్వ అని వాడుకలోకి వచ్చింది. పేకముక్కలతో తయారుచేయడంవల్ల పేకజువ్వ అయింది.

సిసింద్రీ కూడా మనది కాదు. హిందీ చుచుందర్‌నుండి వచ్చిందేమో! చుచుందర్ అంటే చుంచు. చుంచు ఆకారం సన్నగా, పొడుగ్గా, దాని మూతి కోసుగా వుంటుంది చుచుందర్ చిన్నదైతే చుచుంద్రీ. దాని ఆకారంలో కట్టే ఈ టపాకాయను చుచుంద్రీ అని వుంటారు. అది మనవారి నాలుకలపై నాని సిసింద్రీ అయింది.

అవుటు అనే పదానికి చట్టిఫిరంగి గుండు, పొట్టి ఫిరంగిగుండు అని నిఘంటువులలో అర్థం కనిపిస్తుంది. ఇది "హోవిట్‌జర్" నుంచి వచ్చిందని బ్రౌన్ తెలిపారు. హోవిట్‌జర్ హిందూస్థానీ బాణీలో ఓవిట్, ఔవిట్ అయి, అవుటు అని స్థిరపడిపోయింది.

తూటా, తోటా అనేవి పార్సీ మాటలే. కాకరపూవత్తుల ఆకారం కాకర కాయలలాగ గరుకు గరుకుగా వుంటుంది. పూలు కాకరపూలలా పడుతాయి గనుక ఆ పేరు వచ్చిందిగాని కాకరకాయలతో వాటికి సంబంధమేమీ లేదు.

వెల్లుల్లి బాణం వెల్లుల్లి ఆకారంతో వుంటుంది. మణిశిల పెట్లుప్పు రాళ్ళు కలిపి గుడ్డపేలికతో గట్టిగాచుట్టి పలుచని రంగు గాయితం ముక్కలో పెట్టి, కాయితం కొనలు పూవత్తులను త్రిప్పినట్టు తిప్పుతారు. వెల్లుల్లిలా తయారవుతుంది ఆకారం. దీనిని గోడ టపాకాయ అనీ, నేల టపాకాయ అనీ అనడం కూడా కద్దు.

దీపావళిపూర్వం ఈజిప్టు, బాబిలోనియా, అరేబియాలలోను ఆచరించబడేదని, దానిని ఈద్ ఉన్-నూర్ అని అనేవారని ఖురాన్ షరీఫ్‌లో పెక్కు సూరాలలో ప్రస్తావన వుందని డాక్టర్ ఎస్. జీలానీ అంటున్నారు.

33

# పల్,
# పన్-పనస



"ఊరికంతా ఒక్క దోవ, ఉలిపికట్టెకు మరొక దోవ" అన్నట్టు తక్కిన చెట్లు కాయలు కాచడం ఒక దారి; పనసచెట్టు కాచడం మరొక దారి. ఈ కాయలు చక్కగా, అందంగా కొమ్మల కొనల్లోనో, రెమ్మల పక్కల లోనో పుడుతాయా అంటే, ఉహూః; చెట్టు బోదె చివర, చెట్టు మొదలు కొమ్మలుగా చీలే పంగల్లో పుడుతాయి. అవిన్ని ఒకటీ, అరా కాదు మేదర దుకాణాల్లో అమ్మకానికి తగిలించిన చిన్నా, పెద్దా బుట్టల్లాగ పక్కపక్కనే, చాళ్ళు చాళ్ళుగా, చెట్టుచుట్టూ వేలాడుతూ ఉంటాయి. వేరుపనస సంగతి వేరుగా చెప్పనక్కరలేదు చెట్ల మొదట్లోనే పండ్లు ప్రత్యక్షం పోనీ; పండ్లయినా నారింజపళ్ళలాగా, మామిడిపళ్ళలాగా నున్నగా, చక్కని రంగుతో చూడ సొంపుగా ఉంటాయా? ఊహూ! లేదు. ఏదుపందిలాగ అంతటా ముండ్లు ప్రధానంగా కనిపిస్తున్న ఈ రెండు లక్షణాలు- పెళ్ళగాను, పళ్ళ గాను ఉండే లక్షణాలు ఈ పండుకు పేర్లుగా పరిణమించాయి.

ఈ పనస పూర్తిగా దక్షిణాపథపు పండు. కనుక పేరుకూడా దక్షిణ భాషలనుంచే రావడం ఆశ్చర్యమేమీకాదు. పనసః అనే సంస్కృత పదానికి పనస అనేది అపభ్రష్ట రూపమని తెనుగు నిఘంటువులు ఉద్ఘోషిస్తుండగా ఎంత ధీమాతో ఇది దక్షిణాది పదం అంటున్నారు? - అని శంకిస్తారేమో, వినండి

అమరకోశకారుడు పనస పండును తన నిఘంటువులో పేర్కొన్నాడు:—పనసః, కంటకి ఫలః అని. శబ్దరత్నావళీకారుడు, వైద్యక నిఘంటు కారులైన భావప్రకాశరాజ నిఘంటుకారులు, శబ్దకల్పద్రుమకారుడు దీనికి

పెట్టి పేర్లిచ్చారు! పనసః, కంటకి ఫలః, ఫణాశః, అతి బృహత్ఫలః, కాంటాలః, మహాసర్జః ఫలినః, ఫలవృక్షకః, స్థూలః, కంటఫలః, మూల ఫలదః, పూతఫలః, చంపకోషః, చంపాలుః, కంటకీ ఫలః, రసాలః, అపుష్పఫలదః, మృదంగఫలః, పానసః — అని.

పనస పదానికి వ్యాఖ్యాతలందరూ స్తుతించబడుతున్నది, సంతోష పెడుతున్నది, దేవతలను స్తుతించేది (పన్యతె స్తూయతే అనేన దేవః మను ష్యాది ర్వా ఇతి పనసః, యద్వా పనాయత్తి స్తౌతి సంతోషయతీ త్యర్థః దేవ మనుష్యాదీనితి) అని 'పన'స్తుతౌ అనే ధాతువునుంచి వ్యుత్పత్తి చెప్పారు. ఇది పనసలోని పన అన్నంతవరకు సరిపోయింది. 'స' మిగిలింది పన ధాతువు మీద అసచ్ అనే ప్రత్యయ మన్నారు. వ్యుత్పత్తి స్పష్టంగా లేని వాటి నన్నిటిని నిలవచేసే ఉణాదులలో తోసివేశారు ఒక వస్తువుకు పేరు రావడానికి దాని ప్రధాన లక్షణం ముఖ్య కారణ మౌతుంది. దానిని విన్న తర్వాత గుడ్డివారు కూడా ఆ వస్తువును కనుక్కునేట్టు వుండాలి స్తుతించ బడే పండు సంతోషపెట్టే పండు అని దేనికైనా పేరుపెడితే ఏ పండని కనుక్కోగలం? అని పండ్లూ సంతోషపెట్టేవే. రుచిగా వుంటే "సెబాష్" అని స్తుతించబడేవే. కనుక ఈ వ్యుత్పత్తి సంతృప్తికరంగా లే దనడం చెప్ప నక్కరలేదు

తక్కిన పేర్లలో కాంటాలః, కంటకిలఫలః కంటఫలః, కంటకీఫలః అనేవి పండుపై ముళ్ళనుబట్టి వచ్చినవి ఫలితః ఫలవృక్షకః, స్థూలః, బృహత్ఫలః అనేవి పండు పరిమాణాన్ని బట్టి వచ్చినవి. రసం గలది ఏదైనా రసాలం కావచ్చు ఒక రకం మామిడిపండు రసాలం, రసాలు కాలేదా? మన ప్రయోజనాన్ని బట్టి ఏదైనా పూత ఫలం—పవిత్ర ఫలం అవుతుంది. అపుష్పఫలదః అనేది పూత కనిపించనందున సకారణ మైనదే. మృదంగఫలః అనేది కాయలు పెద్దవిగా మద్దెలలాగ వుంటాయి గనుక ఆకారాన్ని బట్టి వచ్చింది. పానస, ఫణాశ పదాలు పనస అపభ్రంశాలు. చంపకోశ, చంపాళు అనేవి చంపక పుష్పపు కోశాకారసాదృశ్యంతో వచ్చిన వట. ఆలోచించవలసినవే. మూలఫలదః అనేది వేరు పనస గనుక సహే తుక మైందే. అతకని వ్యుత్పత్తి పనస పదానిది మాత్రమే.

పనస పదం వ్యుత్పత్తికోగం లోపంవల్ల అది దక్షిణాది పదమని ఊహించడానికి అవకాశం ఏర్పడింది. దీనికి కారణాలను చూద్దాం.

పనసను తమిళంలో పలా అంటారు. పల అపభ్రంశమై పిలా అనే మరొక రూపంగాను అయింది. మలయాళంలో పిలావు. పిలా అనే పదమే ఉచ్చారణ సౌకర్యాన్నిబట్టి వు ను చేర్చుకుంది. కన్నడంలో పలస, ఫలస, పలసు, హలసు తుళు, కొడగు భాషలలో పెలా.

దీనిని దూరం నుంచి చెట్టు బోదెలచుట్టూ, చెట్టు మొదలులోను తొలిసారిగా చూచిన మన పూర్వులకు వ్యాపించి ఉండడం, పరచికొని ఉండడం, అనేకంగా — ఒకటిగాకాక — పెక్కుపండ్లు ఒకేచోట కనిపించడం వంటి భావం మొదట కలిగి వుంటుంది. క్రమంగా దగ్గిరకువచ్చి చూచినప్పుడు పల్, పన్‌లు, పండ్లనుపోలిన ముండ్లు కనిపించాయి కనుక పల, పన, అనే పేర్లు వచ్చాయని భాషా శాస్త్రజ్ఞుల వూహ. పన్, పల్, అనే మాట దీనికి మూల మనడానికి సంస్కృతంలోని కంటకి ఫలః అనే మాట ఉండనే వుంది. పైన కనిపించే ముండ్లవంటి కరకుదనాన్ని బట్టి వచ్చినమాటే కదా అది!

విస్తరించు, వ్యాపించు అనే అర్థాలలో దక్షిణాది భాష లన్నిటిలోను పరి, పరె అనే మాట కనిపిస్తుంది. పల్, పన్, పనె, పన్ను, పన్నె అనే మాటలు వాడిగావుండే ముళ్ళవంటి వస్తువులకు, అనేకార్థంలోను వాడడం అన్ని దక్షిణాది భాషలలోను ఉండనే వుంది. కనుక పర్, పన్, పల్‌లలో ఏదో పనస మూలరూపానికి సన్నిహితమని కిట్టెల్ వంటి భాషా శాస్త్రజ్ఞు లన్నారు.

నేటి ఉత్తరాది భాషలలో పనస శబ్ద భవాలకన్నా కంటకి ఫల శబ్ద భవాలైన మాటలే ఎక్కువ ప్రచారంలో ఉండడం గమనించదగింది.

హిందీ—కాంటాల్, కటోల్, కాథల్, పనస్, కట్‌హల్; బెంగాలీ—కాంథాల్, కాంథాల్; అస్సామీ—క్నాథాల్. కోల్—పొరొస్. ఒరియా—పనస్. మరాఠీ—ఫెనస్, బర్మీ—పియన్నీ, పియింగ్నాయి.

ఆదిమ నిషాదజాతి వారసులైన కోల్ జాతివారు అంటున్న పౌరాన్ బర్మావారి పియన్నీ, పియింగ్నాయి పలా, పిలా శబ్దాలకు సన్నిహితంగా వున్నట్టు కనిపించడంలేదూ?

పనస దక్షిణా పథం నుంచే ప్రపంచానికి వ్యాపించిందని వృక్ష శాస్త్రజ్ఞులు అంటున్నారు. ఈ వాదం కూడా పనస పదం సంస్కృతేతర దాక్షిణాత్య పద మనడానికి సాధకం.

పనస తూర్పు కనుమలలోను, పడమటి కనుమలలోను వన్య స్థితిలో పెరుగుతుంది. సహ్యాద్రి అడవులలోను విపరీతంగానే పెరుగు తుందని, బర్మాలోను విశేషంగా పెరుగుతుందని వృక్ష శాస్త్రజ్ఞులు అంటు న్నారు. ఇది బౌద్ధశిల్ప చిత్రాలలో కనిపిస్తున్నది కనుక ప్రాచీన కాలం లోనే దక్షిణాపథం నుంచి ఉత్తరాపథానికి వ్యాపించి వుంటుందనడం నిస్సందేహం కాని, పూర్తిగా అతి ప్రాచీన కాలంలో చేరిం దనడానికి వీలు లేదు ప్రాచీన సంస్కృత సాహిత్యంలోగాని, ముఖ్యంగా చరకాది ప్రాచీన వైద్య గ్రంథాలలో గాని దీని ప్రసక్తి కనిపించదు. ఆహార నియమాన్ని గురించి—ఏది విరుద్ధాహారం, ఏది స్వస్థాహారం అని – నిర్ణయించిన ప్రాచీన వైద్యులు పెక్కు కాయగూరలను, పండ్లను పేర్కొన్నవారు పనస వంటి అతి బృహత్ఫలాన్ని చెప్పకపోవడం, ఇది సంస్కృతభాషవారికి చాల ప్రాచీన కాలంలో తెలిసిందని చెప్పడానికి అవకాశ మివ్వకుండా వుంది. ఇది 18 వ శతాబ్ది ఆఖరులో ఒక నావికునిద్వారా బ్రాజిల్ మున్నగుదేశాలకు చేరిందట.

పనస పల్, పన్ నుంచి పుట్టిందని ఇంతగా వూహించి, వాదించినా పనసలోని అంత్య సకారానికి గతేమీ కనిపించడంలేమ. సంస్కృత వైయా కరణులు పన ప్రకృతి అని, అసచ్ అనేది ప్రత్యయమని విభాగించి ఉణా దులలో వేసి —తప్పుకున్నారు. మనం సకారం ఎలా వచ్చిందో చెప్పడం కష్టమే. ఇలాటి సకారం గల చెట్లు తగిరిస, కొడిస, కొడిసె, అంటిస వంటివి మనకు మరికొన్ని వున్నాయి, వాటిలో సకారం ఎక్కడిదో? ఈ బాధ కన్నడంలోని పలసు, పలస శబ్దాలకు కూడా వుంది.

37

# వాచు—
# మొగము వాచు



ఆశలు లేనివారంటూ వుంటారా లోకంలో? ఆశలు అడుగంటి పోయిన వారు నిజానికి మృతప్రాయులే. అలా అని, దేనికిబడితే దానికి దేవురించే వారిని చూచి లోకం వూరికే వుండదు "ఏం వెర్రెత్తి పోతున్నారండీ! ఎందుకండీ, ఆ గంగవెర్రులు? కూటికి వాచిపోయి వున్నారండీ పాపం! దానికోసం ఎంత మొగంవాచివున్నారని?" అవి విసుర్లు, వెక్కిరింతలు బయలుదేరుతాయి.

వెర్రెత్తడం, వాచడం, మొగం వాచడం—అనే ఈ మూడు నానుడులలో మొదటిది ఆశపడేవారి మనఃస్థితిని, ఉద్వేగాన్ని తెలుపుతుందని సరిపెట్టుకుంటాము. కాని, తర్వాతి రెంటికీ, ఆశకూ సంబంధ మేమిటి?

ఆశలు పెల్లుబికి నప్పుడు మొగం వాచుతుందనే అభిప్రాయం మనలో చాలాకాలంనుంచి పాతుకుపోయింది కనుకనే ఇది జాతీయమై సాహిత్యంలో స్థానం సంపాదించుకుంది.

ఈ నానుడి మహిళాలోకంనుంచి వ్యాప్తిచెంది సాహిత్యపు మన్నన పొందిన దనుకుంటాను స్త్రీలు గర్భిణు లైనప్పుడు మొగమూ, కాళ్ళూ వాచుతాయి. ఈ వాపు దౌహృద లక్షణాలలో ఒకటి దీనికి వైద్యశాస్త్రం చెప్పే కారణం వేరు. దాని సారాంశ మిది: "మన రక్తంలో 'ప్లాస్మా' అనే ద్రవపదార్థం వుంది. స్త్రీలు గర్భిణులుగా వున్నప్పుడు ఈ ద్రవం క్షీరవాహక నాళాలలోకి ప్రవహిస్తుంది దానితో కాళ్లూ, మొగమూ ఉబ్బినట్టుకనిపిస్తుంది."

కాని, గర్భిణులకు కోరికలు ముప్పిరిగొంటూ వుంటాయి గనుక, ఆ కోరికల వల్లనే కాళ్లూ, మొగమూ వాస్తున్నట్టు స్త్రీలు భ్రమపడివుంటారు; కాకతాళీయమని గ్రహించక.

ఈ భ్రమ ఆధారంగా పెక్కు కథలు కూడా పుట్టుకు వచ్చాయి. ఒక చూలాలికి చేపలు తినాలనే కోరిక పుట్టిందట. ఆ యింటివారు చేపలు తినే

వారు కారు ఆమె కోరిక తీర్చకపోతే ఏమి ఉపద్రవం వస్తుందో! ఏమీ దోవ కనిపించలేదు ఆవిడేమో చేపలకోసం పలవిస్తున్నది కాళ్ళూ, మొగమూ వాచాయి. ఇదిచూచి యింట్లో ముసలమ్మకు ఒక వుపాయం తట్టింది. జీలుగు బెండుతో చేపలు చేసి పులుసులో వేసి ఆమెకు వడ్డించింది. ఆ అమాయకురాలు వాటినే ఎంతో అప్యాయంతో నమిలి "ఓస్! ఇంతేనా? చేపంటే ఎంతో రుచిగా వుంటుందనుకున్నాను. ఇంత చవ్వనా ఏమిటి?" అని అన్నదట. ఇకనేం ఆమె కోరిక తీరిందిగా! వాపు తీసింది. మామూలు పరిస్థితి ఏర్పడింది. ఇలాటి ఆడవారి కథలు లక్షలు.

కనుక, ఆడువారినుంచి ఈ పలుకుబడి క్రమంగా పండిత లోకానికి వ్యాపించి, మొదట "మొగము వాచివుంది, కాళ్ళు వాచివుంది" అనేది స్త్రీల విషయంలోనే ప్రయోగింపబడుతూ ఏకారు, దేబిరించు అనే అర్థాలలో స్థిర పడిన తర్వాత, వాచక వివక్ష కోల్పోయి అందరి విషయంలోను, ఆశా మాత్రానికే వాడబడి వుంటుంది.

తెనాలి రాముడు పాండురంగ మాహాత్మ్యంలో నిగమ శర్మోపాఖ్యానంలో నిగమశర్మ అక్కతో—

"ఏరా తమ్ముడ, నన్ను చూడచనుదే వెన్నాళ్ళనో యుండి చ
క్షూరాజీవ యుగంబు వాచె నిను కన్గోకున్కి నీ బావయు....

న్నీ రాకన్ మది గోరు; చంద్రుదు పొడుపున్ నీరాకరంబు న్బలెన్"
అని ప్రశ్నింప జేస్తాడు. "ఏము సైతమున్ వాచినవారియట్ల గరువంబున గన్గొనుచుంటి మవ్విభున్" అని వెన్నలగంటి సూరన్న విష్ణుపురాణంలో ప్రయోగించాడు తిరుపతివెంకటకవులు ఆత్మకూరు సంస్థానానికివెళ్లినప్పుడు-

"చెవులును జవరాలి చిన్నారి పొన్నారి
ముద్దు పల్కులకునై మొగము వాచె.
పోయివచ్చెద మయ్యా! నీ పున్నెమాయె,
పంపగదవయ్య యాత్మకూర్ పార్థివేంద్ర!"

అని అనువు చెప్పారు. చెవులు మొగమూ వాచాయట.

# అనాస 39



"ముక్కులేని పండు యేదో చెప్పవోయ్?" అన్నారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి పాదులు ఒకమారు, ఒక గోష్ఠిలో. అందరూ ఆలోచించారు. కాని, ఎవరికీ తట్టలేదు, "ఇంతేనా మరి? అనాసపండు కాదూ?" అన్నారు ఆయన. "మీ వాదం చాల అన్యాయ మయిందండి. ఇతర భాషలోని పదాన్ని తీసుకు వచ్చి, మన భాషలోని పదంలాగ విరిచి అర్థంచెప్పి, పోల్చుకో చూదాం అంటే, జవాబుచెప్పడం ఎలా?" అన్నాను నేను. 'సరేలే. భాషాంతర శ్లేషలు మనకు లేవూ? ఇవి సంప్రదాయ సిద్ధమైనవే. నేను చేసిన అన్యాయ మేమీ లేదు. ఒక పదం అర్థం అడిగితే మనకు వచ్చిన వివిధ భాషలలో కెల్లా ఒక్కమారు మెరుపులాగ బుద్ధిని పోటించాలి" అన్నారు శాస్త్రి పాదులు.

"ఇదేమి మరీ అన్యాయంగా వుందే. అనాస అనేది భాషాంతర పదమంటా రేమిటి యీ యన? మన తెనుగు నిఘంటుకారులు అనాస దేశ్యమని నిర్వచించి, మొగలి పనస అనే అర్థంకూడా ఇవ్వగాను!" అని నేను మరింత తీవ్రంగా ఆక్షేపించాను.

"మొగలి పనస అనే అర్థం కాదన్నవా రెవరు? అనాస అనేది విదేశ పదం అన్నారు గాని, మొగలి పనస అనే అర్థంలోనే అనాస విదేశీ పదం అన్న ధ్వనిలేదూ - పనస కాదు, మొగలి పనస అని పనసతో కొద్దిగా పోలిక వుంది. తలపై మొగలిపూవు చెండూలాగ ఆకుదుబ్బు వుంది. కనుక దీనిని మొగలి పనస అన్నారు. నిఘంటుకారులు అనాసను పొరపాటుతో దేశ్య మన్నారు. నిజానికి ఇది విదేశ పదం. అంత మాత్రమే కాదు; విదేశపు పండుకూడా" అని సమాధానం చెప్పారు ఒకరు శాస్త్రి పాదులను సమర్థిస్తూ,

"సంస్కృత సాహిత్యంలో వద్దులే. కనీసం ప్రాచీనాంధ్ర సాహిత్యంలో దీనికి ప్రయోగాలు చూపించు పోనీ?" అని సవాలు చేశారు మరొకరు; విదేశవాదికి ఒత్తాసుగా. "కాని ప్రయోగం ఉంటేనా చూపడానికి?" అంటూ నేను ఎత్తిపొడిచాను.

"ఈ పదం, పండు విదేశాల నుంచి వచ్చినవే. మనం ప్రత్యేకంగా దీనికోసం కయ్యంగాని, పరిశోధనగాని చేయనక్కరలేదు. వృక్ష శాస్త్రజ్ఞులు, భాషా శాస్త్రజ్ఞులు అవలోడనతో చేసిన నిర్ణయాలు తెలుసుకుంటే చాలు; అంతా కరతలా మలకమౌతుంది." అని శాస్త్రపాదులు జోక్యం చేసుకున్నారు. "అయితే వివరించండి" అన్నారు జిజ్ఞాసువు లందరూ ఏక కంఠంగా.

"సరే మనదేశంలో దీనికి గల సమానార్థక పదాలను మనం పరిశీలించి ముందుకు వెళ్లుదాం" అంటూ శాస్త్రిపాదులు వివరణ ప్రారంభించారు.

దీనికి తమిళులు అనాస్పళ్లం అంటారు. కన్నడులు అనాసహణ్ణు అని. హిందీలో అనానస్, అనన్నాస్. గుజరాతీ, మరాఠీంలో అనానస్. పార్సీ, అరబ్బీంలో అయినన్నాస్. సింహళీభాషలో అన్నాసి బర్మావారు నన్నా-టీ అంటారట. సంస్కృతంలో దీనికి పేరు కనిపించదు.

ఇది అమెరికా దేశం నుంచి పర్షియాకు వచ్చింతరువాత అక్కడి నుంచి మన దేశానికి దిగుమతి అయిందంటారు కొందరు. అమెరికా ఖండం తెలియక ముందు ఇది యూరప్, ఆసియా ఆఫ్రికాల వారికి తెలిదట. దీని మూలస్థానం అమెరికాలోని బ్రాజిల్ దేశమంటారు. అక్కడి నుంచి దీనిని యూరోప్‌కు 16 వ శతాబ్ది ఆదిలో బుడతకీచులు చేర్చారట.

మనదేశానికి దీనిని 16 వ శతాబ్దం ఆఖరులో బుడతకీచులు తెచ్చారు. బుడతకీచులు మన దేశానికి తెచ్చిన వృక్షజాతులు ఇంకా ఎన్నో వున్నాయిలెండి. అక్బర్ చక్రవర్తి కాలంలో దీనిని మన దేశంలో పండించడం

ప్రారంభమైంది. అబుల్ ఫజల్ "ఆయనే అక్బరీ"లో దీనిని పేర్కొన్నాడట. ఈ పండులాగ మరే పండూ త్వరలో ప్రపంచంలో వ్యాపించలేదు. దీనికి అమెరికాలో—బ్రాజిల్‌లో—పేర్లు అనాసీ, నానస్ అనేవి. ఈ పండు త్వరగా ప్రపంచంలో వ్యాపించడంతో అసలు పేరు అనన్నాస్, నన్నాసీ, అనానస్ అని రకరకాలుగా మారుతూ వచ్చింది. ఇది మన దేశానికి 1594 తర్వాతగాని రాలేదు. కనుక ప్రాచీన సాహిత్యంలో కనిపించదు. అప్పటికీ ఉత్తర భారతంలో వ్యాపించినట్టుగా దక్షిణాపథంలో వ్యాపించలేదు. కనుక విదేశీయమే.

"అయితే ఇంత కథ వుండగా నిఘంటుకారులన్నా జాగ్రత్త పడకుండా దీనిని దేశ్యం అనడం ఏమి సబబండీ?" అన్నారు జిజ్ఞాసువులు.

"కొందరు నిఘంటుకారు లీ విషయాన్ని గుర్తించకపోలేదు. బ్రౌన్ పండితుడు అనాసను మిశ్రమ నిఘంటువులో పార్సీ అపభ్రంశంగా స్పష్టంగా చెప్పాడు," అన్నాడు ఒక మిత్రుడు సద్యస్స్ఫురణ కలిగినట్టు నటిస్తూ. "కాని, సూర్యారాయ నిఘంటుకారులు దేశ్యమో, అన్యదేశమో చెప్పకుండా పట్టి విశేష్యము అని తప్పుకున్నారు చల్లగా" అన్నారు మరొకరు.



42

# కొడవలి - నాగలి



మనం సేద్యంలో వాడే పనిముట్లలో కొన్ని నాగలి, గుద్దలి, గొడ్డలి, కొడవలి. వీటికి ఈ పేర్లు ఎలా వాడుకలోకి వచ్చాయో చూద్దాం!

ఈ పదాల తుట్టతుదను 'లి' అనే అక్షరం వుండడం గమనించదగింది. ఈ 'లి' అక్షరం వీటి పుట్టుకను తెలుసుకొనడానికి తోడ్పడుతుంది.

మొదట—సంఘం, విజ్ఞానం వికసించని కాలంలో మనవారు ఆయుధాలకు, పనిముట్లకు ఒకే మాట వాడేవారు. క్రమంగా వేర్వేరు పదాలతో కొత్త కొత్త ఉపకరణాలను పేర్కొనడమో, వాడుకలో వున్న పదాలకు వెనుక మరొక పదాన్ని చేర్చి వాడడమో తప్పనిసరి అయింది.

మనవారు అన్ని పనిముట్లకూ వాడుకున్న తొలిమాట "వాలు". మన ప్రాచీన సాహిత్యంలో దీనికి కత్తి అనే అర్థంలో ప్రచురంగా ప్రయోగాలు లభిస్తాయి తమిళంలో వాలు శబ్దానికి పూర్వరూపమయిన "వాళ్" శబ్దానికి కత్తి, రంపం కత్తెర, నాగలి అనే అర్థాలున్నాయి. కన్నడంలో కత్తి, చర్మాన్ని సన్నగా చీల్చు అనే అర్థాలున్నాయి. మలయాళంలో వాళం = ఇనుము, బంగారు కమ్మి; వాళన్ = కత్తివంటి, రంపపు పనివాడు; వాళుక = గోకు, ముక్కలుచేయు, వ్యవసాయంచేయు, నాటు; వాళ్ = కత్తి, రంపం.

వాళ్ శబ్దం ఇన్ని ఆయుధాలకు ప్రయుక్తమై వుండటం చూడగా, మొదట ఇది కమ్మి అని అర్థమిచ్చే వాళంగా వుండి, క్రమంగా చర్మాన్ని చీల్చే కత్తి అయి, పిదప పట్టాకత్తి అయి, రంపమయి వుంటుంది. ఉపకరణ సామాన్య వాచిగా వున్నప్పుడు, నాగలి అనే అర్థంలోనూ వాడివుంటారు.

ఈ వాళ్ శబ్ద భాగమే నాగలి, గుద్దలి, కొడవలి – అనే మాటల తుట్టతుద కనిపించే "లి."

నాగలి పదం పుట్టుకను చూద్దాం. తెలుగులో నాగలి, నాగేలు. కన్నడంలో నేగల్, నేగిల, నేగలి, నేగల. తమిళంలో ఞాంగల్, ఞాయిల్, నాఞ్చల్. మలయాళంలో ఞెజ్జల్, నెజ్జల్, ఞాజ్జల్, ఞాయల్.

నాగలిని తెలిపే ఈ పదాలకు అర్థంలోను, వుచ్చారణలోను సన్నిహితంగా నాటు, సంబంధించు అనే అర్థమిచ్చే పదాలు తెనుగు వర్గపు భాషలలో పెక్కు కనిపిస్తాయి:

తెనుగులో నంకు (భూమిని కోరాడు), నాంటు, నాటు, నారు, నక్కు (ఒదుగు), నగ్గు (పొడిచేయి), నజ్జు (నలగు), నంటు (స్నేహం), నలగు (నలియగు), నాన్సు, నాన్పు మునుగునవి.

కన్నడంలో నాణ్టు (ప్రవేశించు), నడు, నెడు, నెట్టు, నట్టు, (నాటు), నంట, నెంట (మిత్రుడు, బంధువు), నెర్గు (లీనమగు), నాన్ (తడుపు), నెక్కు, నెక్కు (మున్నగు) మున్నగునవి.

మలయాళంలో ఞారు (నారు), ఞొళుక్కు (మొలక), ఞెట్టు (చెట్టు), ఞాయాల్ (కలుపుతీయు)

కాగా, నాటడంకోసం, భూమిని తవ్వడంకోసం ఉపకరించే సాధనం- ఞాజ్ వాళ్ క్రమంగా జనం నోట్లో నాని, ఞాజ్జళ్, ఞాయల్, ఞాజ్కల్, నాంచల్, నాంగల్, నాగల్, నేగలు, నాగేలు, నాగలి అయింది.

గొడ్డలి, కొడవలి ఈ రెండూ పూర్వం ఒకే పనిముట్టుకు వాడేవారు. క్రమంగా ఆ పనిముట్టు రెండు విధాలుగా మారి రెండు మాటలూ మొదటి పదంలో కొంత మార్పుతో పుట్టుకు వచ్చాయి వీనిలో గొడలి, కొడలి పాత మాటలు.

తమిళంలో గొడ్డలిని కోడరి, కోడాళి అంటారు. కన్నడంలో కొడలి.

ద్రావిడ భాష లన్నింటిలోను కొట్టు, కుట్టు శబ్దాలకు దంచు, కొట్టు, బాదు అనే అర్థాలున్నాయి ఏ వస్తువునన్నా కొట్టేటప్పుడు కలిగే ధ్వనినిబట్టి ఈ పదాలు రెండూ పుట్టాయి. కొట్టు, కుట్టు వాళ్—కొట్టువాళ్, కొట్టాళ్, కొడువాళ్, కొడవలి, గొడ్డలి అయింది దీని రూపంమారి కోడారి, కొడవలి. కుడుగోలు (కన్నడం) అనే పదాలు పుట్టాయి. కొట్టేకొయ్య కొడుపు, కొడిలి అయ్యాయి. కొడిలి కన్నడంలో ఎక్కువ ప్రచారంలో వుంది.

కుత్తు, గుద్దు వాళ్ గుద్దలి. ఇది సంస్కృత కుద్దాల పదం నుంచి పుట్టిందనే వాదం వుంది. కుం భూమిని దలతి భేదించేది అని వ్యుత్పత్తి. కుద్దాల అన్నప్పుడు ద్విత్వదకారం వుండడమే ఇది సంస్కృత పదంకాదని, గుద్దు, కుత్తు అనే పదాలనుంచే కొన్ని వేల ఏళ్ళక్రితం సంస్కృతంలో చేరి వుంటుందని ఊహించవచ్చు. దాక్షిణాత్యుడైన మేదినీ కోశకారుడు కోదాల శబ్దాన్నికూడా సంస్కృతంగా గ్రహించాడు

నాగలికి, లాగలకు నిషాద సంస్కృతిలోని పదాలు మూలమంటున్నారు మన వారు సంస్కృతం వారుకూడ నిషాద సంస్కృతిని చాల సొంతం చేసుకున్నారు.



45

# వేరుసెనగ



వేరుసెనగ ఆంధ్రదేశంలోని పెద్ద పంటలలో ఒకటి. తెలంగాణా, రాయలసీమలలో ఇది ముఖ్యమైన పంట. అంతెందుకు? భారతదేశంలోనే ఇది ముఖ్యమైన పంట అంటే తప్పేమీ కాదు

వేరుసెనగ నూనె, పిండి, కాయ, పప్పు, ఒకటేమిటి సమస్తమూ-మొక్క ఆమూలాగ్రమూ ఉపయోగపడేదే.

ఇంత వ్యాప్తిలో వున్న వేరుసెనగ మన దేశంది కాదంటే, వంద ఏళ్ళ క్రితం మన దేశంలో లేదంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఇటీవలే వచ్చి మన జీవితంలో ఒక భాగంగా పాతుకున్న వస్తువులలో ఇదొకటి.

దీనిని సంస్కృతంలో భూచణక అంటున్నారు గదా! ఇది మన దేశంలో లేకపోవడ మేమిటి?— అని సందేహం రావచ్చు. కాని ఏమి చేయగలం? ఇది విదేశీయమని అంగీకరించక తప్పదు. మన ప్రాచీన సంస్కృత సాహిత్యంలో దీని ప్రసక్తి లేదు. వైద్యగ్రంథాలన్నా మందుకోసం పేర్కొన్నాయా అంటే వేప, ఇప్ప, కుసుమ, అవిసె మున్నగు నూనెలను పేర్కొన్న వైద్యులు వేరుసెనగ నూనెను చెప్పకపోయారు. పోనీ, మన దేశంలో దీనికి స్వతంత్రంగా పేరేదైనా ఉందా, దానినుండి కొంత దీని పుట్టుకను గురించి అవలోకన చేద్దామా అంటే, అలాంటిది కనిపించదు.

సెనగలు మనకు ఉండనే ఉన్నాయి. అవి మొక్కపైన కాచేవి. ఇవి వేరున కాచేవి గనుక వేరుసెనగ అన్నారు, వేరుపనసలాగ. వేరుసెనక్కాయ అనడం కూడ వుంది. కన్నడ, తమిళాల్లో సెనగలకు కడలె అంటారు. ఇవి

వేరున కాచేవి. భూమిలో కాచేవి గనుక వేర్కడలె, నిల్కడలె అని తమిళ, కేరళులు; నెల్కడలె అని కన్నడులు అన్నారు. తమిళులు మణిలాకొట్టై అని దీనికి మరొక పర్యాయపదం వాడుతారు.

హిందీవారు ఎర్రటి పొట్టుతోవున్న విత్తులనుచూచి కొంచెం కవిత్వం చేర్చి మూంగ్ఫలీ-పగడపు పండ్లు-అన్నారు. వేరుసెనగ విత్తులు పగడాల ముక్కలలాగ ఉండవూ మరి? ఇది విదేశాలనుంచి వచ్చింది గనుక విలాయతీ మూంగ్-విదేశపు పగడాలు-అని కూడా అన్నారు. మహారాష్ట్రాలో, హైదరా బాద్లో సేంగా అంటారు. బెంగాలీలు హిందీవారిలాగానే బిలాయతీమూంగ్ అనడంతోపాటు చీనార్బాదం అని కూడా వ్యవహరించారు. అంటే చీనా బాదం అన్నమాట దీనినిబట్టి ఇది ఎప్పుడో చీనానుంచి కూడా దిగుమతి అయిం దనడానికి అవకాశముంది కదా! సింహళవాసులు రతకాజూ-ఎర్ర జీడిపప్పు-అన్నారు దీనిలో జీడిపప్పు రుచి తోచింది వారికి నెలకడలె, భూచణక అనే పదాలకు దగ్గరిదే ఇంగ్లీషులోని గ్రౌండ్నట్ అనేది.

వేరుసెనగ దక్షిణ అమెరికానుంచి ప్రపంచానికి వ్యాపించిందని వృక్ష శాస్త్రజ్ఞులు అంటున్నారు. బ్రాజిల్లో దీని పంట విపరీతమట అమెరికా కని పెట్టిన తర్వాతనే ఇది యూరప్ దేశాలకు వ్యాపించిందని వారి అభిప్రాయం.

కాని భారతదేశానికి ఇది ఎలా వచ్చిందనే విషయమై శాస్త్రజ్ఞులలో అభిప్రాయభేదం వుంది. ఇది చైనానుంచి భారత్కు చేరిందని డాక్టర్ డైమాక్ అభిప్రాయం. దీనికి చీనార్బాదం అని బెంగాలీ పదం, మణిలాకొట్టై అనే తమిళపదం సూచన కావచ్చు. తమిళ దేశానికి ఫిలిప్పీన్స్ రాజధాని అయిన మనిలానుంచి ఇది ఎప్పుడో దిగుమతి అయి ఈ పేరు పొందిందేమో!

దీని మొదటి పుట్టుక అమెరికాలో కాదు, ఆఫ్రికాలో. కనుక ఆఫ్రికా నుంచే ఇది ఇటు భారతదేశం పశ్చిమతీర ప్రాంతాలకు వ్యాపించింది; అటు చైనాకు; అక్కడినుంచి ఇతర ప్రాంతాలకు వ్యాపించింది—అని మరికొందరి

వాదం. ఆఫ్రికా పశ్చిమ కోస్తాలోని సెనగాల్ రేవునుంచి మధ్యధరాసముద్ర తీరపు రేవులమధ్య వేరుసెనగ వ్యాపారం పెద్దగా సాగుతుందట. ఈ సెనగాల్ రేవు ప్రసిద్ధినిబట్టి వేరుసెనగకు సెనెగాల్, సెంగాల్ అనే పేరువచ్చి, అది బహమనీల కాలంలో అరబ్ తెగల మూలంగా హైదరాబాద్‌లో వ్యాపించి ఉండవచ్చు ననడానికి అక్కడను, మరాఠ్వాడాలోను వ్యాప్తిలో ఉన్న సేంగా పదం ఉదాహరించవచ్చు. సేంగా అనేది సెనక్కాయ అనే పదంనుంచి వచ్చిందని వాదిస్తే, సెనక్కాయ కేవలం మాండలిక మాత్రంగానే ఉంది గనుక సేంగా అని మారడానికి అవకాశం తక్కువ అనవచ్చు.

వేరుసెనగ శరీర పోషణకు కావలసిన సకల పదార్థాలూ ఉన్న సంపూర్ణ వస్తువు. దీని విషయంలో మనవారికి ఏదో అపోహ ఉంది; దానిని తొలగించుకుని దీనిని నిత్యాహార వస్తువుగా వాడడం అవసరం



# ఉర్ పు - ఉప్పు

48



"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ జూడ రుచుల జాడ వేరు;
పురుషులందు పుణ్యపురుషులు వేరయా"

అని వేమనయోగి ఉప్పుతో సర్వసామాన్య ప్రజలను ధ్వనింపజేసి, కర్పూరానికి గొప్పదన మిచ్చారు. కాని, నేను ప్రతి మానవుని నిత్యజీవితానికి అవసరమైన ఉప్పే గొప్పదంటాను.

అన్నానికి తోడుగా ఒక ఉప్పువుంటే చాలు - మరే సాధకమూ లేక పోయినా చీకూ చింతా లేక హాయిగా కడుపు నింపుకోవచ్చు. రుచులలో తీపుకు అగ్రస్థాన మిస్తారు చాలమంది కాని, సుమతీశతక కర్త అన్నట్టు "ఉప్పే పస రుచుల కెల్ల."

ఇంతగా నిత్యజీవితానికి అవసరమైన ఉప్పు - పూర్వకాలంలో ప్రపంచంలో చాలామందికి తెలీదు. ఆఫ్రికాఖండ వాసులకు చాలకాలం వరకు తెలీదట: వట్టి మాంసం, పాలు, పళ్ళు మాత్రమే తిని గడిపేవారట యూరోపియనుల ద్వారా ఉప్పు అక్కడ వ్యాపించిందట.

మధ్యకాలంలో అబిసీనియా, టిబెట్ మున్నగు దేశాలలో ఉప్పు బిళ్ళలు రూపాయి బిళ్ళలుగా చెలామణి అయ్యేవట. నేటికీ కొందరు ఆటవిక జాతులవారు ఉప్పుకు అమూల్యమైన తేనె, సారపప్పు, పగడాలు, పూసలు వంటి వాటిని బదులుగా ఇవ్వడం కద్దు. ఇంత విలువగలది గనుకనే ఉప్పు అంటే సొమ్మనే వ్యవహారం కూడా ఏర్పడింది. "ఉప్పుతిన్న నెనరు", "వాని ఉప్పుతిని బ్రతకడం" వంటి పలుకుబళ్ళు, 'నమక్ హరాం', 'నమక్ హలాల్' అనే సామెతలు ప్రపంచ మంతా పుట్టాయి.

మనకు వేదకాలంనుండి ఉప్పు తెలుసు. ఇంతగా అత్యవసరమైన ఉప్పును ఎప్పుడు ఎవరు కనిపెట్టారో? ఇతర జాతుల సంగతి మన కెందుకు గాని మనకు-అంటే సముద్రతీర ప్రాంతాలవారమైన, దక్షిణాపథ ప్రజల మైన మనకు-సముద్రుడు సహజంగానే ఉప్పు ప్రసాదించాడు.

ఉప్పునేలలో నిలిచిన నీరు ఎండిపోయిన తర్వాత కనిపించే తెల్లటి పెచ్చులవంటి పదార్థాన్ని మన పూర్వులు చూచి వుంటారు; సముద్రతీర ప్రాంతాలలో కెరటాలు ఉరవడిగాలేచి గట్టునుదాటి వచ్చినప్పుడు ఆ ప్రాంతాలలో నిలవైన నీరు ఎండకు ఉడుకులాడుతూ ఎండి, ఉరవైపోగా మిగులు తేలిన పదార్థాన్ని కూడ కళ్ళారా చూచి వుంటారు ఆ ఉరవైన-గట్టిపడిన-నీరే ఉరుపు-ఉప్పుగా వారి వ్యవహారంలో చేరిపోయి వుంటుంది.

ఉప్పు అన్నమాట సంస్కృతం నుంచి వచ్చిందనే సాహసికులు వుండరనుకుంటాను. అమరకారుడు చెప్పిన ఆరు రకాల - (1) సాముద్రం, అక్షీబం, వశిరం, (2) సైంధవం, శీతశివం, సితసివం, మాణిబంధం, మాణిమంథం, (3) రౌమకం, బస్తకం, (4) పాక్యం, బిడం, (5) సౌవర్చలం, అక్షం, రుచకం, (6) తిలకం, మేచకలవణం-ఉప్పు పర్యాయాలలో ఉప్పు పదంతో పోలికగల ఒక్క మాటైనా కనిపించదు.

ఇకదక్షిణాపథభాషలన్నిటిలోను-తమిళ, తుళు, కన్నడ, మలయాళాలలో-లవణార్థకంలో ఉప్పు అన్నమాట ఒక్కటే వుంది. దక్షిణ భారతంలోని అనాది జాతులలోని తోడ. కోటవారు ఉప్పు అంటారు. బడగ, కురుంబ, ఇరుళ జాతులవారు యుప్పు అంటారు

తెలుగు దేశంలోని అనాది జాతులలో ఖోండువారు మాత్రం వుప్పంగ అంటారు సవరలు బాసి అని, గదబలు బత్తి అని, ఎరుకలు సోనగ అని, చెంచులు లోన అని అంటారు. సోనగ, లోన అనేవి సంస్కృత భవాలయిన

భాషల ప్రభావంవల్ల వచ్చినవి. కనుక ఉప్పు పూర్తిగా దక్షిణాది పద మన దంలో సందేహం వుండనక్కరలేదు.

తమిళ, కన్నడ, మలయాళాలలో మండు, గట్టిపడు అనే అర్థాలలో ఉరి, ఉరు పదాలు కనిపిస్తున్నాయి. నీరు ఉరిసి - మంది (ఎండి) ఉరవై ఏర్పడడమే ఉప్పు గనుక ఈ అర్థాలను కూడా కొంత తెలుసుకుందాము.

తమిళంలో - ఉర (త్రల్) పదానికి గట్టిఅగు. దళసరిఅగు ఘనీభవించు. తీక్షమగు, సూర్యునిలాగా తీవ్రమగు అనే అర్థా లున్నాయి మలయాళంలో ఉరి, ఉరవు (తల్) = గట్టిఅగు, శక్తిమంతమగు; ఉరవు-బలం, హెచ్చడం; ఉరుప్పం - ఎండవంటి వేడి. ఆవిరి, కోపం, ఉరుప్పు - వేడి, కోపం, ఆవేశం, క్రౌర్యం హెచ్చుకావడం, రంగు.

కన్నడంలో ఉప్పు, ఉరి, ఉరు, ఉరుపు, ఉరువు అనే మాటలకు కాలు, మండు అనే అర్థా లున్నాయి తుళులో ఉప్పు అంటే - ఉండు, కట్టుబడివుండు, సమర్థించు, రక్షించు అనే అర్థాలూ వున్నాయి. ఉప్పుకు ఒగరు అనే అర్థంకూడా వుంది.

ఇక తెలుగులో ఉరియు (మండు) అనేమాట వుండనే వుంది. ఉరియు - పక్వమగు, ఉడుకు, కాలు, ఉటిది, ఉబువు - గట్టిది. ఉప్పు అనే మాటకు ఉదకబెట్టు అనే అర్థం మనకు వుండనేవుంది. ఉప్పుడుబియ్యం ఉదకబెట్టిన బియ్యం. ఇవన్నీ నీరు ఇంకిపోవడంలోను, మామూలుగా మంట మండడంలోను కలిగే ధ్వని అనుకరణాలే.

ఉప్పెన అనేది ఉప్పు - ఉబ్బు - అనే మాటవల్ల వచ్చింది. కనుక సముద్రం ఉబ్బి నీరు గట్టుకు కొట్టగా అది ఎండి, అటు ఉప్పు అయింది; ఇటు ఉప్పెన అయిందని అనుమానించవచ్చు.

కాగా మండు, ఎండు అనే అర్థాలున్న ఉర్, ఉర, ఉరి అనే మాటల నుండిగాని, గట్టిపడు అనే అర్థమిచ్చే ఉటిది, ఉబువు అనే మాటలనుండిగాని ఉర్పు, ఉప్పు పరిణమించి వుంటుంది.

రకరకాల ఉప్పులు మనకూ వున్నాయి; కన్నడంవారికీ వున్నాయి; అట్టుప్పు, కల్లుప్పు, కారుప్పు, చవుడుప్పు, పెట్లుప్పు, సోరుప్పు లాంటివి.

లవణాలు దేహానికి చాల అవసరం జంతువులు కూడ ఏదోవిధంగా లవణాలను తింటుంటాయి. గుర్రం మొదలయిన పశువులకు ఉప్పు, సైంధవ లవణం దాణాలో కలిపి పెట్టడం మనకు తెలుసు.

కోతులు తరచు తమ దేహంనుంచి ఏవో ఏరుకుని తింటుంటాయి. పేలు తింటున్నాయని చాలమంది భ్రమ కోతులకు మనుష్యుల లాగే ఒళ్ళు చెమర్చుతుంది. రోమకూపాలలో చెమట ఆరి ఉప్పుపొరలు ఏర్పడుతాయి. వాటిని ఉప్పుకోసం కోతులు తింటాయని జంతుశాస్త్రజ్ఞులు కనుగొన్నారని శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి అంటున్నారు.



# దిక్కా - దివాణమా !



దిక్కు తోచలా! దిక్కుమాలినవాణ్ణి బాబూ! చూచే దిక్కులేదు! నా అన్న దిక్కులేదు! దిక్కులేని పక్షిని! దిక్కూ మొక్కూ లేదు! దిక్కున్నచోట చెప్పుకోవోయ్! ఈ దిక్కు చూడండి! దిక్కా? దివాణమా? — ఈ విధంగా "దిక్కు" అన్న పదంతోవున్న పలుకుబళ్ళు కొల్లలు.

పూర్వం గడియారాలూ, గంటలూ లేవు. పగలు సూర్యుణ్ణి చూచి, రాత్రి నక్షత్రాలనుబట్టి దిక్కులు తెలుసుకొనేవారు మనవారు. వానకాలంలో మబ్బులు కమ్ముకొని సూర్యుడు కనిపించనినాడు పొద్దు తెలిసేది కాదు. దిక్కు తోచేది కాదు. మబ్బులు వీడిన తర్వాతగాని పనులు జరిగేవి కావు. ఈ విధంగా సూర్యుడు, నక్షత్రాలు కనిపించనినాడు మనవారు "దిగ్భ్రాంతులు, దిఙ్మూఢులు" అయేవారు. ఏ దిక్కుకు వెళ్లాలో, ఏం చేయాలో తోచేది కాదు. ఈ దిక్కుతోచని పరిస్థితిని కవులు కావ్యబద్ధం చేశారు. "దిఙ్మూఢ దివసేశ్వరా" అని కాళిదాసు ప్రయోగం. సూర్యునికే దిక్కు తెలియలేదట.

ఈ సంస్కృతపు పలుకుబడిని మొదట తెలుగువారు "దిక్కుతోచని, దిక్కుతెలియని" అనే అర్థంలోనే వాడారు. కాని, ఇది క్రమంగా రక్షణ ఆశ్రయం, స్థలం, న్యాయం జరిగే స్థలం అనే అర్థాలలో వాడుకకు వచ్చింది.

దిక్కుతెలీక పారిపోవడం అనే అర్థంలో నన్నయ సంస్కృత పక్కీలోనే యథాతథంగా ప్రయోగించాడు: "ఇట్లు సముద్రతీరంబున నమరాసురులకు నతి ఘోరయుద్ధం బయ్యె. నందు నరనారాయణు లపార పరాక్రముల్త్రై యసులవీరుల బెక్కండ్రం జంపిన, నుక్కడంగి దెస చెడి యసురులు సముద్రంబు సొచ్చిన...." (ఆదిపర్వం, ద్వితీయాశ్వాసం, 26).

ఇక్కడ "దెస చెడి" అనేది దిక్కు తెలుసుకోలేక, దారి తెలుసుకో లేక, దాపిలేక అని సంస్కృత భాషలోని అర్థానికి అనుగుణంగానే ప్రయోగించబడింది.

కాని, తిక్కన కాలానికి అర్థం రకరకాలుగా మారింది. తిక్కన ఒకే పద్యంలో దెస అనే దాన్ని "గతిలేని, ఎవరూ ఆదారంలేని" అనే అర్థాలలో వాడాడు.

"ఎఱుగంగ వచ్చునే యెవ్వరి కెత్తరి
ఏ దెస యగునొ! మునీంద్ర యేము
గలుగంగ దెసలేని పులుమాసికి బోలె
నక్కురువృద్ధున కిట్టి చావు
వాటిల్లె —" (ఆశ్రమవాస పర్వం)

ఈ పద్యంలో "ఎత్తరి ఏ దెస" అన్నప్పుడు ఏ గతి అని, "దెసలేని" అన్నప్పుడు, బంధు మిత్రులు లేని అనాథునివలె అని అర్థాలు మారడం స్పష్టం.

కాటమరాజు బొల్లావు మనుమసిద్ధి సైనికులను నుగ్గాడి కుమ్మి కూల్చగా, వారు-

"దిక్కుమాలిన చావు తీగలలోన,
నక్కలే దిక్కాయె నట్టడవి గదె!"

అని విలపించారట (కాటమరాజు కథ) ఇక్కడ దిక్కు అనే పదానికి రెండు చోట్లా ఆశ్రయం అనే అర్థం.

పొద్దు, వైపు అనే అర్థాలలో వాడుకలో వుండి, క్రమంగా ఆశ్రయం అనే అర్థం చాలవరకు స్థిరపడిన దిక్కు శబ్దానికి ముస్లిం సంస్కృతితో "దివాణం" అనే పదం ఉపస్కారంగా చేరింది.

ఒక భావాన్ని మరింత స్పష్టంగా ఎదుటివాని గుండెల్లో నాటేటట్టు చెప్పడానికి సమానార్థకమైన, చాలవరకు సమానోచ్చారణ గల రెండు పదాలు కలిపి జంటలు జంటలుగా వాడడం భారత భాషలన్నిటిలోను వుంది. అందం - చందం, మాట - మంతి, పిల్ల - జెల్ల, తీరు - తెన్ను —ఇలాంటివి ఎన్నైనా చెప్పవచ్చు. ముస్లింల పరిపాలన స్థిరపడిన రోజులలో మనకు పార్శీ, అరబ్బీ, తుర్కీ, హిందీ భాషల సంబంధం కలిగి కొత్త పదాలు, పలుకుబళ్లు పుట్టాయి. జంట పదాలలో మొదటిది తెనుగు పదం, రెండవది పార్సీపదం వాడకం సంప్రదాయమైంది: సిగ్గూ శరమూ, దిక్కూ దివాణం - ఇలాంటివి. దివాణం అనేది "దీవానె ఆమ్" అనేదాని తద్భవం.

మొగల్ చక్రవర్తుల కాలంలో రెండు దర్బార్లుండేవి. ఒకటి దీవానే ఖాస్. ఇది చక్రవర్తీ, మంత్రులూ మంతనాలు జరిపేది. రెండవది దీవానే ఆమ్. ఇది ప్రజాసామాన్యం మొరలు విని చక్రవర్తి స్వయంగా తీర్పులు చెప్పేది. ఈ సంప్రదాయాన్నే మహారాష్ట్రులు, తెనుగు సంస్థానాధీశులు అనుసరించారు. దీవానే ఆమ్ మరాఠీలో దివాణే ఆమ్ అయి, నేడు హైదరాబాద్‌లోని "బాగేఆం" (పబ్లిక్ గార్డెన్స్) బాగయాం బాగాం అయినట్లు దీవాణం, దివాణం అయింది.

అర్థం క్రమంగా రాజదర్బారునుంచి, న్యాయస్థానం, సర్కారు, రాచనగరు అని మారుతూ వచ్చింది.



# జల్లెడ - చేట



ఇంట్లో వుండే తోటి వస్తువులన్నీ తమ పుట్టు పూర్వాల సంగతి మాట్లాడుకుంటూ మురిసిపోతూ వుంటే, గోడకు చేరబడిన రెండు జల్లెడలకూ తమ తమ సంగతి తెలుపుదామనే ఉబలాటం ఎక్కువైంది. అందులో ఒకటి వుండబట్టలేక నేను "చాలినీ"ని అన్నది మరొక దానితో. "అంటే?" అని ప్రశ్నించింది రెండోది. "అర్థం వివరించమంటావా?" అని మొదటి జల్లెడ వెటకారంగా కొక్కిరిస్తూ యిలా అన్నది :

"నీ కెలా తెలుస్తుంది దాని అర్థం? నేను అసలు ఆర్యవంశందాన్ని. కనుక చాలిని అని పేరు వచ్చింది. 'చల కంపనే' అనే ధాతువు నుంచి మా వంశనామం పుట్టిందని మా అమ్మమ్మ చెబుతూవుండేది. తెలిసిందా? సిసలైన సంస్కృతం మాట."

రెండో జల్లెడ జలజలలాడింది. అన్నది : "నీవు చాలినీవో, మాలినీవో నాకు తెలిదు నేను మాత్రం జల్లెడనే మేము ఇంటితనం, ఘరానాతనం అనే విషయాలను నమ్మేవాళ్లం కాము చేసే పనిని బట్టే మాకు పేర్లు వచ్చాయి మేము పనికే ప్రాధాన్య మిస్తాము గాని, అమ్మమ్మల కథలను గాని, అమ్మలక్కల కబుర్లుగాని విని మోసపోయేవారం కాము. వస్తువులను శుభ్రపరచటం, జల్లించడం, కదలించడం, చల్లడం, వెదజల్లడం మున్నగు పనులు చేసేవారం గనుక, జల్లించు అనే దానిని బట్టే మాకు జల్లెళ్ళవారం అనే పేరు వచ్చింది నీవు సిసలైన సంస్కృతందానివి కావచ్చునేమోగాని, నేను మాత్రం సిసలైన తెనుగుదాన్ని. మా చుట్టరికం తమిళ, మలయాళ, కన్నడాల వారితో వుంది. తమిళ 'సెల్లెడై' వారు మాకు చాల దగ్గిరివారు, పెద్దవారున్నూ."

దాలినీ అని విర్రవీగుతున్న మొదటి జల్లెడ కొంచెం చిన్నబోయింది. "అబ్బే! నేను నిన్నేమి అనలేదు సుమా! మా అమ్మమ్మ చెప్పిన కథ సంగతి చెప్పాను. అంతే! మనం చేసే పనీ ఒక్కటే; రూపమూ ఒక్కటే. అన్నిటా పోలిక ఉన్నాయి. వంశాలు మాత్రమే వేరనుకున్నాను. అంత మాత్రాన కోపమెందుకూ? ఒకరిని పోలినవారు మరొకరు లోకంలో లేరంటావా?" అని ప్రశ్నించింది.

ఇదంతా వింటూ చేట నోరు తెరచి నిట్టూర్చింది- "నా సంగతో!" అంటూ.

"నీవు పక్కా తెలుగువాడివి. తమిళంలోని 'మొరం' వారికీ, సంస్కృత 'శూర్పం' వారికి నీతో కయ్యమూ లేదు, వియ్యమూ లేదు. విడివిడిగా పడిన వస్తువులను ఒకటిగా చేర్చడం నీ పని. సేర్, కేర్, చేర్ నీ వంశం. శూర్పంవారు (శూర్ప్యతే-శూర్పమానే) వస్తువులను కొలిచేవారు. కనుక వారి కా పేరు వచ్చింది. నీవు కూడా మునుపు కొలతకు ఉపయోగ పడేవాడివి వాయనాలూ, ఉపాయనాలూ నీ ద్వారానే సాగేవి ఇప్పుడు నీ కర్మం కాలి నూర్పిడి సమయంలో ఈదరగాలికి ఎదురుగా పడి పడరాని పాట్లు పడతావు. ఆడవాళ్లు వీపున బాదుతారు పాపం!" అంటూ ఓదార్చింది జల్లెడ.



# నిమ్మ

57



సహస్రాబ్దాలుగా మనం నిమ్మపండును వాడుతున్నాము. పాల్కురికి సోమన గజనిమ్మ పళ్ళను పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు.

"............................ తుమికి
పండ్లు నారంగంబు పండు, ననంటి
పండును, గజనిమ్మ పండ్లును, గలివె
పండును, గుమ్మడి పండ్లును, వెలగ
పండ్లును.................................
.................................బుడమ
పండ్లు జంబీరంబు పండ్లును........"

(పండితా - పర్వత)

రంగనాథుడు తన రామాయణంలో—

"ఇమ్ముల గిరులంది యిరుచేతులందు
నిమ్మపండుల మాడ్కి నెగురవైచుచును"

(యుద్ధ - 314 పుట)

అని ఖల్ప్రదర్శనం చేశాడు ఈ నిమ్మ - అంటే పదం - మనది కాదంటే ఆశ్చర్యంగానే వుంటుంది.

"సంస్కృతంలోని నింబూ, నింబుకం, నింబూకం, లింపకం అనే పదాలలో దేనినుంచైనా నిమ్మశబ్దం పుట్టి వుండకూడదా? సూర్యారాయ నిఘంటుకారులు నింబశబ్దంనుంచే నిమ్మ పుట్టిందని కంఠోక్తిగా చెప్పగా, మనది కాదు అని కొత్తగా అనడ మేమిటి? మనది కాదు, తద్భవం" అని అంటారేమో? మనకే కాదు, సంస్కృతానికి కూడా యిది కొత్తదే ననవలసి వస్తుంది.

సంస్కృత సాహిత్యంలో ప్రాచీన నింబ శబ్దం వేము అనే అర్థం లోనే కనిపిస్తున్నది కాని, నిమ్మ అనే అర్థంలో కాదు. అమరకోశంలో నిమ్మ వాచకంగా నింబశబ్దం కాని, నింబూ, నింబుక, నింబూక శబ్దాలుగాని లేవు అమరసింహుడు "స్యా జ్జంబీరే దంతశఠ జంభ జంభీర జంభలాః" అని మాత్రమే నిమ్మకు పర్యాయా లిచ్చాడు

అర్వాచీన వైద్య గ్రంథాలైన భావప్రకాశ, రాజనిఘంటువులు మాత్రమే నింబూ శబ్దాన్ని జంబీర పర్యాయంగా గ్రహించాయి: అమః, జంబీరః, వహ్నిః, దీప్తః వహ్నిబీజః, అమసారః, దంతఘాతః శోధనః, జంతుమారీః, నింబూః, రోచనః - అని. భావప్రకాశకారుడు నింబూక పానకం కూడా తెలిపాడు - అంటే షర్బత్.

ఇటీవలి నిఘంటువులైన శబ్దార్థ చింతామణి నింబూ నింబుక, నింబూక శబ్దాలను శబ్దకల్పద్రుమం నింబుక, నింబూక శబ్దాలను గ్రహిం చాయి. శబ్దకల్పద్రుమం నింబసేచనే, నింబతి సించతీవ రసేన (రసంతో ముంచెత్తేటటువంటిది) అని వ్యుత్పత్తి యిచ్చింది.

ప్రాచీన కవి ప్రయోగాలుగాని, ప్రాచీన వైద్యక ప్రయోగాలుగాని లేనందున ఈ పదం అన్యభాషా పదమనడానికి అవకాశ ముంది.

"నేటి ఉత్తరాపథ భాష లన్నిటిలోను నింబూ అని నిమ్మకు పర్యాయం కనిపిస్తుంది గనుక, దీనికి మూలం నింబూ, నింబూక, నింబు కాలు కాకూడదా? ప్రాచీనం కాదంటా రేమిటి?" అని ఎవరైనా ఆక్షేపించ వచ్చు. నిజమే; ఉత్తరాది భాషలలో యిది నేడు వ్యాప్తిలో వున్న మాట నిజమే. హిందీ: లిమూం, నీబూ, లీమూ - బెంగాలీ: నేబూ - మరాఠీ: లింబూ, నింబూ, లీంబూ, కాని ప్రాచీన సంస్కృత సాహిత్యంలో కనీసం అమరకారునికి తర్వాతనైనా కనిపించక పోవటంవల్ల నేడు ఉత్తరాదిని వ్యవహారంలో వున్న నిమ్మవాచక పదాల మూలమని కొందరు వాదించే సంస్కృత నింబూకం అన్యభాషా పదానికి సంస్కృతీకరణ మేమోనని అనుమానిస్తున్నారు భాషాశాస్త్రజ్ఞులు.

అరబ్బీలో నిమ్మకు లిము, లిమూఁ, లీమూ, లిముయే హామీజ్ అని; పార్సీలో లిముయేతుర్ష్, లిమూ, లిమే అని; బర్మీభాషలో లామ్యా-సీ, టాబు యాసీ అని సమానార్థక పదాలున్నాయి రోమనులకు, గ్రీకులకు కూడా నిమ్మ సంగతి తెలీదని అరబ్బుల దండయాత్రలవల్లనే వారికి తర్వాత ఇది తెలియ వచ్చిందని, 10 వ శతాబ్దంలో నిమ్మ ఓమన్ తోటలనుంచి పాలస్తీనా, ఈజిప్టులకు; అక్కడినుంచి ఇటలీకి; అక్కడినుంచి తర్వాత యూరప్ అంతటా వ్యాపించిందని వృక్షశాస్త్రజ్ఞులు అంటున్నారు. లిమోన్ అనే అరబ్బీ పదంనుంచి (పుల్లపండు) లెమన్ అనే యూరప్ భాషల పదాలు పుట్టాయి ఈ లిమూన్ పార్సీ ద్వారా హిందీలో చేరి లిమూ, లింబూ, నింబూ అనే రూపాలు పొంది వుంటుందని, దీని తర్వాత సంస్కృత పండితులు సంస్కృతీకరించి వుంటారని ఈ వృక్షశాస్త్రజ్ఞుల మతం (నిమ్మ పండులో ప్రధాన లక్షణం రసం చిప్పిలడం కన్నా పులుపు అన్నది కదా! కనుక వ్యుత్పత్తి కూడా తర్వాత అతికించబడి వుంటుంది.)

అయితే యిది అరబ్బీ పదమేనా? కాదు అంతకుముందు మనదేశంలో వ్యాపించిన నిషాద (ఆస్ట్రో-ఏషియన్) జాతివారి పదం. నేడు మలయా, సుమిత్రా, జావా, మొలుక్కా మొదలయిన ద్వీప, ద్వీపకల్పాలలోని ఈ ఆదిమ నిషాద జాతివారు నిమ్మను లిమఊ అంటారు. బర్మాభాషలోని లామ్యా-సీ అనే మాట లిమఊకు దగ్గరిదిగా కనిపిస్తున్నది గదా! ఇది ఆగ్నేయ ఆసియా ప్రాంతంలో అరబ్బులకు సంబంధం ఏర్పడిన తర్వాత వారి భాషలో చేరివుంటుంది. ఒకప్పుడు భారతమంతటా వ్యాపించిన నిషాద జాతి నాగరికత అవశేషాలు తెలుగు మాగాణంలో ఎక్కువగా నిలిచిపోవడానికి చాల అవకాశముంది. కనుక నిమ్మపదం లిమఊ, నిమఊ అనే ఆస్ట్రో-ఏషియాటిక్ పదభవమని అవమానించడానికి అవకాశంవుంది. నిఘంటుకారులు, వైద్యకులు మన యీ అనుమానాన్ని బలపరుస్తున్నారు కదా।

తెలుగు తోబుట్టువులలో పెద్దదైన తమిళంలో నిమ్మ కనిపించదు. నిమ్మను తమిళులు ఎలుమిచ్చెం, ఎలుమిక్కాం అంటారు. కన్నడంలో ఇలిమంచి. ఇది తెలుగులో కనిపించదు. ఇది లికుచ అనే సంస్కృత పదభవమన్నారు కొందరు. ఇదీ అనుమానమే. కన్నడంలో నింబె కనిపిస్తున్నది. దీనిని కిట్టెల్ సంస్కృతభవంగా కాక, అప్పటమైన కన్నడపదంగానే గ్రహించాడు.

సంస్కృతంలో నారింజకు వాచకమైన నాగరంగ, నారంగ పదాలకు, తెలుగు, తమిళాలలోని నార్తం, నారదం, నారదబ్బ అనే పదాలన్నిటికి నాఱ్ఱుం. నార్టం అనే పదమే మూలమని, దీనికి వింత వాసనగల కాయ అని అర్థమని భాషాశాస్త్రజ్ఞు లంటున్నారు కాని, నారంగ,నాగరంగ పదాలు సంస్కృత సాహిత్యంలో అతిప్రాచీన కాలంనుంచే కనిపిస్తున్నాయి.

ఇంతకూ దీని సారాంశం నిమ్మకు మూలం నింబూక కాదని, నింబ అసలే కాదని, లిమఊ - నిమఊ అనే నిషాద పదమని మాత్రమే.



# నిలై - 61
# నిలయ




పూర్వపు రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ హైదరాబాద్ రెసిడెన్సీకి నామకరణం చేస్తూ "రాష్ట్రపతి నివాస్" అనడం కన్న "రాష్ట్రపతి నిలయం" అనడం ఉచితమని, నిలయం అన్నమాటకు తెలుగు, తమిళాలలో ఇల్లు అనే అర్థం వుంది గనుక, దాక్షిణాత్యులకు ఈ పేరు సన్నిహితంగా వుంటుందని ప్రసంగించినప్పుడు, దేశంలో పలువురు ఆశ్చర్యం ప్రకటించారు. "నివాస మన్నా, నిలయ మన్నా ఒక్కటే అర్థంకదా! అలాంటప్పుడు నిలయ పదమే భవనవాచకంగా తెలుగు,తమిళాలలో ఉండడమేమిటి? రాష్ట్రపతి దాక్షిణాత్యపదమని భ్రాంతిపడ్డారా?"అని గుసగుసలుపోయారు కొందరు.

నిజమే, నివాస - నిలయ శబ్దాలు సమానార్థకాలే. అమరకారుడు కూడా "నికాయ్య నిలయా లయాః" అని నిలయ, ఆలయ శబ్దాలను గృహ పర్యాయాలలో గ్రహించడం కూడా వాస్తవమే.

''సంచార పూతాని దిగంతరాణి
కృత్వా దినాంతే నిలయాయ గంతుం''

అని మహాకవి కాళిదాసు రఘువంశ మహాకావ్యము (రఘు-2-15),

"తం భూత నిలయం దేవం
సుపర్ణ ముపధావత''

అని భాగవతము (8-1-11) ప్రయోగించడం ఎవరూ కాదనరు.

ప్రాణులు దీనిలో తలదాచుకుంటాయి (నిలీయంతే అస్మి న్నితి నిలయః; ఆలీయంతే అస్మి న్నితి ఆలయః) అని అమర వ్యాఖ్యాత క్షీర స్వామి వ్యాఖ్య చేయడం కూడా ఎవరూ ఆక్షేపించరు.

కాని దక్షిణాపథ భాషలలో ఉనికి, ఆగడం, విడువడం, శేషించడం మున్నగు అర్థాలలో ఉన్న కొన్ని సమానార్థక పదాలు చూస్తే ఇది సిసలైన సంస్కృత పదం కాదేమో అని, సంస్కృతీకరించబడి మారిపోయిందేమో అని అనుమానం అర్ధ శతాబ్ది కిందటే భాషా శాస్త్రజ్ఞులకు కలిగింది దీనికి కారణం లయశబ్దార్థాలే నని ఊహించవచ్చు.

లీఙ్, లయ ధాతువులతో పుట్టిన లయ శబ్దానికి వినాశం, సంశ్లేషం, నృత్తగీత వాద్యాల సమానత, ప్రలయం, అఖండ వస్త్వవలంబనంతో చిత్త వృత్తికి నిద్ర—అనే అర్థాలు చెబుతారు. ఉపసర్గంతో ధాత్వర్థం రకరకాలుగా మారడం సంస్కృత భాషా సంప్రదాయ మన్నది నిస్సందేహం.

అయితే నిలయపదంతో పోలికలున్న దక్షిణ భాషా పదాలయిన నిల్, నిఙ్, నిలై లలో వినాశమని, సంశ్లేషమని విరుద్ధమైన అర్థాలు లేవు వినాశ మనే అర్థం సంశ్లేషమైన తర్వాత ఏర్పడిన లాక్షణికార్థ మంటారేమో? అలాంటిది నిలైలోగాని, దానిపై రూపొందిన తక్కిన పదాలలోగాని కని పించదు. వాటిని వివరించడం అప్రస్తుతం కాదనుకుంటాను.

తమిళలో:— నిఙ్, నిల్‌లపై వచ్చిన నిలమై పదానికి అర్థం భూస్థితి. నిట్రల్, నిల్‌దల్-నిలుచు, ఆగు, స్థిరపడు, కాపాడుకొను. ఉండు. వసించు, ఆగిపోవు. విడిచిపెట్టు, నిరీక్షించు, విలంబనచేయు. నిలం-నేల. నిలువు-శాశ్వతంగా నిలుచు, నిలువై-నిలుచున్న, ఐకాయ, నిలువ. నిలై-నెలవు, నిలుచున్న, దార్ఢ్యం, శాశ్వతం, మన్న, శీలం, గుణం, పరిస్థితి, ఉద్యోగం, స్థలం, స్థానం. వృత్తి, భూమి, భవనం, అంతస్తు, వాకిలి చౌకట్టు, స్తంభం, స్థాయి, ప్రమాణం, నిర్ణయించిన దారి, ఆచారం, ప్రయోగం, గృహస్థా ద్యాశ్రమాలు, కులం, వంశం, ఆనువంశికం, ఒక రకం పాట, కాలం, ముహూర్తం, భూమికొలత, నీటిలోతు, పైశాచమండల ఆలీఢప్రత్యాలీఢావి ధనుర్విద్యా ప్రయోగస్థానం, పేడకడి మున్నగు అర్థాలున్నాయి

కన్నడంలో: -నిల్-విశ్రమించు, ఉండు. నిలవు-స్థితి, ఎత్తు, విడిది, విశ్రాంతి. నిలు, నిల్లు-నిలకడ మున్నగు అర్థాలున్నాయి.

ఇక తెలుగులో నిల్, నిలులనుండి రూపొందిన పదాలను వందల కొలది చూపవచ్చు:

నిలబడు, నిలక (నిలుపు), నిలకడ, నిలుచు, నిలుచుండు, నిలుచుకొను, నిలుపు, నిలువ, నిల్వ, నిలువరం, నిల్వరం, నిలువరి, నిలువరించు నిలుపు, నిలువుగొలువు, నిలువుగాళ్ళు, నిలువుజీతం, నిల్కడ, నిల్వరించు, నిట్ట, నిట, నిటక, నిలుచు, నిట్టకనిలవు, నిట్టనిలుచు, నిట్టరాడు, నిట్టలము, నిట్టవొడుచు, నిట్ట, నిట్టాడు, నిట్టాయి, నిట్టించు, నిట్టూర్పు, నిట్టెమ్ము లాగ,

నిజ్, నిల్ ధాతువు నిట్ట, నిట మున్నగు మార్పు లెన్ని పొందాయో చూడండి.

కనుకనే నిలై నిలాయ్, నిలయ్, నిలయగా మారి, (మలై మలయ అయినట్టు) ఆలయ సాదృశ్యంతో ని ఉపసర్గపూర్వకమైన లయ శబ్ద మనే భ్రాంతి కలిగించి ఉండవచ్చునని భాషా శాస్త్రజ్ఞులు అనుమానించడానికి కారణమైంది.

ఆలయ శబ్దం గురించి ఒక్కమాట. ఇది మొదట్లో దేవ కులానికే వాడే వారేమో చూడవలసి వుంది. ఒక ఆలయం కట్టించి, దానిలో ఏ విగ్రహమో ప్రతిష్ఠించినా, ప్రతిష్ఠాపకుని కళ, తర్వాత జీవాత్మ ఆలయంలోని విగ్రహంలో లీనమౌతాయని మనవారి సంప్రదాయం. పెద్దలు మరణించిన తర్వాత వారి పేరుతో స్థాపించిన దేవాలయాల కంతా ఈ ఐతిహ్యం ఉంటున్నది. చిదంబర దేవాలయం పతంజలి సమాధి అంటారు పెద్దలు జీవుడు దేవమూర్తిలో లీనం కావడం గనుక (సంగీతంలో లయలాగ) ఆలయమనే అర్థం సరిపోతుంది. ఆలయ శబ్దం మామూలు ఇళ్ళకు వాడడం మొదట లేదనుకుంటాను. తర్వాత వ్యవహారంలోకి వచ్చిందేమో? నిలయ శబ్దం కూడా మొదట గూడు అనే అర్థంలోనే వుండడం పై అనుమానానికి సాధకం. గూడు క్రమంగా ఇల్లు అన్న అర్థం తెచ్చుకుంది.

కనుక, మాజీ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ చెప్పినది అవిచార మూలకం కాదని తోస్తుంది.

# నూరిపోయు -
# నూరితాగు



మనకు ఎవరన్నా పదే పదే ఏ సంగతైనా చెబితే, "ఎందుకండి అలా నూరిపోస్తారు? నాకు తెలీదూ!" అని విసుక్కుంటాము. ఎవరన్నా మన మీద ఊరికే పగబడితే, "కారాలు మిరియాలు నూరుతున్నారు లెండి!" అంటాం ఎవరైనా ఇరుగు పొరుగు వారిని వేచుకు తింటూవుంటే, "మను ష్యుల్ని నూరుకు తాగుతున్నాడండీ!" అని కష్టపడతాం. పోట్లాటకు తలపడు తున్న వారిని చూచి "ఎవరిపైనండోయ్ ఈ కత్తి నూరడం?" అంటాము.

నూరు అనే క్రియతో చేరిన నానుడు లన్నీ స్థూలంగా మన జాతి చరిత్రనే తెలుపుతాయేమో!

తిక్కన కాలానికి "నూరు" పదానికి మామూలుగా రాచు, నలచు, మెదుపు అనే అర్థాలు మాత్రమే వున్నాయి.

"నున్నదనంబుగా నలుగు
నూరియు చందన మట్లు రాచియున్"

అని తిక్కన మెదుపు అనే అర్థంలోనే వాడాడు.

—(భారతం - విరాటపర్వం)

ప్రబంధకాలానికి 'నూరు'కు రాచు, మెదుపు అనే అర్థాలతోపాటు మరొక వింత అర్థం కూడా అబ్బింది. "మదను దమ్ముల నూరె, హిమంబు పేరె" (మనుచరిత్ర-౩వ అశ్వాసం)-అనే ప్రయోగంలో నూరడం తర్వాత జరిగే పనికే ప్రాధాన్యం, అమ్ముల నూరాడు, రాబోయే యుద్ధంకోసం సన్నాహంగా.

కోపం పెల్లుబికినప్పుడు వాయి బిగుసుకుపోయి, పళ్ళు పటపటలాడు తాయి; కరకర లాడుతాయి. పళ్లురాచి, పదును పెట్టినట్టే కనిపిస్తుంది. పళ్ళను ప్రధానంగా వాడే మృగాలకు కరచిన కొద్దీ పళ్ళు పదనవుతూ వుంటాయి.

అందుకోసమే "కోరలు నూరడం" అనే వాడుక వచ్చింది. "కోరలు నూరి పై వచ్చు భూవారపతులనైన"-హరిశ్చంద్ర నలోపాఖ్యానం.

వైద్య శాస్త్ర సంబంధంతో "నూరు" మరొక చమత్కారమైన అర్థంలో వాడుకకు వచ్చింది. ఇప్పుడు ఇంజక్షన్‌లవల్ల మందులు నూరడమో, నూరి తాగడమో, నూరి పోయడమో పట్టణాలలో అలవాటు తప్పిందేమో కాని, గ్రామాలలో నేటికీ మందు చాదడం, నూరడం, రోగికి పోయడం మామూలు. ఇలా నూరి తాగడంవల్ల అన్ని రోగాలను హరించడ మన్న మాట. ఇది క్రమంగా ఏమి దుర్మార్గం చేసినా చెల్లే-మందులు తరచు రోగికి సయించని రుచిలో వుంటాయి గనుక – కర్కోటకులకూ వాడడం అల వాటయి, విజయనగర రాజ్యం కాలానికి ఇతరుల దుండగాలు హెచ్చాయి కాబోలు, సాహిత్యానికి ఎక్కింది.

"నూరక త్రావు నీతఁడు క
నుంగొను నంతటిలో మనుష్యులన్"

–కాళహస్తి, ३ వ ఆశ్వాసం.

"నూరక త్రావు వానికే" జనం భయపడతారని హరిశ్చంద్ర నలో పాఖ్యానం ప్రయోగం.

మందు నూరిపోయడం. తర్వాత ఆ మందు ఒంటబట్టి రోగికి గుణం ఇవ్వడం ఫలితంగా మరికొన్ని అర్థాలు "శ్రద్ధగా వినేవరకు పురి ఎక్కిం చడం, ఫలితం ఎలా వున్నా పాఠం చెప్పడం, చెప్పడంలో శ్రద్ధ చూపడం" అనేవి పుట్టుక వచ్చాయి. ఇవి చాల తర్వాతి పరిణామాలు.

"తనయులకును, మనుషులకును,
తన నేరుపు నూరిపోసి తాల్చిన సర్గం
బున భరము వారి బూనిచి,
పనిదీరి, విధాత యా సభం గొలువుండెన్"-(కాకుత్స్థవిజయం)

ఇలా "నూరు" వైద్యశాస్త్ర సంప్రదాయంతో పెనవేసుకొని శ్రద్ధగా చెప్పు, పురి ఎక్కించు, హింసించు అనే అర్థాలలో వాడుకై వైద్యశాస్త్ర చరిత్రనే తెలుపుతుంది.

# ఉండ్రాళ్లు



మనం ఏటా ఏటా వుండ్రాళ్ళు తింటూనే వున్నాము. కాని, ఉండ్రాళ్ళు ఎలా పుట్టాయో—ఆ పదం పుట్టు పూర్వాలేమిటో ఒక్కనాడయినా ఆలోచించామా? త్వరలో వినాయకచవితి వస్తున్నది మరల ఉండ్రాళ్ళు తినబోతాము ఈసారైనా వాని అంతు చూద్దాము.

చలికాలంలో ఉదయం లేవగానే ముద్గాన్నం తినమన్నట్టే, వానకాలంలో త్వరగా జీర్ణమయ్యే వాసెన కట్టిన (ఆవిరిలో తయారయిన) తేలిక పదార్థాలు తినమన్నారు వైద్యులు. ఈ నియమాలు, నిబంధనలు కలవారు పాటించగలరు గాని, లేనివారికి సాధ్యమా? పాటించమన్న ఋతువులో ఏ ఒక్క రోజన్నా పండుగో, పబ్బమో వచ్చినప్పుడు—ఆ ఆచారాలు, నియమాలు పాటించి సంతోషంతో సంతృప్తిపడడం ప్రజాసామాన్యం స్వభావం. అలాంటి సంతృప్తికి చిహ్నాలలో కొన్ని వినాయకచవితి నాటి భక్ష్యభోజ్యాలు.

మన మిప్పుడు తినదలచుకున్నవి ఉండ్రాళ్ళే కదా! ఈ ఉండ్రాళ్ళు మన పొరుగున ఉన్న తమిళులు, కన్నడులూ చేసుకుంటారు. వినాయకునికి నివేదించే భక్ష్యాలలో కొన్ని గుండ్రనివి, కొన్ని పొడుగాటివి. పొడుగ్గా ఉండేవేమో మోదకాలు, గుండ్రనివేమో ఉండ్రాళ్ళు.

ఉండ్రాళ్ళు అనే పదంలో ధ్వనించే రాళ్ళు చూచి రాళ్ళకు వీటికి ఏదో సంబంధం ఉందని భ్రమపడేరు! ఈ పదంలోని రాళ్ళు ఉండు + రాళ్ళు అని విడదీస్తే, వచ్చే రాళ్ళు కావు సుమా! మూలపదంలో భాగమే ఆ రూపం దాల్చింది.

ఉంౖడ, ఉంట అంటే గుంౖడని పదార్థం కదా! ఈ ఉంౖడకు ఉంౖడా యికి సంబంధం ఉందా? సంబంధం లేకేమి! ఉంౖడ, ఉంౖడాయి ఒకే పదం రూపాంతరాలు, అర్థాంతరాలు పొందాయి. ఉరుళ్, ఉరుట్టు అనేవి తమిళం లోను; ఉరుళ్, ఉరుళిసు అనేవి కన్నడంలోను దొర్లించు అనే అర్థమిచ్చే ధాతువులు. మనకూ దొర్లు అనే అర్థంలో ఉరలు అనే పదం ఉండనేవుంది. ఈ ఉరళ్నుండే ఉరుండై, ఉండై అనే పదాలు పుట్టాయి. కన్నడంలో ఉండె. మలయాళంలో ఉండ. తెలుగులో ఈ ఉరుండై ఉంౖడ, ఉంట, (ఉంౖడాయ్) ఉంౖడాళ్ళు అని మారింది.

(ఒక పదం వుచ్చారణకు, ఆ పదం సూచించే వస్తు స్వరూపానికీ సంబంధం వుంటుంది. రేఫోచ్చారణ నాలుక చివరిభాగం అల్లలాడడం వల్ల నాలుక చివర మడవడంవల్ల ఏర్పడుతుంది. ఈ చలనం రేఫంతో వున్న భ్రమణార్థక పదాలన్నిటిలోనూ రేఫంతో సూచించబడడం పద స్వరూప పరిణామం విశిష్టత-తిరుగు, ఉరుళ్, ఉరలు, రోలు, రాలు, దొర్లు, పొర్లు ఇత్యాదిగా )

రేఫంతో వున్న పదాలు రేఫం వదలుకుని స్వతంత్రమైనవి ఎన్నో వున్నాయి. ఎంౖడి - ఎంౖడ, నండు, ఏడి (కన్నడం) చుంౖడు - చుండు, కుౖను (తమి)-గుండు, గుంౖడ, గుండె, గుండియ, గుట్ట, గడ్డ, కొంౖడ- కొండ. మంౖడ - (మంౖడగబ్బ) మండ, మట్ట, గంౖడ - గండ గండు, వంౖడు - వండు.

కాని ఉంౖడాలు - ఉంౖడాళ్లు అనే పదం వడ్లు, పెసలు, మినుములు లాగా నిత్యబహువచనంలోనే కనిపిస్తున్నది. ఉంౖడాళ్ళకు బహుశా ఏక వచనం కాదగిన ఉంౖడాయి అనే పదం కనిపించదు కనుక ఉంౖడాయి ఉరుండైనుండి వచ్చివుంటే ఏకవచన మేమైంది?-అనే సందేహం వస్తుంది. ఈ సందేహం మరికొన్ని పదాల పరిణామం సహాయంతో నివారించుకో వలసి వుంటుంది.

మనకు అమ్మాయి, అబ్బాయి, పాపాయి, అమ్మయ్య, అక్కయ్య, అత్తయ్య అనే వింతపదా లున్నాయి అమ్మ, అత్త, అక్క, అబ్బ అంటేనే చాలు అర్థం రావడానికి. వీనిలో ఒక వింత మనః ప్రవృత్తి గర్భితమై వుంది ఆదరం, వాత్సల్యంవంటి సున్నితమైన భావాల ప్రకటనలో చిన్న మాటలనే కొంచెం పొడిగించి పలుకుతాము. పాప అనడానికి మారుగా పాపాయి అంటే మన మనస్సులోని ఆదరం మరికొంత వ్యక్త మౌతుంది పాప చాల చిన్నదన్న భావం కూడా స్పష్టమౌతుంది. అలాగే తువ్వాకు తువ్వాయి అత్త, అక్కలలోకంటే అత్తయ్య, అక్కయ్యలలో ఆత్మీయత ఎక్కువ. అమ్మ అనడంకంటే అమ్మయ్యలో ఆత్మీయత, గౌరవభావం ఎక్కువగా ద్యోతకమవుతాయి అమ్మాయి అన్నప్పుడు చిన్న వయస్సుతోపాటు వాత్సల్యం.

ఈ మార్పులన్నిటికీ మూలస్వరం ఐ అత్తై-అత్తాయ్. అత్తయ్య, అత్తె, అత్తఇగా మారింది ఏ ఐలు, ఓ ఔలు, - అయ్, ఆయ్ అవ్, ఆవ్‌లుగా మారడం సంస్కృతంలోను వుందికదా! ఐకారం స్థానం కంఠం, తాలువు గనుక, ఆకారానికి కంఠం, యకారానికి తాలువు గనుక ఐ - అయ్ అనే విధంగా మారి అత్తై, అత్తాయ్ అవుతుంది. అంత్య యకారం రాలిపోయి అత్త అని ఒక రూపమూ, యంత్య యకారానికి ఊత రాగా అత్తయ్య అని మరొక రూపమూ వచ్చాయి తమిళ, మలయాళాలలోను ఐకారాంతాలు ఆయ్ అంతాలుగా - వలహై, వలహాయ్‌లాగ —వ్యవహారంలో కనిపిస్తాయి. పదాల రూపాలలో కొన్ని ఒక ప్రాంతంలోనే వ్యవహృతం కావడం, మరి కొన్ని మరుగైపోవడం భాష సహజలక్షణం గనుకనే మనకు అత్తయ్య వుందిగాని, అత్తాయ్ లేదు. అమ్మాయి యిలాంటిదే; ఈ సాదృశ్యంతో అబ్బాయి, బాబాయి మున్నగు రూపాలు వాటి మూలపదాలు ఐకారాంతాలు కాకపోయినా ఏర్పడ్డాయి. ఈ విధంగానే ఉరుండై, ఉరుండాయ్, ఉండ్రాయి అయివుంటుంది. బహువచనం ఉండ్రాళ్లు, ఉండ్రాలు.

ఉండ్రాయి అనే రూపం వుందంటే నవ్వుతారు ప్రపంచ జ్ఞానం కలవారు ఎవరైనా. ఎందుకంటే, అది వ్యవహారంలోనో, పుస్తకప్రయోగం

లోనో లేకపోవడంవల్ల. నిఘంటువులో మాత్రం ఉంఢ్రము, ఉంఢ్రకము అనే పదాలు ఉండ్రాయి అనే అర్థంలో కనిపిస్తాయి. ఇవి ఉండేరక అనే సంస్కృత శబ్దభవంగా చూపబడ్డాయి. ఉండ్రమే గుర్రం, గుర్రములు, గుర్రాలు అన్నట్టు ఉండ్రాలు అని కావడానికి అవకాశం వుండవచ్చు. కాని పైన చెప్పిన స్వరపరిణామంతో ఉండ్రాయే ప్రథమైకవచన మనడానికి హేతువులు ఎక్కువ.

మనం ఏ భక్ష్యాలు చేసుకున్నా ఒకటి అరా చేసుకోము. అందులోను కుడుములు, ఉండ్రాలువంటి చిన్నవి ఒకటి అరా ఏ మాగుతాయి? ఎక్కువగా వండుకోవడం తప్పదు కనుక నిత్య బహువచనంగా వడ్లు లాగ ఉండ్రాళ్లు అని మన పూర్వులు ప్రయోగించడం సహజం. కనుక దీని ఏక వచన రూపమైన ఉండ్రాయి క్రమంగా రూపు మాసిపోయివుంటుంది.

ఉండ్రకం, ఉండ్రం అన్నమాటలు ఉండేరకభవాలు కావనడానికి పైన పేర్కొన్న ప్రక్రియ చాలు. కన్నడంలో ఉండలిగె, తుళులో ఉండలుగ అనే భక్ష్యాలు వున్నాయి ఇవి ఉండ్రాళ్ళవంటి గుండ్రని తినబండారాలే. వీటిలోను ఉండ్రకంలోను కనుపించే, గకార కకారాలు తర్వాత బహువచన ప్రత్యయంలోని భాగమని గ్రహిస్తే, ఉండ్రకం రూపంలోని కకారం సంస్కృత ఉండేరకములోనిది కాదని స్పష్టమౌతుంది.

కనుక ఉండ్రాళ్ళు అనే పదానికి కేవలం గుండ్రని రూపమే మూలం కాని, తినడం, గట్టిగా ఉండడం అనే గుణాలేవీ కావనడం స్పష్టమైనట్టే కదా!



# పాలు



"తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అనుకునే రకమండీ ఈయన!"

అని అమాయకులను ఎత్తిపొడవడం వింటూంటాము. నిజానికి తెల్లనివన్నీ పాలు కాకపోవడం అలా వుండగా, తెల్లదనానికి పాలు పుట్టుకతో ఎంత మాత్రమూ సంబంధం లేదు సుమండీ!

తెలుపును సూచించే తెళ్, వెణ్ అనే పదాలనుంచి వెలుగు, వెండి, వెన్న, వెల్లమన్నగు పదాలు పుట్టినట్టే, తెళ్ పదంనుంచి తెలి, తెలివిమున్నగునవి పుట్టాయి కాని, పాలు పదానికి మూలం శ్వేతవాచక పదాలు కావు.

పాల్ పదం తెనుగు తోబుట్టువు లన్నిటిలోను సమానం క్షీరం, చెట్లనుంచి కారే రసం, పండ్ల రసి, సారం, తెల్లనైన— ఈ అర్థాలు కూడ సమానాలే. కాని యీ అర్థాలలో అతి ప్రాచీనమైంది క్షీర మనేది. తర్వాతవి తెలుపు మొదలయినవి.

సంస్కృత శబ్దమైన 'పాలనం' నుంచి పాలు పుట్టిందని సంస్కృత పండితుల వాదం 'పయః' అనే పదం పయ్, పాయ్ అని వికృతిపొంది 'పా' మాత్రం మిగిలి, బహువచన ప్రత్యయమైన 'లు' చేరి పాలు అయిందని మరికొందరి వాదం పుట్టుకనుంచే ఆధారమైన పాలవంటి వస్తువుకు మనవారు ఇతర భాషా పదాలను వాడవలసిన అవసరం వుండదు; ఏదో సంకేతం స్వయంగానే జేసుకొని వుంటారు.

స్త్రీలకు గర్భధారణంతోనే పాలుపొటమరించి, శిశువు ఒడిలో పడగానే చేపు వస్తుంది. తన కడుపు పేగును, తన సర్వస్వాన్ని ఎదుట చూడగానే హృదయం నుంచి, రొమ్ము నుంచి జీవం పొంగి పొరలుతుంది; క్షీరం స్రవిస్తుంది. శిశువు చిగురు పెదవులను ప్రయత్నపూర్వకంగా అప్పళించి పీల్చవలసి వుంటుంది. ఇంత ప్రయత్నం జరిగినప్పుడు కలిగే

'ప-ప్ప-ప్ప' ధ్వనికి పాలతో సంబంధం సామాన్యమైంది కాదు; దాదాపు కార్యకారణ భావసంబంధం.

తర్వాత మన ఆదిమ పురుషులు కర్ర కంపకోసం చెట్లు కొట్టడం, పట్టలు చీల్చడం మున్నగు పనులకు పూనుకొన్నప్పుడు వాటి నుంచి నీరు కారడం, పారడం చూచి వుంటారు. పశుపాలన ప్రారంభించిన తర్వాత ఆవుల పొదుగుల నుంచి ఏదో తాము చిన్నప్పుడు తాగిన రసంవంటి రసం కారడం, పారడం చూశారు. వీటన్నిటినీ సూచించే ఒక పదం అప్పుడు తనంతటనే ఆవిర్భవించి ఉంటుంది.

కదలికను, గతిని, సంచలనాన్నీ సూచించే క్రియలలో ముఖ్యమైన పదం పాలు కన్నడంలో పల పలి పలు పళె పాలు పదాలన్నీ కదలికను, గతిని సూచించేవే. పల = పరిగెత్తించు, వ్యాపించు. పలి = ఎగురు, పరిగెత్తు, చీల్చు, చించు, కోయు, వెళ్లు, మాయమగు, పలు = ఎగురు, పారు. పళె = వ్యాపించు, వేళ్లు మొదలగునవి సాగు. పాట్ = పారు, ఎగురు, పరుగెత్తు, దూకు. తమిళంలోనూ ఇలాంటి అర్థాలే వున్నాయి. తెలుగులో పల, పాలు ధాతువులనుంచే పలతెంచు, పలవు, పలువు, పలుగు మున్నగునవి వచ్చాయి. ఈ విధంగా పల, పలి, పలు, పళె పళె, పాలు ధాతువులు ఏదో విధమైన గతిని సూచిస్తున్నాయి.

అయినప్పుడు పై నుంచి కిందికి పారుతున్న, స్రవిస్తున్న క్షీరాన్ని, తర్వాత చెట్లనుంచి పారిన రసాన్ని మనవారు "పాలు" అని సంకేతించుకున్నారని ఊహించవలసి వుంటుంది. చిన్నపిల్లలు పాలు తాగుతున్నప్పుడు పెదవుల అప్పళింతవల్ల కలిగిన ధ్వనికి అనుకరణంగా "ప్పప్పాపా" అని పుట్టిన పదానికి బహువచన 'లు' ప్రత్యయం చేరి "పాలు" అయిందని కూడా ఊహించవచ్చు; ఆవు వాచకానికి మూలపదమైన 'ఆ' బహువచన ప్రత్యయం 'లు' చేరి ఆలు అయినట్టు.

బహువచన ప్రత్యయమైన 'లు' క్రీస్తుశకం 800 తర్వాతనే కనిపిస్తుంది గనుక పాలులోని లుకారం ప్రకృతిగతమే కాని, ప్రత్యయగతం కాదన్నప్పుడు, పాట్ పదంలోని శకటరేఫం లకారంగా మారడం ఆశ్చర్యం కాదు.

పాఱునుంచి పాలు పుట్టిం దన్నప్పుడు ఒక చిన్న సందేహం తోస్తుంది. ద్రవిడ భాషలలో లకారం తర్వాత పరుషవర్ణం ఉన్నప్పుడు లకారం శకట రేఫంగా మారుతుంది. పాల్ + కారి = పాఱ్కారి, పల్ + కళ్ = పఱ్కళ్. కాని, శకటరేఫం లకారంగా మారడం కద్దా? పాఱునుంచి పాలు వచ్చిం దనడానికి సాధకంగా ఇంకేవైనా పదాలున్నాయా? అనవచ్చు. అరుదుగా మాత్రమే కనిపిస్తున్నాయి అలాంటివి కన్నడంలో పీఱ్, పీఱు పేఱు = చించు, ముక్కలు చేయు. బీఱు = పంచు విటినుంచి మన పీలిక, పేలిక పుట్టింది. మఱు, మాఱునుంచి మలి, మల. దూఱు = తూలు, తూలనాడు; శిఱ్ = శిల, శెల, కెల. పఱ్ = పల, పలు.

వీనినిబట్టి పాఱ్-పాఱునుంచి పాలు రూపొంది వుంటుందనడానికి సందేహించ నక్కరలేదు

ఈ పాలు శబ్దం తర్వాత రస సామాన్యానికీ వ్యవహృతమైంది; చెరకుపాలు, కొబ్బరిపాలు, టెంకాయపాలు అని

ఇక సంస్కృత పయశ్శబ్దం చూద్దాం. పీయతే = తాగబడుతున్నది గనుక పయః అయిందని కొందరి వ్యుత్పత్తి ప్యాయతే = దేహాన్ని వృద్ధి పొందిస్తుంది అని నిరుక్తకారుడు వ్యుత్పత్తి చెప్పాడు. కాని, ఇవన్నీ పాలు చేసిన పనిని గ్రహించిన తర్వాత ఆలోచించిన వ్యుత్పత్తులలాగ తోస్తుంది. పయః కూడా పెదవుల కలయికతో గలిగిన ధ్వన్యనుకరణ సంభూతమనే నా నమ్మకం.

సంస్కృత వైయాకరణులు ఘస ధాతువునుండి క్షీరశబ్దం సాధించారు; అర్ధర్చాదిగణంలో పారేశారు. నిజానికి క్షర - (స్రవించు) ధాతువునుంచే పుట్టిందని అంటే బాగుండేది.



73

# చారు



మన భోజనంలోని ప్రధాన వ్యంజనాలలో ఒకటి చారు. కన్నడ, తమిళుల భోజనాలలోను ఇది ప్రధానమైన వ్యంజనమే. ఉత్తర భారతీయుల భోజనంలో ఇది కనిపించదు కనుక ఇది కేవలం దక్షిణాపథ వ్యంజన మనే చెప్పవచ్చు.

కాని, ఇది మన పూర్వుల భోజనంలో లేనట్టుంది. భారతంలోని భోజన వర్ణనలో చారు లేదు భీముడు బకాసురవధ సందర్భంలో తన కడుపు నిండ తిండి పెట్టవలసిందని ఏకచక్రపురం వారిని కోరగా, వారు—

"పలు దెఱంగుల పిండివంటలు
ఖప్పు గూడును నేతి కుం
దలు గుడంబు దధి ప్రపూర్ణ ఘ
టంబులుం గొనివచ్చి యీన్"

భీముడు అన్నీ తిని త్రేన్చి, బకాసురవధ యాత్రకు సిద్ధపడ్డాడు. ఈ భోజనంలో పిండివంటలు, పప్పు, అన్నం, నేయి, పెరుగు ఉన్నాయి. భీముడు పిడచలు పిడచలు మింగి వుంటాడు. ద్రవపదార్థం కలుపుకుని ఆరగించినట్టు లేదు

బసవ పురాణంలో ఈ చారు ప్రసక్తి లేదు. బసవన్న అల్లమ ప్రభునికి పెట్టిన విందులో-

"పక్వైరం బిడి పంచ భక్ష్యాన్నములును
ఎల్ల పదార్థముల్ మొల్లంబుగాను"

వడ్డించినాడట

పార్వతి ప్రమథులకు పెట్టిన విందులో-

"వివిధ పక్వాన్నాది వితతులు గూర్చి
భవ్య కల్పద్రుమ ఫల పల్లవములు
దివ్యామృతంబున దివుట దాలించి
క్షీ రేక్షు రస దధి ఘృత వార్ధికోట్ల
క్షీ రేక్షు రస దధి ఘృతములు నిలిచి
అకలంక రస రసాయనములు గూర్చి"

ఇతర వస్తువులు సమకూర్చిందట. రస రసాయనాలలో చారు ప్రత్యేకంగా పేర్కొనలేదు (రసాలలో చేరిందేమో!)

శ్రీనాథుని కాలానికి చారు మన భోజనంలోనికి చొచ్చినట్లుంది — విడిగా

"చారులు బిండివంటలును
శర్కరయున్ దధియున్ యథేచ్ఛగన్"

అని అతడు హరవిలాసంలో వర్ణించాడు. కాని, క్రీడాభిరామంలో మాత్రం-పూటకూటి యింట్లో కూడా-చారు ప్రసక్తి రాలేదు. అప్పటి పూటకూటి ఇళ్ళలో పేర్కొనదగిన లక్ష్మణకొజ్జుల ఇంట్లో, రూకకు-

"కప్పుర భోగి వంటకము
కమ్మని గోధుమ పిండివంటయున్
గుప్పెడు పంచదారయును
క్రొత్తగ గాచిన యాలనే పెస
ర్పప్పును గొమ్మునల్లనటి
పండ్లును నాలుగు నైదు నంజులున్
లప్పలతోడి క్రొంబెరుగు"

వడ్డించేవారట.

ఆయుర్వేద గ్రంథాలలో యూషం—పప్పుకట్టు—తీసి రుచ్య పదార్థాలతో కలిపి సేవించడం, పథ్యం పెట్టడం ఉంది. కాని, అది దైనందిన భోజనంలో కనిపించదు.

ఈ చారు మన భోజనంలోకి ఎలా వచ్చింది? కన్నడుల భోజనంలో ఇది అతి ప్రాచీన కాలంనుంచే భాగం. శబ్దమణిదర్పణకారుడు సాఱు = రసార్ద్రే అని గ్రహించాడు. జీలకరరసం, మిరియాలరసం, ధనియాలరసం కాచి రోచనపాచనాల కోసమూ, అజీర్ణ హరంగాను భోజనంతో సేవించే అలవాటు తమిళులలోను చాలకాలంనుంచే ఉంది. కనుక ఇది మనకు దగ్గరి వారయిన కన్నడులనుంచి వచ్చిందేమో! ఏమైనా ఇది దాక్షిణాత్యపదం; దాక్షిణాత్యాచారమూను.

కాని ఈ చారు సంస్కృతసారశబ్దంనుంచి పుట్టిందనే వాదం ఉంది; సారః-సారో-సారు-చారు అని. నిఘంటుకారులు కొందరు దీనిని సార శబ్ద భవంగా పేర్కొన్నారు. కాని తమిళ, కన్నడ, మలయాళాలలో ఇది చాఱు. సాఱు అని బండిఱాతో ఉండడం దీని సంస్కృతేతరత్వాన్ని నిరూపిస్తున్నది. ఒకప్పుడు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, శ్రీరామ వీరబ్రహ్మకవిగారు ఇది శకట రేఫాంతమా, సాధురేఫాంతమా అని వివదించుకొనడం సాహిత్య లోకానికి తెలుసు.

తమిళ మలయాళాలలో చాఱు = ఒక వస్తువును పిండినందువల్ల వచ్చిన రసం పనంజాఱు=(తాటిరసం) తీపికల్లు "పనంజాతే పనంజాతే" అని ప్రతీ ఉదయం తమిళనాడు పట్టణాల బజార్లలో అమ్ముతుండడం నేటికీ చూడవచ్చు. పన-జాతేలోని పనం అనే పదం జారిపోయి, చాఱు మాత్రం మిగిలి తెనుగులో తీపికల్లుకు వ్యవహారమైంది.

కన్నడంలో సాఱు = స్రవించు, ప్రవహించు, జారు, జరుగు, చారు అనే అర్థాలలో వుంది.

తెలుగులో జాఱు. జాఱువాఱు జాలువారు, జాలువు, జాలు, జాల్కొను, జాలుకొను, జాలుగొను, చాఱు, చాఱిక మున్నగు పదాలు స్రవించు, ప్రవహించు పైనుంచి కిందికి దిగు, జారిన వస్తువు గుర్తు అనే అర్థాలలో వుండడం, ఇవన్నీ బండిఱాలతోనే ఉండడం పరిశీలిస్తే చాఱుకూడా సంస్కృతేతర మనే నిర్ధారణకు రావచ్చు. ప్రవహించేటప్పుడో, మీదినుంచి స్రవించేటప్పుడో కలిగిన జల జల, జఱ జఱ, సర సర అనే ధ్వన్యనుకరణమే ఈ పదానికి మూలమై వుంటుంది.

ఇంతకూ సంస్కృతసార శబ్దం సృధాతుభవం కదా! ఈ ధాతువులోను జాఱు చాఱు మున్నగువానిలోని ధ్వన్యనుకరణ ధ్వనే వినిపించడం లేదూ!

''చారులు బిండివంటలును శర్కరయును దధియున్ యథేచ్ఛగాన్'' (హరవిలాసం-?-21)లోను, "చారల్ చారు లెవో సెబాసు దధి"(గాధేయోపాఖ్యానం-2-88)లోను చారుశబ్దం బహువచనంతోనే ప్రయుక్తం కావడం పరిశీలనార్హం. చారు ఏకవచన ప్రయోగంలోను లేకపోలేదు - "నల్ల చారు కాచి" (హరవిలాసం) కనుక, నేడు మనం చింతపులుసు చేర్చి కాచే చారు మాత్రమే కాక, రకరకాల రసాలు భోజనంతోపాటు సేవించేవారేమో! నేడు ఒక్క చారు పోసుకున్నా 'చార్లు పోసుకుని' అని, 'పప్పుచారు పులుసు' (పప్పు కట్టుచారులో చింతపండు పులుసు కలిపిన చోష్యం అన్న మాట) అని వ్యవహారాలున్నాయి ఆనాటి పెక్కు చారులలో నేడు ఒక్క చింత పులుసు చారు మాత్రమే మిగిలిపోయివుంటుంది మన భోజనంలో.

ఈ చాఱు శబ్దం తాలవ్యాదా. దంత్యాదా అనే చర్చ ఒకటుంది. నిఘంటుకారులందరూ దీనిని దంత్యాదిగా గ్రహించారు శబ్దరత్నాకరంలో ఇది దంత్యాదిగా గ్రహించినా "ఈ అర్థమునందిది ఇట్లు దంత్యాదిగా నొకచోట ప్రయోగించబడియున్నది. అయినను వాడుకయందు తాలవ్యాదిగా కనబడుటవలన అది యుక్తముగా తోచదు'' అని వ్యాఖ్యానించబడింది.

తమిళంలో మాత్రం చారును రసమనే అంటారు. ఇది కేవలం సంస్కృత భవం. చారు తమిళ పదమయితే. అది పోయి రసమనే మాట వాడుకలోకి ఎలా వస్తుంది?—అనే అనుమానం కలగడం సహజమే. దీనికి చక్కని సమాధానం ఉంది. చాఱు అనే పదానికి తీపికల్లు అనే అర్థం వచ్చింది గదా! దానివల్ల భోజనంలో వ్యంజనంగా వినియోగించే చారుకు అన్నం, సంభారం వంటి మరికొన్ని మాటలతోపాటు వేరే పదాన్ని శాకాహారులు అలవాటు చేసుకుని ఉంటారు. ఇదే రసం.

ఏతావతా, చారు సారభవం కాదు; రెండూ స్వతంత్ర శబ్దాలు.

# వేంబు - వేప

77



ఉగాదినాడు మనం వేపపూ పచ్చడి తింటాము. కొత్త చింతపులుసు, బెల్లం ముక్కలు అవీ కలుపుకుని తింటాము గనుక, వేపపూత చేదు మనకంతగా తెలియదు కాని వట్టి వేపపూతే నమిలితింటే ఎలా ఉంటుంది? వేప కాయలు తింటే మరీ చేదు! నోరు వికారమైపోయి, నాలుక మొద్దుబారి, నోటి నుంచి అవ్యక్తంగా వెర్రి మొర్రి ధ్వని వెలువడుతుంది.

ఈ వేపపూత ఉగాదినాడు తినడం ఎప్పటినుంచి వచ్చిందో! గరుత్మంతుడు స్వర్గంనుంచి అమృతం అపహరించుకుని వెళ్ళుతుండగా, ఒక్క చుక్క వేపమొక్కపై పడిందట. అప్పటినుంచి రోగ విముక్తి పొందడం కోసం వేమును తినడం ప్రారంభమైందట మనవారికి క్రొత్త సంవత్సరం నాడు ఏమి చేస్తే, ఏమి జరిగితే సంవత్సరాంతం దాక అదే జరుగుతుందనే నమ్మకం కనుక ఉగాదినాడు ఆరోగ్యం కోసం వేము తినడం ఆచారమైందట. దీనిని ధర్మసింధుకారుడు కూడా విధి విహితంగా ఉల్లేఖించాడంటే ఈ విశ్వాసం మనవారిలో ఎంత వేళ్లు తన్నుకుని ఉందో ఊహించుకోవచ్చు. ఇంతకూ వేప మన జీవితంతో ప్రాచీన కాలంనుంచి ఒక భాగంగా చిగిర్చి పూస్తున్న చెట్టు.

తెలుగునాటి జానపద జీవితానికి దర్పణమైన గాథాసప్తశతిలో వేము ప్రస్తావన ఉంది. దుర్మార్గుల హృదయాలు "పక్కాఇవి ణింబ ఫలాఇ" (పక్వమైన వేపపండ్ల వంటివి — పైన చిరుతియ్యగా ఉంటాయి. లోపలంతా చేదు) అనే వర్ణన ఉంది. (248 వ గాథ.)

క్రీస్తుశకం ద్వితీయ శతాబ్దిలో (145) శాతవాహనరాజు సిరిపులమావి కాలంలో కుమారదత్తుడనే సేనాపతి వేపూరు అనే గ్రామంలో చెరువు త్రవ్వించినట్టు మేకదోని శాసనంలో ఉన్నది.

ఇక తెలుగు సాహిత్యంలో వేమును గురించి చెప్పిన మొదటి కవి పాల్కురికి సోమనాథుడు.

"మావిడి బీజంబు మహిమీద విత్త
గా వేమగునె పెక్కు కథలేల సెప్ప?"

(బసవ పురాణం ప్రథమాశ్వాసం, బసవేశ్వరుడు వడుగుపద్దని తండ్రితో వాదించే ఘట్టం.)

తిక్కన అనుశాసనిక పర్వంలో కరివేమును చెప్పాడు:

"మునగ యుల్లి యడవిమునగ దుర్మాంసము
లానుగమ్మ మలినమైన యుప్పు
కరియ జీలకఱ్ఱ కరివేము కురుజ యిం
గువ ప్రవర్జనీయ కోటి.........."

రెండు వే లేండ్లుగా ఉన్న ఈ తెలుగుపదం పుట్టు కేమిటి?

ఇది తెలుగు పదమే అనడానికి తమిళ, మలయాళ, కన్నడ, తుళు భాషలలోను ఈ పదం సదృశ స్వరూపంతో కనిపించడం ప్రమాణం.

వేము, వేప— తెలుగు
వేంబు, వేప్పు, వేప్ప—తమిళం.
బేవు—కన్నడం.
వేంబు, వేంపు మలయాళం.

వేంబు ఔపవిభక్తికరూపం తమిళంలో వేప్ప - వేప్పమరం, వేప్పఙ్కాళ్, వేప్పెణ్ణయ్ - అని ద్విత్వపకారాంతంగా మారింది; తెలుగులో వేమ్ప, వేంప, వేఁప అనే అనునాసిక పూర్వపకారాంతంగా నిలిచింది.

సంస్కృతంలోని వేపవాచకాలతో వేముకు సంబంధం ఉందేమో చూదాం. సంస్కృతంలోని అరిష్టః, సర్వతోభద్రః, హింగునిర్యాసః, మాలకః, పిచుమందః, నింబః-అనే మాటలున్నాయి ఈ ఆరింటిలోను నింబశబ్దం మన వేంబుకు కొంచెం ధ్వనిలో సన్నిహితం

ఈ నింబనుంచే నేటి ఉత్తరాపథ భాషల వేము వాచకాలు పుట్టాయి. లింబ, లిబడో, లింబాడో, లింబ్ కొహుంబా - గుజరాతీ, లింబా, నింబే - మరాఠీ నీం. మహనీం, బుఖాయిం దేక్, బకం, దర్కోనా (కాయ)-పంజాబీ. ద్రేక్, బక్యిం, బేతాయిం, దేయిక్నా, బకర్జా, మహానింబ్-హిందీ. బకెనీ-నెపాలీ కొహుంబా, నింబూ, సింబా, గాబా-సింహళీ.

ఈ విధంగా నింబశబ్దం నేటి ఉత్తరాది భాషలలో రకరకాలుగా భాషా శాస్త్ర విరుద్ధంగా మారింది కాని ఈషద్ధ్వని సాన్నిహిత్యం కారణంగా నింబశబ్దం నుంచి వేంబును సాధించడానికి ఏ భాషా శాస్త్ర నియమంతో నన్నా సాహసించినా సాధ్యం కాదు. తక్కిన ఐదు మాటలతోను వేంబుకు ఏ పోలికా లేదు.

అట్లయితే, ఈ స్వతంత్ర పదమైన వేంబు ఎలా రూపొందింది?

కొన్ని యకారాంత ధాతువులనుంచి పుట్టిన పదాలు అనునాసిక పూర్వ పబలతోను, ద్విత్వపకారంతోను కనిపిస్తున్నవి గనుక వేంబు వేయ్ ధాతువునుంచి - వేయ్ = వేంబు, వేప్ప (త), వేము, వేంప, (తె), బేవు (కన్న)-పుట్టిందని సుప్రసిద్ధ భాషా శాస్త్రజ్ఞులు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు అన్నారు. వేయ్ అనే ధాతువుకు నీట (-చల్లనినీడ, ఆరోగ్యమిచ్చే నీడ-) వేయు, ఇచ్చు అనే అర్థం చెప్పుకోవచ్చు నన్నారు.

ఇలాగే పాయ్ - (ఎగురు) పాంబు (త), పాము, పాంప (తె). పావు, హావు (క), పూయ్ - పూంప (తె), పూవు (తె. క), కాయ్ - కాంపు (తె), కాయ్పు, కావు, కాహు (క), కాంబు (త) కావు, కాము (క), కామ (తె), మోయ్ - మోంపు, మూపు (తె), మోపు (క). వాయ్ వాంపు (తె), బావు, బాతు (క), తోయ్ - (తడుపు) తోంపు. రోయ్ - రొప్పు.

ధాతువు అనేది పెక్కు సదృశార్థక పదాలలోనో, సన్నిహితార్థక పదాలలోనో కనిపించే మూల స్వరూపానికి వైయాకరణులు పెట్టుకున్న సంకేతం. అది క్రియాత్మకమే కానక్కరలేదని, మూల స్వరూపమాత్ర సంకేతమని మనం - వేయ్ విషయంలోనైనా - అనుకుంటే, వేయ్ ధ్వన్యనుకరణ వాచక మూల శబ్దమని నిష్పత్తికి ప్రయత్నించవచ్చు దీని కోసం మనం వైద్యకశాస్త్ర గ్రంథాలవద్దకు వెళ్లవలసి వుంటుంది.

అష్టాంగ హృదయకారుడు చేదు రసానికి చెప్పిన లక్షణ మిది: "తిక్తో విశదయ త్యాస్యం రసనం ప్రతిహంతి చ" చేదువస్తువు తింటే నోరు వికారంతో వెడల్పారుతుంది. రస గ్రహణశక్తి నశిస్తుంది- అని దీని తాత్పర్యం ఎంతో పరిశీలనతో వైద్యక శాస్త్రజ్ఞులు ఈ లక్షణం చేశారనడం నిస్సంశయం.

తెలిసి తెలిసి కాయనాను మింగితే - దాని సంగతి తెలుసు గనుక - ముఖ వికారాలు మనం అణచుకో గలుగుతాము. కాని పరధ్యానంగానో, మంచి వస్తువనే భ్రాంతితోనో దానిని నోట్లో వేసుకున్నా మనుకోండి; ఎలా వుంటుంది అనుభవం? నోరు 'సెలవివార' తెరచుకుంటుంది అప్రయత్నంగా ముప్పైరెండు పళ్లూ ఎదుటివారికి కనిపిస్తాయి. నాలుక మొద్దుబారి, చక్కెర తిన్నా కొంత సేపటికి వరకు మజా వుండదు వికార ధ్వనికూడా పుడుతుంది.

మొట్టమొదట వేపచెట్టును చూచిన మన పూర్వులు దాని పండ్లను, వాటి బంగారు రంగును చూచి, వాటిని అప్యాయంగా నోట్లో వేసుకుని నమిలి వుంటారు. అప్పుడు చేదును భరించలేక, వారి నోటినుంచి అప్రయత్నంగానే వేయ్‌య్‌య్, కయ్‌య్‌య్, చెవ్చెచ్చెత్, తిక్‌క్‌క్ అనే అవ్యక్త వికారధ్వనులు వెలువడి వుంటాయి.

ఆ వికారధ్వని అనుకరణమే - వేయ్ అనే స్వతంత్ర మూలపదంగా స్థిరపడి వేంబు, వేంప, బేవులుగా మారివుంటుంది.

వికారాన్ని, వెగటును సూచించే పదాలు తెలుగులో 'వె' కారాదిగా వున్నవి. కొల్లలుగా కనిపించడం కూడా 'వేయ్' వికార ధ్వన్యనుకరణ శబ్దమనడానికి సాధకం.

వెకలి, ఎక్కలి = మూఢుడు, అసక్తుడు; వెక్కసం; వెక్కసి = దుస్సహుడు; వెక్క = వేడితో నోరుతెరచు, వేడి; వెక్కిరింత; వెక్కిలి = ఎక్కిలి, దప్పి మొదలైన వాటితో కలిగే వ్యాధి; వెంగలి, వెంగళి = అవివేకి, వెర్రి; వెగటు = వైరస్యం; వెగడు = తల్లడం; వెంగడం = విపరీతం, విరుద్ధం; వెంపర = పీడనం, హింస, భేదనః; వెంపరలాడు; వెంబర = దుష్ట; వెంబరవిత్తు = దుష్టాగ్రణి; వెంపలివెట్టు; వెట్టి.

కయ్ అనే అనుకరణ ధ్వని కయప్పు, కజప్పు కళప్పు అని తమిళం లోను; కయ్, కయి, కంయి, కయ్పె, కయ్పు, కయ్క, కయ్కై, కహి, కహిపు అని కన్నడంలోను చేదును తెలిపే పదాలుగా రూపు దాల్చింది. ఈ కయ్-కహి మనకు, కన్నడంవారికి కసు, కసి అయింది– కసుగాయ, కసి కాయ ఈ కయ్ - చేదువల్ల తలకెక్కేది కయ్పు.

చేదుకూడా అనుకరణ శబ్దమే.

తిక్త అనే సంస్కృత శబ్దం కూడ చేదుతో మొద్దుబారిన నాలుక కొస పళ్ళకు తాకగా పుట్టిన ధ్వని అనుకరణమే ననుకుంటాను.

వేము ఉత్తరాది భాష లన్నిటిలోను కనిపించే వేపవాచక పదాలకు మూల ప్రాచీన పదమైన 'నింబ' కూడ ధ్వన్యనుకరణ వాచకమే అయి వుంటుంది. దాని వుపయోగం తెలిసిన తర్వాత పండితులు వ్యుత్పత్తి కల్పించి వుంటారు. ఆ వ్యుత్పత్తు లివి :

నింబ = నింబతి స్వాస్థ్యం, ణి సేచనే. స్వాస్థ్యాన్ని చిలకరిస్తుంది: వర్షిస్తుంది. అరిష్ట = న రిష్యతే రోగిజనః అనేన. రిష్ హింసాయాం, రోగులు దీనితో బాధపడరు. సర్వతోభద్రః = సర్వతో భద్రం అస్య. ఇది యావత్తూ రక్షణ కారకం; దీని పరిసరాలన్నీ రక్షణ కలిగించేవి. హింగు నిర్యాసః = హింగు నిర్యాస ఇవ నిర్యాసః అస్య, ఇది ఇంగువవంటి బంక నిస్తుంది. మాలకః = మాలతే కాక సమూహం, మల, మల్లధారణే. కాకులు కూచునేది. పిచుమందః = పిచుం కుష్ఠం మందయతి, కుష్ఠం హరిస్తుంది.

ఇవన్నీ వేపచెట్టు వైద్యక ప్రయోజనాలు తెలిసినమీదట వచ్చిన పేర్లనడం స్పష్టం.

వేప ప్రయోజనాలు అపరిమితాలు అనుకనే దీనిని ప్రపంచంలో పెక్కుచోట్ల దేవతావృక్షంగా పరిగణించారు. పర్షియావారు, అరబ్బులు దీనిని ఆజాద్‌దరఖ్త్ అన్నారు - అంటే, స్వతంత్రవృక్షం, పవిత్ర వృక్షం అన్నమాట. మనకు వారిది తురకవేప, కొండవేప, వారు మన దేశానికి వచ్చిన తర్వాత యిక్కడున్న మన వేపనుకూడా ఆ పేరుతోనే వ్యవహరించారు.

ఈ ఆజాద్ దరఖ్త్ అరబ్బులద్వారా సిసిలీ,స్పెయిన్‌లకు, అక్కడినుండి యూరోప్ అంతటాను (మెలియా) అజాదరక్‌చా అనే పేరుతో వ్యాపించిందని వృక్షశాస్త్రజ్ఞుల నిర్ణయం.



# పొత్తు - 83
# పొదు



పొత్తు అనే పదానికి స్నేహం, సహవాసం, విశ్వాసం, ఉమ్మడి, అవిభక్తత అనే అర్థాలున్నాయి. వీటిని నిఘంటుకారులు కూడా గ్రహించారు.

"పొత్తున కుటుంబరక్షకు
పొత్తులవా రంద అప్పు పుచ్చినచోటన్
పొత్తుల వా రందఱు ఋణ
విత్తం బరువంగవలయు విధివిహితముగన్."

అని అవిభక్తత అనే అర్థంలోను,

"ఉత్తమ మగు ద్రవ్యంబును
విత్తంబును న గ్రజునికి వింశాంశంబున్
పొత్తున నిచ్చి సహోదర...."

అని ఉమ్మడి అనే అర్థంలోను శబ్ద రత్నాకరకారులు వుదహరించారు.

"పోరు నష్టి, పొత్తు లాభం"—స్నేహం. "వీధులు అందరికీ పొత్తు"—సర్వ సామాన్యం. "ఆ సరకు పొత్తున కొన్నారు"—ఉమ్మడి. "ఆ పని పొత్తులు పోక పడవేసినారు" –కలిసికట్టుతనం.

"నృపు పొత్తు బాము పొత్తుం
గపటుండగు మిత్రు పొత్తు గడసరి పొత్తున్
విపరీత భార్య పొత్తున్
నెపమిడి విడువంగవలయు–"

సహవాసం. వీటిని బ్రౌన్‌పండితులు వుదాహరించారు.

ఈ పొత్తునుంచే పొత్తుకాడు = స్నేహితుడు; పొత్తుకత్తె = స్నేహితురాలు; పొత్తుగడుపు = సహ భోజనం; పొత్తులవాడు = ఇద్దరికి సమమైనవాడు; పొత్తుచేయు = స్నేహముచేయు – అనే మాటలు వచ్చాయి.

కాని, ఉమ్మడి అనే అర్థంలో పొదు అనే మరొక మాట కూడా వుంది. ఇది దక్షిణాంధ్రుల, చిత్తూరు జిల్లావారి వ్యవహారంలో వున్నప్పటికీ నిఘంటుకారులు గ్రహించలేదు.

తెనుగు తోబుట్టువులైన తమిళ, మలయాళాలలో పొదు అన్నది సర్వసామాన్యం, సాధారణం, ఉమ్మడి అనే వ్యవహారంలో వుంది. పొత్తి = సర్వసామాన్యత. పొత్తె = బొద్దు; బొజ్జ

అయితే మనకు పొదు అనే మాటకు ఉచ్చారణలో దగ్గరగావున్న పొది అనే మాట పొదుగు, భారం, అమ్ముల పొది, ఓదరేవు, సమూహం అనే అర్థాలలో వుంది. దీని నుంచే పొదికట్టు = వాకిటి ముందరి పంచ పాక, పొదిగొను = గుంపుగూడు, పొదుపు మొదలయిన మాటలు వచ్చాయి.

పొది అనేదానికి భారం, సమూహం అనే అర్థాలు వుండడాన్నిబట్టి పొదు అనే మాటకూడా మొదట్లో వుండి వుంటుందని వూహించడానికి అవకాశం వుంది.

దీనికి ప్రబలమైన నిదర్శనం అనాది జాతులలోని కొన్ని తెగలలో ఈ మాట వుండటమే. ఈ తెగలవారు వ్యవసాయాన్ని 'పొదు' అంటారు. వారి వ్యవసాయ పద్ధతినిబట్టి భూమంతా ఊరి ఉమ్మడి ఆస్తి, అందరూ కలిసి సేద్యం చేసి పంచుకుంటారు. వీరు పన్నులు కూడా గ్రామాలవారీగా చెల్లిస్తారు గాని వ్యక్తిగతంగా చెల్లించరు. అందరి సమ్మతి పైనా భూమి పంపకం జరుగుతుంది. ఒకరికి ఒక సంవత్సరం పండని భూమి వస్తే మరుసటి సంవత్సరం సారవంతమైన భూమి యిస్తారు.

ఇది మన ప్రాచీన గ్రామసమష్టి జీవనానికే నిదర్శనం. పొదుగా-ఉమ్మడిగా చేసే వ్యవసాయం గనుక యిది పొదు అయింది. క్రమంగా యిది ఆంగ్లోచ్చారణ మూలంగా పోడు అనే ప్రత్యేక వ్యవసాయ పద్ధతికే సంకేత మయింది.

పొదు అనే మాట తెనుగులో ఉమ్మడి అనే అర్థంలో వుండి, తర్వాత ఎప్పుడు జారిపోయిందో చెప్పలేము. కోయలలోను, మాండలికంగాను మాత్రం మిగిలిపోయింది.

# నక్క – నరియుడు



నక్కపై మనకు పెక్కు పలుకుబళ్ళు, సామెతలు ఉన్నాయి; నక్క వినయం, నక్క జిత్తు, నక్కబావ, నక్కగుంట, నక్కబొక్క, నక్క పల్లం, తోకతెగిన నక్క, నక్క మొగం చూచిరావడం, నక్కను తొక్కి రావడం, నక్క కొమ్ము తొక్కిరావడం, పులిని చూచి నక్క వాత పెట్టు కొనడం, నక్క ఎక్కడ నాగలోక మెక్కడ—లాంటివి.

ఎవరికైన అకస్మాత్తుగా ఏదో మంచి కలిగినప్పుడు "నక్కను తొక్కి వచ్చినాడు, నక్క మొగం చూచి వచ్చినాడు" అని ఆశ్చర్యం ప్రకటిస్తాము. కలవాణ్ణి చూచి లేనివాడు తాహతుకు మించి అనుకరిస్తూ గొప్పలకు పోబోతే "పులిని చూచి నక్క వాత పెట్టుకున్నట్టు" అని పెదవి విరుపులు. మూతి ముడుపులు ప్రారంభమౌతాయి. తక్కిన పలుకు బళ్ళు నక్క స్వభావాన్ని తెలిపేవి.

నక్క మొగం చూస్తే అదృష్టం రావడమేమిటి? నక్క పులిని చూచి వాత పెట్టుకొనడమేమిటి? నక్క అంటే మరో అర్థం కూడా వుందా? ఈ అర్థం యితర తెనుగు తోబుట్టువులలోనూ కనిపిస్తుందా?

తమిళ, కన్నడ, మలయాళాలలో నక్కను నరి అంటారు. మన సాహిత్యంలో నక్కకు కనిపించే పర్యాయాలు - సగ్గారి, వరదు, నరియడు. సగ్గారి సృగాల అనే సంస్కృత శబ్ద భవం. నరియడు నరి అనే ప్రాచీన పదానికి దగ్గరిది.

తమిళ సాహిత్యంలో నరి అనే పదానికి పులి అనే అర్థం వుంది. నరిపయం అంటే పులి భయం. నరి అనే ధాతువుకు చెరుచు, నలుచు,

పీడించు, వేచు అనే అర్థాలున్నాయి. తమను పీడించి, బాధించి, నలిచి, వేచుకుతినే హింస్రజంతువు లన్నిటినీ మన పూర్వులు నరి అనే పేరుతోనే వ్యవహరించి వుంటారు. క్రమంగా యితర వ్యవహారాలు ఏర్పడివుంటాయి. కనుకనే తమిళ సాహిత్యంలో మాత్రమే నరి అనే పదానికి పులి అనే అర్థం నిలిచిపోయింది; వ్యవహారంలో మరుగయింది

ఈ నరికి బహువచన ప్రత్యయమైన కళ్ చేరిన నరికళ్ అనే పదం నుంచి నరికళ్—నర్కళ్-నక్కల్-నక్కలు అయి, నక్క అనే ఏకవచన రూపం తెనుగున ఏర్పడింది.

ఈ నక్కకు పులి అనే వ్యవహారం తెనుగునాడులో ఎప్పుడైనా వుండిందా? సాహిత్యంలో కనిపించదు. కాని పశ్చిమాంధ్ర ప్రాంతంలోని చిత్తూరు, అనంతపురం జిల్లాలలో చిరుతపులికి నక్క, పెద్దనక్క అనే వ్యవహారాలు నేటికీ వున్నాయి. కనుక ఒకప్పుడు నరి తమిళంలోలాగ తెనుగులోను పులికి వ్యవహారంలో వుండి, దానినే పోలిన చిరుతపులికి నేడు వాడుకలో మిగిలిందని వూహించవచ్చు.

అయితే, మన సాహిత్యంలో చిఱుతపులికి చిఱుత, చిఱుతపులి, చిఱుతపురి, పొన్నడ, దువ్వి – అనే పర్యాయా లున్నాయి గాని నక్క అనేది కనిపించదు. అయినా, మాండలికంగా వున్న వ్యవహారాన్ని బట్టి నక్కపైన వున్న కొన్ని సామెతలను అర్థం చెప్పుకోవచ్చునేమో చూద్దాం!

పులికి, చిఱుతపులికి చాల పోలికలున్నాయి; పులివి చారలు, చిఱుత పులివి మచ్చలు. చిఱుతపులి పులి కావడానికి ప్రయత్నిస్తే సబబుగా వుంటుంది కాని, ఏ విధంగాను నక్కకు పోలిక లేదు. మచ్చలున్న చిఱుత పులి పులితో పోటీపడడానికి వాతలు పెట్టుకొని చారలు చేసుకున్నట్టు— అని అనడంలోనే సబబు. నక్కకు మాండలికంగా వున్న చిఱుతపులి అనే అర్థం ప్రాచీనకాలంలో వ్యాప్తంగా వుందేదేమో! కనుకనే ఈ సామెత

వచ్చివుంటుంది. ఈలాంటి సామెత కన్నడంలోను వుంది; "హులీ బణ్ణక్కె నరి మేయ్ సుట్టుకొండ హాగె'' – (పులి రంగకోసం నక్క ఒళ్ళు కాల్చుకున్నట్లు) అని.

ఇక నక్కను తొక్కడం. నక్క మొగం చూడడం— అనే సామెతలు నక్క అంటే పులి అనే అర్థం చెప్పినపుడు చక్కగా అతుకుతాయి. పులి మనిషిని చూచినా, మనిషి పులిని చూచినా ముప్పే. అలాంటప్పుడు పులిని మనిషి తొక్కితే ఇక నేముంది? కనుక ముప్పు తప్పిన అలాటివాడు అదృష్టవంతుడు కాక మరేమౌతాడు? ఎప్పుడో జరిగిన ఈలాటి సంఘటనో, వూహించిన సంఘటనో ఈ నానుడికి కారణమై వుంటుంది.

ఇక నక్కకొమ్ము తొక్కడం—మాట. నక్కకొమ్ము గారడివాళ్ళు వాడే వస్తువు. నరిక్కొంబు - అని తమిళ సాహిత్యం తెలుపుతున్నది. కన్నడంలో నరికొంబు అనే ఇంద్రజాలికుల సాధనం వుంది. "నరికొంబిద్దరూ హరియోదు తప్పితే!" (నక్కకొమ్ము వున్నా పోరియుట తప్పినా!) అని. "నరికొంబిద్దరూ నరరిగె హెదరబేకు" (నక్క కొమ్మున్నా నరులకు బెదరిపడాలి) అని సామెత లున్నాయి. తెనుగులో నక్క పేరుతో పెక్కు మొక్క లున్నాయి - నక్కతోక కసవు, నక్కతోక పొన్న, నక్కతోక బియ్యం, నక్కదోస, నక్కనరము, నక్కనేరేడు, నక్కరేను, నక్కవిరిగి, నక్కెర, నక్కెలు అనేవి. నక్కకొమ్ముకూడ ఒక అపూర్వ మూలికే. దానితో గారడివాళ్ళు తమాషాలు చేసేవారేమో! ఈ నక్కకొమ్మునే మను చరిత్రలో ఆటవికులు రాజుకు కానుకిచ్చినది.

"ఒక్క యెలుక తేడు నక్కకొమ్మును నిల్టి
గోలజంబు జున్ను జాలపప్పు
బీలిగలుల యంపకోలలు నలవిండ్లు
గాను కిచ్చి కరయుగంబు మొగిచి"

(మను ఆ-4, ప-14)

ఆటవికులకిది అపూర్వ వస్తువు. ఈ నక్క కొమ్ముతో అద్భుతాలు జరిపే ఆచారం సవరలు, ఎరుకలు, ఏనాదులు మున్నగు ఆటవిక జాతుల గారడీ వారిలో వున్నది. ఈ మూలిక స్పర్శతోనే ఆశ్చర్యకరమైన విషయాలు సంభవిస్తాయని మన పూర్వులు భావించి వుంటారు. ఇది యాదృచ్ఛికంగా తగిలినా అదృష్టమే కదా! ఈ భావంతోనే "నక్కకొమ్ము తొక్కి వచ్చినాడు" -- అనే నానుడి వాడివుంటారు.

నరికళ్ నుండి విడిపోయి స్వతంత్రమైన "నక్క" మరల తమిళంలో "నక్కన్" అనే రూపంతో చేరింది. ఈ రూపం తెలుగు నుంచి గ్రహించబడిందని తమిళ పండితులు అంటున్నారు. కన్నడంలో నక్క నక్కె అయింది.

నక్క చాల యాతనలు పెట్టేది గనుకనే పెక్కు మతాలవారు దీని బారినుంచి తప్పుకొనడానికి స్తోత్రాలు, సూక్తులు చెప్పారు; దేవమృగంగా భావించారు. ఈజిప్టులో మూడువేల ఏళ్ళ కింది సమాధులలో నక్కను పూజించే చిత్రాలున్న శకలాలు దొరికాయి. దీనినిబట్టి నక్కలు సమాధులను బొరియలు చేసి పాడుచేయకుండా ప్రసన్నం చేసుకొనడంకోసం వాటి చిత్రాలు వ్రాయడం, శిల్పాలు చెక్కడం సంభవించి వుంటుందని పురాతత్త్వ శాస్త్రజ్ఞులు అంటున్నారు.



# అరిసి-బియ్యం



మనం అనుదినం తప్పనిసరిగా వాడే మాటలే అన్యభాషవని తెలిసినప్పుడు కలిగే ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. ఈ అవస్థ ఏ భాషకూ తప్పదు. అలాటి మాటలలో బియ్యం ఒకటి నడమంత్రంగా వచ్చిన ఈ మాట అంతకు ముందున్న మాటను తోసిరాజన్నది.

మనకు బియ్యం కొత్తది కాదు. మన గ్రామ జీవితానికి కవితా రూపంలో వున్న తొలి వక్కాణమనదగిన గాథా సప్తశతిలో వరిచేలు, వరి మళ్లు, శాలిధాన్యం, బియ్యం పిండికొట్టడం - మున్నగు వాటిని గురించిన ముక్తకాలు కొల్లలు.

పాపం ఒకావిడకు శాలిక్షేత్రం ప్రియ సమాగమ సంకేత స్థానం. శాలిక్షేత్రం పండి తెల్లబడుతున్నది. త్వరలో కోతలు జరుగుతాయి. మరి ఎక్కడ కలుసుకోడం ప్రియుణ్ణి? హరితాళం - అరదళం - అలదుకున్న నటివలె జనప చేను ఎదుగుతున్నదలే-అని ఆవిడ చెలికత్తె వూరడిస్తున్నది.

కిం రుఅసి ఓణఅముహీ
ధవలాఅంతేసు సాలిఛేత్తేసు,
హరిఆల మండిఅముహీ
ణడివ్వ శణవాడిఆ జాఆ (1-18)

మరొక చోట పండిన వరిచేలనుంచి చలికాలంలో మంచుబొట్లు కారుతుండడం చూస్తే - తనకు ముదిమితో ఖల సంగం (కళ్లంతో సహవాసం) అవుతుందనే చింతతో వరిచేను తల (కంకి). వేలవేసుకుని, ఏడుస్తున్నట్టు వున్నదని వర్ణించాడొక ముక్తక మహాకవి.

కహంమే పరిణఇఆలే
ఖలసంగో హోహి ఇత్తి చింతంతో,

ఓణుఅముహో ససూఓ
రువ ఇవ సాలీ తుసారేణ (8–69)

ఇలా చెప్పుకుంటూపోతే ఎంతో గ్రంథం అవుతుంది. శాసనాల లోను, తెనుగు సాహిత్యంలోను బియ్యం ప్రసక్తికి కొదువలేదు. పెరుగు వడ్లు కలిపినట్లనే సామెతనే నన్నెచోడుడు ప్రయోగించాడు అలాంటప్పుడు యిది అన్యభాష నుంచి రావడ మేమిటి?

బియ్యం మాట తడిమితే భూగోళం తూర్పు కొననుండి పడమటి కొనవరకు యాత్ర చేయకతప్పదు మనం. తీగ కదిపితే డొంకంతా కదులు తుందంటారు కదూ?

వరి దక్షిణ భూభాగంలోని పంటేనని వృక్షశాస్త్రజ్ఞుల మతం. ఇది దక్షిణాపథం నుంచి కొచ్చిన్ చైనాకు వెళ్లిందట. అక్కడి నుంచి ఉత్తర భారతానికి తిరిగివచ్చి అరేబియా, ఈజిప్టులమీదుగా గ్రీసుకు వెళ్ళి, పాశ్చాత్యదేశాలకు వ్యాపించిందట.

చీనాలోనే మొదట వరిపంట ఉండేదని, క్రీస్తుకు పూర్వం మూడు వేల సంవత్సరాలకు ముందునుంచే చీనావారికి వరిపంట తెలుసునని స్టేనిస్ లెస్ జూలియన్ అనే శాస్త్రజ్ఞుడు తెలిపాడు క్రీస్తుకు పూర్వం 2800 సంవత్సరాలక్రితం వున్న చీనా చక్రవర్తి చిన్నుంగ్ పంచధాన్యాలు ప్రదర్శించే ఉత్సవ మొకటి ఏటేటా ఏర్పాటు చేసేవాడట, వరిని చక్రవర్తి స్వయంగా దర్బారులో ప్రజలకు చూపేవాడట. తక్కిన నాలుగు ధాన్యాలను యువరాజు మున్నగువారు చూపేవారట. కనుక యిది చీనానుంచే ప్రపంచానికి వ్యాపించింది – అని ఈయన వాదం.

ఏమైనా దీనిని గురించి మూడు వాదా లున్నాయి : (1) చీనానుంచి వ్యాపించింది. (2) భారతదేశంలోనే అనాదిగా వుండి యితర పాశ్చాత్య దేశాలకు వ్యాపించింది (3) దక్షిణాపథం నుంచి – ముఖ్యంగా తమిళదేశం నుంచి పర్షియా, అరేబియా, గ్రీసులమీదుగా వ్యాపించింది.

చీనా వాదం గురించి మొదటే చదివినారు గదా! రెండవ వాదం వినండి: సంస్కృతంలో వరికి ముఖ్యంగా వాడే మాట వ్రీహిః. వ్రీణాతి దేహమితి = వ్రీహిః (దేహాన్ని భరిస్తుంది) అని వ్రీ భరణే అనే ధాతువు నుంచి వ్రీహిశబ్దం పుట్టింది. వృఞ్ వరణే అనే ధాతువునుంచి వృణోతి దేహం = వ్రీహిః (దేహాన్ని అభివృద్ధికోసం వరిస్తుంది) అని కూడా సాధించవచ్చు. అనాదిగా యిది భారతదేశంలో పండుతున్నది. వివాహాది వైదిక కార్యాలలో దీని ప్రాధాన్యం ఉండడమే దీని ప్రాచీనత్వానికి నిదర్శనం. వివాహంలో పెండ్లికూతురు సోదరుడు పెండ్లికుమారునికి శాలిధాన్యం పేలాలు అందివ్వడంవల్లనే 'శ్యాలః' (బావ) అనే మాట పుట్టింది పాత పారశీకభాషలో దీనికి సమానపదం కనిపించకపోయినా నేటి పారశీకపు మాట బిరింజ్. పుష్తోలో వ్రిజ్జా. బహువచనం వ్రిజ్జె. వజీరిస్తాన్‌లోని బరకాయి తెగలో వ్రిజ్జా ఆర్మేనియన్‌లో బ్రింజ్. హిందూకుష్ భాషలలోని గిల్గిత్ భాషలో బ్రాన్, బ్రియన్. చిత్రాల్‌లో గ్రింజ్, సంస్కృతంలోని హకారం ఫారసీలో జకారమౌతుంది సహస్ర – హజార, హిమ - జిమ, హృదయ - జిరెద. కనుక ఇండో - పర్షియన్ శాఖకు చెందిన ఈ మాటను బాబిలోనియా నుంచి గ్రీకులు 'ఒరుజా' అని తీసుకున్నారు. ఇది ఇటాలియన్‌లో రిసో అయి. ఫ్రెంచిలో రిజ్ అయి, ఇంగ్లీషులో రైస్ అయింది. కనుక రైస్ అనేది వ్రీహి నుంచి వచ్చిందని, భారతదేశం నుంచే పాశ్చాత్య దేశాలకు వ్యాపించిందని సి జె లియాల్ పండితుడన్నాడు.

మూడవ వాద మిది: వరిని తెలిపే ఏ పదమూ ఋగ్వేదంలో లేదు. అథర్వవేదంలో మాత్రం యవమాషతిలాలతో కలిపి చెప్పబడి వుంది. ఒరిస్సాలో బియ్యం విశ్వామిత్ర సృష్టి అనే వ్యవహారం వుంది. పాత ఈజిప్టు ధాన్యం చిత్రాలలో వరి బియ్యం చిత్రాలు లేవు మధ్య ఆసియాలో యిది పూర్వం కనిపించలేదు దక్షిణాసియాలో పాతపంట కాదనడానికి అవకాశం లేదు. ఋగ్వేదంలో దీని ప్రసక్తి లేకపోవడమే ఈ అనుమానానికి కారణమని కొందరు వృక్షశాస్త్రజ్ఞు లంటున్నారు. తమిళులకు, ఇతర

దక్షిణాదివారికి వరి సంగతి చాల కాలం కిందనే తెలుసు ననడానికి అరి, అరిసి, ఉరి అనే మాటలు ప్రమాణం కనుక దక్షిణాపథం నుంచే వరి వ్యాపించింది – అని మొయిదీన్ షెరీఫ్ అనే శాస్త్రజ్ఞు డన్నాడు.

తమిళంలో బియ్యానికి పర్యాయమైన అరి, అరిసి; కన్నడంలోని అక్కి, అరి; తుళు మలయాళాలలోని అరి అనే పదాలలోను, తెనుగులో ధాన్యవాచకమైన వరి, వడ్లు, వడ్లు, ఉర్లు పదాలలోను; అనాది జాతులలో ఒకటైన సంతాలు తెగ వాడే ఉరీ, ఉరిహోరో అనే పదాలలోను తరచు విని పిస్తున్న మూల శబ్దం అరి, అరిసి. అరి = వేరుచేయు (ఊకనుంచి వేరు చేయబడినది) అనే అర్థంలో అరి, అరిసి (బియ్యం) అనే మాటలు ఏర్పడి నవి. అరి అనే పదానికి కన్నడంలో బహుశా బహువచన ప్రత్యయం కాలక్రమాన చేరి అరికళ్, అర్కళ్ అయి, బహువచన ప్రత్యయంలో సగం జారిపోయి, కన్నడంలో అక్కి - అక్కి అనే మరొక రూపం ఏర్పడి వుంటుంది. తెనుగులో ఆ పదం అక్కుళ్ళు అనే రూపంలో మరొక బహు వచన ప్రత్యయంతో నిలచి, ఒక తెగ ధాన్యం తెలిపే మాటయింది. అరిసి అనే పదం అరిసె అని మార్పు చెంది భక్ష్య విశేషవాచకంగా తెనుగులో నిలిచింది. అరిసెలు బియ్యపిండితో వండేవే గనుక అనుమానానికి ఆస్కారం లేదు.

తండులం అనే సంస్కృతం మాటలోను ద్రావిడ భాషాచ్ఛాయ ఉందని మొయిదీన్ షరీఫ్ అన్నాడు ఆజంగఢ్ ప్రాంతంలో నివ్వరికి తెన్నీ అని వాడుతారని, తెన్ అనడమే దక్షిణాది సంబంధం తెలుపుతున్న దని ఆయన వాదం.

ఈ వాదంలో కొంత సత్యం వుంది. తండుల శబ్దాన్ని బియ్యం అనే అర్థంలో అమరకారుడు గ్రహించలేదు. తడి తాడనే (కొట్టుట) అనే ధాతువు నుంచి తండుల శబ్దాన్ని (వడ్లను దంచడంవల్ల కలిగింది) తర్వాతి సంస్కృత పండితులు సాధించారు. అమరంలో వాయువిళంగాల పర్యా యంలో కనిపించే చిత్రతండుల శబ్దాన్ని బట్టి తండుల పదానికి గింజ అనే

అర్థం వస్తుంది. ఇంతకూ వ్రీహి శబ్దమే ప్రాచీనం కానప్పుడు తండుల పద ప్రాచీనత్వ విచార మెందుకు ?

ఈ అరిసి చీనా, భారత పర్షియాం మీదుగా అరేబియా చేరి అరబ్బీలో అల్‌రుజ్, అ్రుజ్ అని; ఈజిప్టు భాషలో అరూస్, రూజ్, రూస్ అని; గ్రీక్‌లో ఒరుజా అని మార్పుచెందింది ఇది ప్రాచీన కాలంలో మధ్య పాచ్య దేశాలలో కనిపించడం లేదనే వృక్షశాస్త్రజ్ఞుల మాటే మనకు పరమ ప్రమాణం. వ్రీహి శబ్దానికి వ్యుత్పత్తి తర్వాత కల్పించబడి వుంటుంది.

ప్రపంచ మంతటా వ్యాపించిన ఈ అరిసి మన నిత్య వ్యవహారం నుంచి జారిపోయి బియ్యమనే మాట - ఇతర ద్రావిడ భాషలలో లేని మాట - వాడకానికి రావడం వింతే కదా! ఇది సంస్కృత ప్రభావంవల్ల నడమంతరంగా వచ్చిన మాట. దాని వ్యుత్పత్తి యిది: వ్రీహిభవం = వ్రీహ్యం. ఈ వ్రీహ్యం బ్రియ్యం, బియ్యం, బీయం అని మూడు రూపాలయింది. బ్రియ్యం అని కొన్ని అనాదిజాతులలో నేటికీ వాడుకలో వుంది. బీజం అనేమాట బియ్యం అని మారిందని కొందరంటారు. కాని వారు బ్రియ్యం, బ్రియ్యాలు అని కొన్ని అనాది జాతులలో వున్న వ్యవహారానికి ఉపపత్తి చెప్పవలసి వుంటుంది

సంస్కృతంలోని యకారం తద్భవాలలో జకారం కావాలి కదా, వైద్యః = వెజ్జు; కార్యం = కర్జం అనే విధంగా-అని అనుమానించ నక్కర లేదు. కొన్ని తత్సమ పదాల యకారం ప్రాకృతంలో అట్టే నిలిచిపోవడం కూడ కద్దు; ఆర్యపుత్ర = అయ్యఉత్త లాగ. ఈ బియ్యం అరిసిని (అరిసెను) ఆటక ఎక్కించింది; అక్కిని గాదెలో వేయించింది.





# వంకాయ

వంకాయ మన దేశంలో చాల వ్యాప్తిలో వున్న కూరగాయ తెనుగు వారికి యిది మరీ యిష్టం....కనుకనే దీనిపై రకరకాల సామెతలు, చాటువులు పుట్టాయి, "వంకాయ కూరకు వరన్నానికి సిగ్గేమిటి ?" అన్నారు ఒకరు. "ద్వావేవ కోమలౌ పథ్యౌ వార్తాక వనితాధరౌ" అన్నాడు ఒక శృంగార వైద్యుడు.

"వంకాయ వంటి కూరయు
పంకజముఖి సీతవంటి భామా మణియున్,
శంకరునివంటి దైవము
లంకాధిపు వైరివంటి రాజున్ గలదే?"

అని ప్రశ్నించాడు ఒక వార్తాకాభిమాని.

"వంకాయ లమ్మ్మ దాసని
జెంకను బెట్టేసి సరకు జేకొనె జోరుం
డింకేమి జెప్ప మాకున్
వంకా యాపె సరకాయె వడ్లా జొన్నల్ !"

అని పుదుక్కోటరాజు శ్రీకోటి రఘునాథ తొండమాన్ మహీపాలుడు "వంకాయా పెసరకాయ వడ్లా జొన్నల్" అనే సమస్యను పూరించాడు (కవిజనోజ్జీవని—సమస్యలు). గుత్తివంకాయ (నించుడువంకాయ) కూరంటే నోరూరనివా రుంటారా?

మనకింత ప్రియమైన వంకాయ మొక్క తెనుగు దేశందేనా? ఈ పదం పుట్టుకేమిటి ?

ఇవి భారతదేశంలోనూ, బర్మాలోను ఏరాళంగా కనిపిస్తున్నందున ఆసియా ఖండపు మొక్కేనని వృక్షశాస్త్రజ్ఞులు అంటున్నారు "కాని, ఇది మన వైదిక కార్యాలలో, ముఖ్యంగా శ్రాద్ధంలో వర్జనీయం. మన ప్రాచీనులకు యిది తెలిసివుండదు. కనుక విదేశాల నుంచి వచ్చింది" అని కొందరు; "వర్జనీయ కోటిలో చేరిన వార్తాకం ములక కాని వంగ కాదు" అని మరికొందరు వాదిస్తున్నారు. "ఆధునిక పాశ్చాత్య సంస్కృత పండితులలో సర్ వాల్టర్ ఎలియట్ దీనికి సంస్కృత పర్యాయం యివ్వలేదు. బర్నెల్, యూలే యిచ్చారు గనుక యిది మన దేశందే ననటం వివాదాస్పదం" అని మరికొంతమంది వాదం.

వంకాయ మొక్కకు వంగ మొక్క అనే వ్యవహారంకూడా వుంది. వంగలో రకాలూ వున్నాయి: చిరివంగ, నీరువంగ, మెట్టవంగ మొదలుగా. తక్కిన తెనుగు తోబుట్టువులలో దీని పోలికలు కనిపిస్తున్నవేమో చూదాం.

తమిళంలో దీనికి కత్తిరి, కత్తరి, వళుదలై అని పేరు. మలయాళంలో వళువిని, వళుదినె. వళుదలై అనేది వంగలో భేదం. కన్నడంలో బదనె. కత్తరికి, కత్తిరికి. వంగకు స్వరంలో పోలికలు లేవు. బదనెతో కొంత పోలిక వుంది.

ఇక సంస్కృతంలో దీనికి చాల పేర్లున్నాయి. భంటాక, వార్తాక, వార్తాకు, హిందీర, వంగన, వార్దాక, భన్నాక, జుకుట, హింగోలీ. కొందరు వాతింగణ అనే మాటనూ చేర్చారు.

కిట్టెల్, వార్తాకి, భండాకి, హిలగలీ, సింహీ, దుష్టధర్షణీ, వార్తా, వంగ, వేర అనే పర్యాయా లిచ్చాడు.

సంస్కృత భవమైన ఉత్తరాది భాషలలో – హిందీ: బైగన్, బాంగన్, భంట్రా, బ్రింజాల్, బైంగన్, బదన్‌జన్. బెంగాలీ: బేగూన్, కూల్‌దేగూన్, బోంగ్, బార్తాకు; మహోతి, హింపోలి. అస్సామీ: బెంగానీ. ఉరియా: బైగున్. సరిహద్దు రాష్ట్రం: బ్రింజాల్, భటా. కుమాఊం: బైగున్, భుటా. కాశ్మీరీ: బాదన్‌జాన్, బస్తానీ. పంజాబీ:

బేంగన్. సింధీ: వాంగన్. మరాఠీ: వాంగీ, భైగనా, కాంగీ, వైంగ్, బేంగన్. గుజరాతీ: వేంగ్నీ, రింగ్నీ, వంతాక్, రిగనా.

మలయా: త్రోంగ్. బర్మీ: ఖాయాన్. సింహళి: వాంబటు అరబ్బీ: బదన్గన్. బెరంగెన్ బిన్జెన్, కహ్కం, కహ్కబ్. పర్షియన్: బాదన్ జాన్, బాదిన్గాన్, అరబ్బీలోని బదిన్గన్ - బెరంగెన్ యూరపు భాషల వంగవాచకాలకు ప్రాతిపదిక.

ఇంగ్లీషు బ్రింజాల్. పోర్చుగీస్: బ్రింజెల్లా, బ్రింజీలా, బెరింగెల్లా (ప్రాచీనరూపం). స్పానిష్: బెరికజేనా లాటిన్: మెలోంగేనా ఇటాలియన్: మెలంజానా, మెలైన్సానా (మేడ్ యాపిల్)

వీటన్నిటిలోను బరింజ, బంగ, వంగ అనే ధ్వని వినిపిస్తుండడం గమనిస్తే వీటన్నిటికి ఒక పదం మూలమయి వుంటుందని ఊహించడం అనుచితం కాదు. ఈ మూలపదం వాతింగణ అనేది అయివుంటుందని, వాతహరమని దీని అర్థమని వార్తాక, వార్తాక అనే పదాలన్నిటికీ ఈ అర్థమే వుందని కొందరు శాబ్దికు లంటున్నారు

వాతహరమనే అర్థం, దాని గుణ పరిశీలన తర్వాతనే గదా తెలిసేది కనుక ఈ వ్యుత్పత్తి తర్వాత కల్పించిందేగాని మొదటిదికాదు. మూలపదం ప్రాంతీయంగా ఏర్పడి, తర్వాత వ్యాప్తిలోకి వచ్చి వుంటుందనడం సహేతుకం.

ఇది ప్రాచీనార్యులకు తెలియదని, అరబ్బీనుంచి సంస్కృతంలోకి చేరిందని మరికొందరు అంటున్నారు. ఈ పక్షంలో తమిళంలోని కత్తరి, కత్తిరి పదాలకు అరబ్బీ కహ్కబ్, కహ్కంలకు కూడా సంబంధంవుందేమో పరిశీలించవలసి వుంది.

మలయా భాషలోని త్రోంగ్ పదానికి వంగవాచకాలైన ఇతర పదాలకు గల స్వరసామ్యాన్ని బట్టి యిది ఆగ్నేయాసియాదేశాల మొక్క అని, అక్కడినుంచి మనదేశానికి—వంగ ప్రాంతానికి వచ్చి, పూర్వ రూపాలతో పాటు తెనుగునాడులోను, భారతదేశ మంతటనూ వ్యాపించి వుంటుందని

పూహించవచ్చు. కనుకనే వంగ పదానికి సన్నిహితమైన పదమే దేశమంతటా వ్యవహారంలో వుంది. మొదటి యిది వంగకాయగానే వుండి వంగ + కాయ ఉచ్చారణ వేగంలో వంకాయ అయివుంటుంది. వంగకాయే ప్రాచీనరూపం (బసవపురాణం).

ఇంత మంచి వంగను నన్నయ రుచి చూచినట్లు కనిపించదు. పాలుకురికి సోమనాథుడు రుచిమాచి లింగకాయలుగా కూడ మార్చుకున్నాడు.

"కరములు సాగుచు గట్టుకొంగునను
భంగి నా బసవయ్య భావసంగతిని
వంగ కాయలు ప్రాణలింగంబు లయె"

(బసవ పురాణం, ద్వితీయాశ్వాసం)

అరబ్బీ బదిన్‌జన్‌కు, కన్నడ బదనెకు చాల పోలిక లేదూ? కన్నడ దేశం - పశ్చిమ సముద్రతీరం - నుంచి ఈ పదం అరబ్బీలో చేరి ఉండటానికి అవకాశమూ వుంది.

ఏమైనా ఈ వంగగాయ - వంకాయ 11వ శతాబ్ది ముందునుంచే తెలుగు, కన్నడ దేశాలలో అలవాటైన పదం అని అనవచ్చు.



౧౮

# కోమటి - గోమతి



మన దేశానికి విదేశీయులు ఎందరో వలస వచ్చినారు; మన మతాన్ని స్వీకరించి మనలో క్షీర నీర న్యాయంగా కలిసిపోయినారు. మౌర్య సామ్రాజ్య కాలంలో పాశ్చాత్య దేశాలతో భారతదేశానికి ఆదాన ప్రదానాలు హెచ్చిన తర్వాత గ్రీకువారు మనదేశానికి వచ్చి మంత్రాంగంలో, రాజ్యాంగంలో వివిధ ప్రధాన పదవులను నిర్వహిస్తూ, ప్రత్యేక శాఖగా ఏర్పడినారు; కాయస్థులనే పేరు పొందినారు. వారే నేటి సక్సేనాలు, అగర్వాలాలు, మాథుర్‌లు, శ్రీవాస్తవులు. (అగర్వాలాకు అగ్రోలాకు వున్న సంబంధం పరిశీలించవలసి వుంది.)

దేశ దేశాలమధ్య, ఖండ ఖండాలమధ్య వలసలు సాగుతున్నప్పుడు, ఒక దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య వలసలు అసంభావ్యం కాదుగదా!

ఆంధ్ర ప్రాంతానికి వివిధ ప్రాంతాలనుండి వలస సహస్రాబ్దాలుగా సాగుతూనే వుంది. చోళుల కాలంలో తమిళ ప్రాంతం నుంచి పెక్కు కులాలవారు వలస వచ్చి, నేడు తెలుగువారైనారు. బుందేల్‌ఖండ్ నుంచి వచ్చినవారు బొందిలీలుగా నేడు వున్నారు. మహారాష్ట్ర ప్రాంతం నుంచి వచ్చినవారు ఆరె ( ఆర్య ) మరాఠీలుగా నిలిచిపోయి వున్నారు. ( వీరు కన్నడదేశంలో ఆరేరు.) కాకతీయులకాలంలో తమిళనాడు నుంచి వచ్చిన వెళ్లాళులు వెలమవారైనారు. విదర్భ ప్రాంతం నుంచి వచ్చినవారు వెలినాడువారు, వెల్నాటి వారైనారు. ఇలా వలస వచ్చిన వారే కోమట్లు కూడా.

కోమటి అనే పదంతో వ్యవహరించబడే ఆర్యవైశ్యులు దక్షిణాపథమంతా వ్యాపించి వున్నారు. వీరు ఎక్కడికి వెళ్ళినా తమ ప్రాచీన సంస్కా

తితో పాటు తెలుగు మాతృభాషను కూడా (ఎన్ని అన్య దేశ్యాలు, ఏసలు చేరినా) దక్షించుకొంటూ వస్తున్నారు. స్వభాషాభిమానం, సంప్రదాయ రక్షణ జీర్ణించిన ఈ తెగవారు ఎక్కడినుంచి వచ్చారు?

తెలుగు నిఘంటువులలో చూస్తే, కోమటి శబ్దం కార్పటికః - అనే సంస్కృత శబ్దభవమని వుంటుంది. కాని, ధ్వనిసామ్యం కొంత కనిపించినా దీనికి యిది మూలం కాదనడం నిర్వివాదం.

కోమట్లు అనేది వీరి తొలి పేరు కాదు. వీరికి మత స్వీకారంవల్ల వచ్చిన పేరు. వీరు మొదట గౌడదేశంనుంచి దక్షిణాపథానికి వలస వచ్చిన వారు కనుకనే వీరికి గౌరలు అనే వ్యవహారం ఏర్పడిందని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసినారు. (ఆంధ్రుల సాంఘిక చరిత్ర-పుట. 84).

ఆంధ్రదేశంలో ఒకప్పుడు - శైవమతానికి ముందు - జైనమతం ప్రబలంగా వున్న సంగతి సాహిత్య చరిత్రల పరిచయం గలవారి కందరికీ విదితమే ఇప్పటికీ తెలంగాణాలో వున్న జైన దేవాలయాలు, బళ్ళారి, తాడిపత్రి, పెనుగొండలలోని జైన మందిరాలు దీనికి తార్కాణం గౌడదేశంనుంచి వచ్చిన ఈ బెహారులు ఆంధ్ర ప్రాంతంలో ప్రబలంగావున్న జైన మతాన్ని స్వీకరించారు. వీరు స్వీకరించింది గోమఠ సంప్రదాయం. గోమఠ మతానుయాయులు గనుకనే వీరు గోమఠులు, కొమ్మఠులు, కోమట్టులు, కోమటులు అయినారు. (ఈ దృష్టితో పరిశీలించగా పెదకోమటి వేమారెడ్డి పేరులోని కోమటి పదానికి గోమఠ శబ్దంతో సంబంధం వున్నదని శ్రీమతి కె. భ్రమరాంబగారు 'భారతి' 1955 ఏప్రియల్ సంచికలో వ్రాసినది చాల సమంజసం.)

తమిళ కన్నడ మలయాళాలలోను కోమటి పదం వ్యవహారంలో వుంది. తమిళ, మలయాళాలలో కోమట్టి అంటారు. గోమఠంలోని ఠ అనే మహాప్రాణోచ్చారణం ద్విత్వాల్పప్రాణంగా మారింది. కోమటి గోమఠ శబ్దభవ మనడానికి యిదొక నిదర్శనం.

ఈ జైన గోమఠ - కోమటులు తర్వాత తర్వాత - దేశంలో వైదికమతం వ్యాప్తమైన తర్వాత - ఇతరులతోపాటు వైదికమతం అనుస రించినారు వీరు జైనులు, గౌడ దేశీయులు గనుకనే - అహింసావ్రతులు గనుకనే - ఇతర బేరి, బలిజ, వణిజ, వన్నియ, పెరిక సెట్లవలె మాంసా హారులు కాలేదు. నేడుకూడ గౌడ, సారస్వతులలో గౌడులు నిరామిషా హారులు. ప్రాచీన తమిళ సాహిత్యంలోని వైశ్యులందరూ చాలవరకు జైనులే. శిలప్పధికారం, మణిమేఖలల కాలానికి జైన, వైదికసంప్రదాయాల సంఘర్ష ణేమీ లేదు. కనుక అప్పటి జైన వైశ్యులు వైదిక సంప్రదాయంతోను వివాహాది కార్యాలు జరుపుకునే వారట. తర్వాత మత విద్వేషం ప్రబలి వుంటుంది. నేటి నాటుకోట సెట్లందరూ నాటి జైనార్య వైశ్యులే.

అన్య ప్రాంతంనుంచి వలస వచ్చినవారు తమ సంస్కృతి రక్షణలో జాగ్రత్తపడడం సహజం. ఈ జాగ్రత్త, శ్రద్ధ లోభత్వంగా, పిడివాదంగా ఒక్కొక్కప్పుడు యితరుల ఈసడింపులకు కారణ మౌతుంది. కనుకనే కోమట్లను గూర్చి పెక్కు సామెతలు పుట్టాయి. వేములవాడ భీమనవంటి మహాకవి కూడా "కోమటి కొక్క టిచ్చి పదిగొన్నను, దోసము లేదు" అన్నాడు.

కన్నడంలోను కోమటి తెగపై ఎన్నో సామెత లున్నాయి.
ఇంతకూ ఏ తెగమీద సామెతలు, నానుడులు లేవు గనుక!



# చింత - పులుసు





మనం ఏటేటా కొత్త చింతకాయలు తింటున్నాం. ఉగాది పండుగనాడు వేపపూ పచ్చడిలో బెల్లం ముక్కలు, వడపిందె ముక్కలు, అల్లం, పచ్చిమిరపకాయ ముక్కలు, చింతపండు గొజ్జూ కలుపుకొని తింటున్నాం.

ఎలా వుంది చింతకాయ తింటుంటే ? నోరు చిమచిమ లాడుతూ నీరూరింది కదూ? పండ్లు తీపెక్క లేదూ? పెదిమెలు రెండూ అప్పళించి 'ప్చ్' అని చప్పరించామా ? లొట్టలు కూడా వేశామా!

ఉల్లిచేసే మేలు తల్లి చేయదని, తాడి తెలుగువారి కల్పవృక్షమని పొగిడేవారే. కాని, నిజానికి చింతచేసే మేలు అంతా యింతా కాదు. ఇది మన జీవితంలో భాగమైపోయి, అంతకుముందున్న తెనుగు మాటను తోసి రాజన్నది. దీని పుట్టుకను గురించి తెలుసుకుందాం.

చింతచెట్టు దక్షిణాపథంలో తరచు కనిపించే చెట్లలో ఒకటి. చల్లని నీడ నిస్తుంది గనుక దీనిని బాటల కిరు ప్రక్కలా నాటే ఆచారం అనాదిగా వుంది. చింతచెట్టును తమిళ మలయాళాలలో పుళి, పుళియమరం అని, కన్నడంలో పుణిసె. హుణిసె. హూణిసెమర అని అంటారు. ఈ పదాలు మన పులి, పులుసు (పుల్లచెట్టు) అనే పదాలకు సమాన రూపాలు. ఇతర ద్రావిడ భాషల్లో 'చింత' అనే పదం ఈ చెట్టును వ్యవహరించే అర్థంలో లేదు. ఒక్క తెలుగులోనే ఈ అర్థంలో మిగిలింది: పులుసు, పుల్ల, పులి అనేవి కేవలం అమ్లరస వాచకాలుగా స్థిరపడ్డాయి.

దీనికి కారణం సంస్కృత భాషా ప్రభావమే. సంస్కృతంలోని 'చించా' అనే పదాన్ని మనం సొం[illegible] చేసుకున్నాము. చకారం తకారంగా మారి చింత అయింది. చవర్గ[illegible]ంగా[illegible] సంస్కృతంలోను

చింత, పులుసు అనే పదాలు ఎలా రూపు దాల్చా యనుకున్నారు? సంస్కృతంలో చింతకు పర్యాయపదాల వ్యుత్పత్తిని పరిశీలిస్తే, పులుసు అన్న పదం వ్యుత్పత్తి పరిజ్ఞానం సులభమౌతుంది.

సంస్కృతంలో చించా శబ్దానికి అమ్లః, తింత్రిణీ, తింతిడీ, తింతిడ, తింతిడీక, తింతిడికా, తింతిలికా అనే పర్యాయా లున్నాయి. వీటికి వైయాకరణులు సరైన వ్యుత్పత్తి చెప్పలేక పృషోదరాదిగణంలో పారేసినా, కొద్దిగానైనా వుత్పత్తికి ప్రయత్నించారు. చిమ్‌చిమాయతే అమ్లత్వాన్ముఖం = చించా పుల్లగా వున్నందున నోట్లో చిమచిమ లాడేట్టు చేస్తుంది. తిమ్మతి అనేనేతి = తింతిడీ (తిమ ఆర్ద్రీ భావే), నోట్లో నీరూరజేస్తుంది. అంబతే ముఖ శబ్దహేతు ర్భవతి = అమ్లః (అబి శబ్దే). చవిగొనేటప్పుడు, చప్పరించే టప్పుడు, సీత్కార ధ్వని కలిగిస్తుంది—అని.

వాగ్భటాచార్యుడు అమ్ల రసానికి చెప్పిన లక్షణం కూడా మనం పరిశీలిద్దాం.

"అమ్లః క్షాళయతే ముఖం,
హర్షణో రోమదంతానాం,
అక్షి భ్రావ సంకోచనః"

పుల్లని పదార్థం తింటే నోట్లో నీరూరుతుంది. ఒళ్ళు గగుర్పొడుస్తుంది, పళ్ళు పులిసిపోతాయి. కళ్ళు చీకురించుకొని పోతాయి. కనుబొమలు ముడిపడుతాయి—అని పై లక్షణం తాత్పర్యం.

దీనినిబట్టి మన పూర్వులకు - మన పూర్వుల కేమిటి? అందరికీని - పుల్లని పండ్లు, కాయలు తిన్నప్పుడు మనకులాగే నోట్లో నీరూరి, పండ్లు తీపెక్కి, ముఖం, కండ్లు చిట్లించుకునిపోయి, పెదవులు రెండూ అప్పళించుకునిపోయి, ఆ వేగానికి అప్రయత్నంగానే మరల విడిపోయి "ప్చ్‌ళ్", "ప్చ్‌స్", "ప్ళ్" అనే ధ్వనులు పుట్టాయి. ఈ ధ్వనే క్రమంగా ద్రావిడ భాషలన్నిటిలోను అమ్ల రసానికి, చింతపండుకు కూడా హుళి, పుణిసె, హుణిసె, పులుసు, పుల్ల, పులి, పుళి అనే రూపాలు దాల్చి వుంటుంది. తెలుగులో మాత్రం ఎ[illegible] చింతపండు అనే అర్థాన్ని విడిచి కేవలం రసవాచక[illegible]ందో[illegible]ు. కాని సంస్కృతపదమైన

'చింత'ను ప్రాచీనులు ప్రయోగించారు "క్రొవ్వినగొఱియ దా జింత కట్టి మేయ జేరుటయ్యె" (సింహాసన ద్వాత్రింశిక 4-135.)

ఈ తింత్రిణి దక్షిణాపథంనుంచి ఉత్తరాపథానికి అక్కడనుంచి అరేబియాకు చేరి, అక్కడనుంచి పాశ్చాత్య దేశాలకు వ్యాపించింది.

అరబ్బీలో దీనికి తక్కిన పేర్లతోపాటు "తమర్-ఇ-హింద్" అనే పేరు కూడా వుంది. ఫార్సీలో అంబలా, తమర్-ఇ-హింద్ అంటారు. తమర్ అంటే ఖర్జూరం. అరబ్బులు దీనికి మొదట చూచినప్పుడు ఖర్జూరమని భ్రాంతి పడి "తమర్-ఇ-హింద్" — భారతదేశపు ఖర్జూరం అని పేరు పెట్టుకున్నారు. ఈ పేరునుబట్టే, చింతచెట్టు తాడిచెట్టు భేదమని, బహుశా అడవి తాటిచెట్టని మొదట్లో సెలాడినస్ మున్నగు పాశ్చాత్యులు భావించారని, తర్వాత 16 వ శతాబ్దిలో అడవి తాటిచెట్టు కాదని, మరొక చెట్టని తెలుసుకొన్నారని వృక్ష శాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు.

తమర్-ఇ-హింద్ క్రమంగా పాశ్చాత్య భాషలలో "ట్యామరిండ్" అని రూఢి చెందింది.

పులి చింత అనే మరొక పదం ఉంది. ఇది ఒక ఆకు కూర పేరు. పుల్లని చింతాకువంటి కూర అని అర్థం.

మనకు 'చింత చచ్చినా పులుపు చావలేదు' అనే సామెత వుంది. భాషా విషయంలో మాత్రం చింత పులుసును చంపివేయడానికి ప్రయత్నించింది. కాని, చింతా చావలేదు; పులుసూ చావలేదు.



104

# తెఱవు - తెఱవ



కొన్ని పదాలు మనలోని తెగల పుట్టు పూర్వోత్తరాలను పట్టి యిస్తే మరికొన్ని మన ప్రాచీనాచారాల ఆనుపానులను పలుకుతాయి. ఆ ఆచారాలు అనాచారాలుగా, దురాచారాలుగా పరిణమించి, సంఘం విజ్ఞానవంత మైనకొద్దీ అంతరించినా, ఆ పదాలు మాత్రం శాశ్వతంగా సాహిత్యంలో - ఒకొకప్పుడు తమ విశేషార్థాలను కోల్పోయి, సామాన్యార్థాలలో - నిలిచి పోతాయి. అలాంటి పదాలలో ఒకటి తెఱవ.

తెఱవ - అనగానే ఏ కొంచెం సాహిత్య పరిచయం గలవారైనా ఇది స్త్రీ పర్యాయ వాచకమని చెప్పగలరు. మరికొంత వ్యుత్పన్నులు తెర + వాయి = తెఱచిన నోరు గలది. అంటే రహస్యం దాచనేరనిది అని అర్థం చెప్పి నిఘంటువులను మనముందు పడవేయడానికి జంకరు. స్త్రీ పర్యాయ వాచకంగా దీనిని నన్నయ ప్రయోగించాడని-

"ఉఱవగు నాఱుగ పంటయు
గొఱియల పాడియును దఱచగుం బురుషులకుం
దెఱవల చుట్టము లయ్యెద రు.........."

అని పద్యంకూడా ఎత్తి చూపగలరు. (అరణ్య - 4 - 295).

కాని తెఱవ శబ్దానికి తెఱచిన నోరు గలదనే అర్థమేనా? స్త్రీ సామాన్యార్థమేనా? మరొకటి వుందా? చూద్దాం

ఓలి — కన్యాశుల్కం — ఇచ్చి పిల్లను తెచ్చుకొనడం తెనుగు జాతికి తరతరాల ఆచారం - దురాచారమే లేండి. కనుకనే ఓలిపై ఎన్నో సామెతలున్నాయి "ఓలే! అని పిలిస్తే, ఓలి ఎంత యిచ్చావు? అన్నదట." "ఓలి తక్కువైతే గుడ్డి ముండ వస్తుంది" - లాంటివి. తెఱ, తెఱవు అనే

మాటలు ఓలికి పర్యాయాలు. ఒకప్పుడు ఇవి బహుళ ప్రచారంలో వుండి విశిష్టార్థ మిచ్చేవి; నేడు మాండలికాలుగా మిగిలాయి; తెలవ స్త్రీ సామాన్య వాచకంగా సాహిత్యం చేరింది. ఇది ఎలాగు? - అని సందేహం కలిగితే తెనుగు తోబుట్టువులే శరణ్యం.

తమిళంలో తెలవ పదాన్ని పోలిన తెరివై అనే పదం వుంది. కాని, దీని అర్థం 26-36 సంవత్సరాల మధ్య వయస్సుగల స్త్రీ. ప్రౌఢస్త్రీ. స్త్రీ సామాన్యవాచకం కూడా. కాని, ఈ అర్థం మన ఓలి కథను తెలుపదు.

కన్నడంలో తెఱ, తెఱవు అనే మాట లున్నాయి. వీటి అర్థం అచ్చంగా తెనుగు ఓలే. "అప్పంత హుడిగి ఆగబేకు. ఇప్పణ అర్ధ తెఱ ఆగబేకు" లాంటి నానుడులు కన్నడంలో ఎన్నో వున్నాయి. మైసూరు రాష్ట్రమంతటాను ఈ పదాలు నేటికీ వ్యవహారంలో వున్నాయి.

ఈ తెఱ - తెఱవుతో సంపాదించిన స్త్రీయే తెఱవ. అంటే ఓలి యిచ్చి పెళ్ళాడినదన్నమాట - తెఱవు + అ = తెఱవ తెఱచుకున్న నోరు గలదనే వికారార్థం చెప్పి, ఒక యిల్లాలిని వాగుడుకాయను చేయడంకన్న ఈ అర్థం బాగులేదూ!

ఒళ్లారిజిల్లా ఆంధ్ర ప్రాంతంలో కింది తెగల స్త్రీలు మారు మనువు చేసుకొనేప్పుడు కులస్థులకు తెఱవు చెల్లించడం - దండుగ చెల్లించడం - ఆచారంలో వుంది. కనుక ఈ తెఱవు-ఓలి-పురుషుడు స్త్రీకి చెల్లించేదిగాను, తర్వాత స్త్రీ మొదటి భర్తను కోల్పోయి మారుమనువు చేసుకొనడానికి కుల స్థులకు తప్పు దండుగ-చెల్లించడానికి కూడ వ్యవహరించబడి వుంటుంది.

కాలక్రమాన ఈ మాట మరుగై మాండలికమైంది; ఓలి అన్న పదం మాత్రం బహుళ ప్రచారం పొందింది; తెఱవ సాహిత్య గౌరవం పొంది స్త్రీ సామాన్యవాచకంగా మిగిలింది.

ఏతావతా తెఱవ అనే పదానికి మనం ఓలిచ్చి పెళ్ళాడిన స్త్రీ అని గాని, దండుగ చెల్లించి మారు మనువు చేసుకున్న స్త్రీ అని గాని అర్థం చెప్పుకోవడం సబబు.

# సెట్టి సింగారం

106



"ఏమోయ్! ఎంత సేపటికీ కదలవు; సెట్టి సింగారించే వేళకు పట్టం పాడయింది - అన్నట్టుగా వుందే నీ వాలకం!" అని విసుక్కుంటాము; ఎక్కడైనా వెళ్ళడానికి తయారయినప్పుడు తటపటాయిస్తూ, సర్దుకుంటూ జాప్యం చేసే "బురద గొడ్లను" చూచి.

నిజానికి సెట్లు, సెట్లేమిటి బేరసారాలు చేసే ప్రతివారూ ఎంతో చురుకుగా వుంటారు గదా! ఈ సామెత ఎలా వచ్చిందో? ఈ సామెతలోని సెట్టి సింగారానికి, పట్నం పాడుకావడానికి సంబంధం ఏమిటి? ఏదైనా ఐతిహ్యం వుందా? సామెతలో "సెట్టికి" మారుగా మరొకరు వుండాలేమో?

ఈ సామెతకు ప్రాంతీయ పాఠాంతరాలూ కూడా వున్నాయి. తెలంగాణాలో "సెట్టి సింగారించే వేళకు పట్నంలో గుండుపడె" అని అంటారు. "సెట్టి సింగారించే వేళకు పట్నం కొల్లబోయింది" అని దక్షిణాంధ్ర వ్యవహారంలో వుంది.

కన్నడ, తమిళాలలోను అచ్చంగా యిలాటి సామెతలే వున్నాయి. "సెట్టి సింగారిసో వేళెగె పట్ట సూరె హోదాగె" అని కన్నడు లంటారు. "సెట్టి సింగారిక్కిరదుకుళ్ళె పట్నం పాళాచి" అని తమిళు లంటారు. వీటికి ఈ అర్థాలు ఎలా వచ్చాయో స్పష్టంగా తెలీదు.

సెట్టి వూరికంతా ప్రాణంవంటివాడుకదా పూర్వపురోజుల్లో! ఆయన వల్లనే వాణిజ్య, వ్యాపారాలు కొనసాగేవి. సెట్టి ఎక్కడుంటే అక్కడే పట్నం అవుతుంది కదా మరి? అందుకనే "ఏనుగు మెట్టిందే సందు, సెట్టి విడిసిందే పట్నం" అనే సామెత ఏర్పడింది. ఇలాటిది కన్నడంలోనూ

వుంది "అనే మెట్టద్దె సందు, సెట్టి బిట్టల్లే పట్న" అని. సెట్టి పట్నాని కొక అలంకారం, కనుకనే "పేటకు జెట్టి పట్నానికి సెట్టి" అనే నానుడి ఏర్పడింది కొన్ని ప్రాంతాల్లో. "పేటెకె జెట్టి, పట్నక్కె సెట్టి" అని కన్న డులూ వాడుతారు. అలాంటప్పుడు, సెట్టి సింగారించే వేళకు పట్నం పాడు కావడమేమిటి? విడ్డూరంగా లేదూ?

కనుకనే, ఈ సామెతలో 'సెట్టి' అనడానికి మారు మరొకపదం వ్యవహారంలో ఉండి వుంటుంది. అది బహుశా "జెట్టి" అయివుంటుంది. జెట్టికి, సెట్టికి జీవితంలో ఏమీ పోలిక లేకపోయినా, వుచ్చారణలో గల పోలికను బట్టి సామెత కూడా "సెట్టి" అనే మాటతోనే వాడుకలోకి వచ్చివుంటుంది.

సెట్టికి మారు జెట్టి ఎందుకుండాలో కొంచెం వివరించవలసి వుంది. పూర్వం ప్రతి రాజాస్థానంలోను జెట్టీ లుండేవారు. రాజవంశీయులకు, ఇతరు లకు కుస్తీలు నేర్పడం, పోటీకి వచ్చిన మల్లులను డుల్లగొట్టి సంస్థానానికి పేరు తేవడం, శత్రువులు దాడిచేసినప్పుడు వారిని ఎదిరించి తన స్వామి ఋణం తీర్చుకోవడం వారి పని. ఇలాంటివారిని యిప్పటికి కూడా కొందరు మాజీ సంస్థానాధీశులు పోషిస్తున్నారు

ఇలాటి జెట్టి ఒకడు తనను పోషించిన రాజు రాజధానిపై శత్రువులు ముట్టడి జరిపినప్పుడు వారిని ఎదుర్కొనడానికి సన్నాహం చేయడంలో జాగుచేసి వుంటాడు. (నిజానికి మన ఆయుధాలు - కత్తి కఠారి, డాలు, బల్లెం, తలకు ఉక్కు కమ్ముల కుళ్ళాయి మున్నగునవి - ధరించడానికి ఆలస్యం కావడంలో ఆశ్చర్యం లేదు. వీటి నన్నిటిని సరిగా అమర్చుకొన డానికి కనీసం ఒక్క గంటైనా అవసరమన్న సంగతి నేటికీ ఆ మధ్య యుగాల యోధ వేషాలతో పంజాబ్‌లో తిరిగే "న్యహంగ్" సిఖ్ఖులను చూచినవారికి తెలియకపోదు.) ఈ జెట్టి పుంగవుడు తన ఆయుధాలు సర్దు కుంటూ ముస్తాబవుతుండగానే - ఎదిరించడం అలా వుండగా - పట్టణంలో

గుండు పడిపోతుంది; పట్టం కొల్లబోయి వుంటుంది; పట్టం పాడయి వుంటుంది. ఈ మల్లా గ్రేగరుని చురుకుతనం క్రమంగా తర్వాత వాడ వాడకు పాకి, నానుడిగా జనం నాలుకపై నిలిచి వుంటుంది.

కనుక, ఈ సామెతతో సెట్టి కెంతమాత్రమూ ప్రసక్తే లేదు. "జెట్టి సింగారించే వేళకు పట్టం పాడయింది" అనడమే సహేతుకం.

సెట్టి అనడానికి మారు జెట్టి అని వుండడమే సముచితమని సుప్రసిద్ధ సాంఘిక శాస్త్రవేత్తలు, సహృదయులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు నేను వారితో ఈ విషయం చర్చించినప్పుడు అంగీకరించారు.

ఈ సామెతలోని 'పట్టం' అన్నపదం విషయంకూడ అనుమానాస్పదమే. ఇది పట్టం కాదనుకుంటాను. మన సామెతలలో యతి ప్రాస లుండటంబట్టి "జెట్టి సింగారించే వేళకు పట్టం పాడయింది'' అని వుంటుందేమో! అప్పుడు జెట్టి సింగారించే వేళకు పట్టం-సింహాసనం - పాడయిందనడం సమంజసంగా వుంటుంది. పాడయింది పట్టమేకాని - రాజ్యమేకాని- పట్టం కాదు.



# ఊరుదువత్తి - అగరువత్తి



ఊదువత్తి మన పూజా ద్రవ్యాలలో ముఖ్యమైంది. "ధూప మాఘ్రాపయామి" అని తంతు చెబుతూ, ధూపం వేసి వాసన చూపడానికి మారు ఊదువత్తి ముట్టించి తిప్పడం పరిపాటి అయింది. మన సంస్కృతిలో యింతగా చొచ్చుకొన్న ఈ ఊదువత్తి అనే మాట మనదేనా? పరాయిదా? అగరుకు దీనితో సంబంధం వుందా?

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో

"అతి సుగంధంబు దశాంగ మానంద
వతి సురభియును నావర్తిధూపంబు
మలయానిలంబును మహిసాక్షి మద్ది
కలహంసధూపంబు కామికామోద
మును మనోహరధూపమును దివ్యధూప
మును జనవల్లభామోద ధూపంబు
లాదిగా ధూపంబు లానందవర్తి
యాఁ వత్తులును..................."

అని పెక్కు ధూపాలు చెప్పినాడు. కాని ఊదువత్తిని చేర్చలేదు. (పర్వత ప్రకరణం : పు 427)

మన నిఘంటుకారులు మాత్రం ఈ పదం పుట్టుపూర్వోత్తరాలు రకరకాలుగా చెప్పారు. శబ్ద రత్నాకరకారులు దీనిని ఊఁదువత్తి అని అరసున్నతో గ్రహించి ద్వయం - వైకృతం, దేశ్యం కలిసిన - పదమన్నారు. అంటే ఊఁదు అనేది దేశ్యం, వత్తి సంస్కృత భవమైన వైకృతం అని వీరి అభిప్రాయం. బ్రౌను పండితుడు మిశ్ర భాషా నిఘంటువులో ఊదు

అని అరసున్న లేకనే గ్రహించి, ఫార్సీ లిపిలో ఈ పదమే యిచ్చి, సాంబ్రాణి, ఊదువత్తి, ఊదువర్తి, సాంబ్రాణివత్తి అనే అర్థా లిచ్చారు. కాని తక్కిన తెనుగు నిఘంటుకారులు శబ్దరత్నాకరకారులనే అనుసరించారు. మనకు కావలసింది నిజమే గనుక వీటిలో ఏ వాదం నిజమో, ఏది కాదో పరిశీలించాలి. ఈ పరిశీలనకోసం మనం భూమండలాన్ని అప్రదక్షిణంగా చుట్టి రావలసి వుంటుంది.

అగరు సిసలైన స్వదేశీ చెట్టు. దీనికి సంస్కృతంలో అగురు, వంశకం, వంశికం, రాజార్హం, లోహం, క్రిమిజం, జోంగకం అనే పర్యాయాలున్నాయి. నల్లటి అగరును కాలాగురు, అగురుః అని, మల్లెపూల వాసనగల అగరును మంగల్యమని అమరకారుడు పేర్కొన్నాడు.

హిందీలోను, ఇతర ఔత్తరాహ భాష లన్నిటిలోను దీనికి అగర్ అని వ్యవహారం. అగరే హింద్, ఊద్, అఉద్, అఉదే హింద్, ఊదే హింద్-అరబ్బీ. అక్యాఉ, అక్యావ్ - బర్మీ. అగ్రేహింద్, అగర్ - పారసీ. న్యామ్‌చా-చీనీ. (ఇది జోంగకం అనే భేదమేమో?) కాయు, గారు-మలయా. తమిళంలో దీనిని అగర్, అగ్గలిచందనం అంటారు. కన్నడంలో అగరు, అగళె, అగిల్, అగిలు, అగురు, అగరు-అని పెక్కుపర్యాయా లున్నాయి.

ఇది మన దేశంలోని సిల్హాట్‌లోను, బర్మాలోని టెన్నాసిరం రాష్ట్రంలోను అడవుల లాగను, మలయాలోను, మలయా ద్వీప సమామ్నాయంలో ఎక్కువగాను పెరుగుతుందని వృక్ష శాస్త్రజ్ఞు లంటున్నారు. మొత్తం మీద యిది సిల్హాట్, మణిపూర్, చిట్టగాంగ్, అరకాన్‌ల నుంచి మెర్గుయి, సుమత్రాలవరకు కనిపిస్తున్నదని, భారతదేశం నుంచి చీనాకు, అక్కడి నుండి కొచ్చిన్ చీనాకు వ్యాపించి, అటనుంచి యూరోప్‌కు పాకిందని వృక్ష శాస్త్రజ్ఞుల వాదం.

అక్యాఉ అనే జాతి అగురుచెట్టు మెర్గుయి ద్వీప సమూహంలో ప్రధానమైంది. అక్యాఉ అరుగు శబ్ద వికృతమే. అగరు యాదులకు ఎంతో కాలంనుంచి తెలుసునట. దీనిని వీరు అహలోట్ అన్నారు గ్రీకువారు, రోమనులు అగల్లోచం అన్నారు. అలోచావుడ్, కలంబక్, అగిల, అక్యావ్-

అనే మాటలు కూడ దీనికి పర్యాయాలయాయి. అరబ్బులు అగల్లోచంను అఘలూఖా అని మరింత భ్రష్టం చేశారు. కాని ఈ మాటకు మారుగా-బహుశా ఉచ్చారణ సౌలభ్యమే కావచ్చు - ఊద్, అఉద్ అనే మాటలను అరబ్బులు వాడుక చేశారు. ఊద్ అంటే కఱ్ఱ - చెట్టు, ఉద్-ఇ-హింద్= భారతదేశం కఱ్ఱ. భారతదేశం చెట్టు - అగరుచెట్టుకు రూఢమైంది.

ఈ ఉద్ చెట్టు స్థల భేదంతో, వర్ణభేదంతో ఎన్నో రకాలు. హిందీ= నల్లనిది = కృష్ణాగురు అన్నమాట సమందూరీ = ఎక్కువ నూనె గలది. కామరీ = పాలిపోయిన రంగు గలది. సముాదాలీ = చాల వాసన గలది. సమందూర్, కామర్ అనే స్థలాలలో పుట్టిన దానినిబట్టి ఈ పేర్లు వచ్చాయట.

కనుక ఊద్ అనేది కాష్ఠ సామాన్య వాచకమని, కాని యిది అగురు చెట్టుకు అరబ్బులు రూఢి చేశారని తెలుసుకున్న పిదప ఊద్, అగరు పర్యాయాలని తేలింది. ఇక ఊద్ అనేది మనదేశానికి ముస్లింలతో దిగుమతి అయిందనడంలో ఆశ్చర్య మేముంది? కాని వత్తులుగా చేయడం వారినుంచి మనం నేర్వ నక్కరలేదు. సుగంధ ద్రవ్యాలను మెదిపి వత్తులుగాను, బలపాలుగాను పుల్లలకు అతికించి చేసే అలవాటు, పరిశ్రమ అనాదిగా మనకు తెలుసు. కనుకనే వీటికి ఊదుకడ్డు అనే అలవాటు కూడా వుంది. ప్రాచీన వైద్యక గ్రంథాలలో దీనికి కావలసిన తతంగం వుంది.

అలా అయితే ఊదు శబ్దం అరబ్బీనుంచి దిగుమతి అయిందనడం కన్నా, సుగంధ ద్రవ్యాలను ఊదడం - లేపనం చేయడం - అనే అర్థం చెప్పుకోవచ్చు గదా? - అనవచ్చు. కాని, తెలుగు సాహిత్యంలో ఊదువత్తికి ప్రాచీన ప్రయోగం దొరకకపోవడం, కన్నడ నిఘంటుకారులు-ముఖ్యంగా కిట్టెల్, తమిళ కోశకారులు దీనిని అన్యదేశ పదంగా స్వీకరించడం యిది పరాయి పదమేనని నమ్మకం కలిగిస్తున్నది; పైన పేర్కొన్న వృక్ష శాస్త్రజ్ఞుల వర్ణన సంగత మనిపిస్తున్నది.

తొమ్మిదవ శతాబ్దినాటి హరమేఖల అనే ప్రాకృత వైద్య గ్రంథంలో ధూపవర్తులు, ఊదుకడ్డు చేసే పెక్కు యోగాలున్నాయి.

# గొబ్బి - కుమ్మి

114



సంక్రాంతి పండుగ మున్నాళ్ళూ, తర్వాత కూడా ఆడపిల్లలు ముచ్చటగా గొబ్బిళ్ళు తట్టడం, గొబ్బి నిదురని, జంట గొబ్బులని పాటలు పాడడం మూడోరోజు గొబ్బిని వాలలాడించడం (గొబ్బెమ్మను నీళ్ళలో కలపడం) వింటున్నాము చూస్తున్నాము. ఈ గొబ్బి ఏమై వుంటుంది? నాట్యంగా ఎలా మారి వుంటుంది?

గొబ్బి అనే మాట 'గోపి' అనే దానినుంచి వచ్చిందని కొందరు, 'గర్భ' నుంచి వచ్చిందని మరికొందరు వాదించుకున్నారు. గర్భకంటే గోపి అనేదే గొబ్బికి దగ్గరగా వుండడం సమంజసమని తోస్తుంది. సంక్రాంతి పండుగలో మూడో రోజు పశువుల పండుగ. తమతో ఎడతెగని శ్రమచేసి, తమకు పంటలు పండించిన ఎడ్లను కనుమపండుగనాడు పూజించడం, మృష్టాన్నాలు తినిపించడం మనవారి ఆచారం. అలాగే పంటలకు ఎరువు, ఎడ్లు యిచ్చిన గోమాతకు చిహ్నంగా గొబ్బెమ్మలను (పేడ వుండలను) చేసి పూజించడం, వాటిని మూడోరోజు ఆడబిడ్డలను అత్తవారింటికి పంపేట్టు పాటలతో వాలలాడించడం చూడగా, ఇవన్నీ ఒకప్పుడు మనం సమష్టిగా ఉత్పత్తి చేసుకున్న వస్తువుల సాధనాలను గౌరవించుకొనడమే నని తోస్తుంది

ఈ గొబ్బిని గురించి కొన్ని ప్రాంతాలలో ఒక ఐతిహ్యం వుంది. "కాటమరాజనే గొల్లరేడు తన చెల్లెలయిన గొబ్బిని పిల్చుకుని వచ్చి, పసుపు కుంకుమలతోటి కొత్త బట్టల నిచ్చి గోపూజచేసి, పసుల పండుగ నాడు కనుము వేయించి అత్తగారింటికి పంపుతూ వుండేవాడట."

దీనినిబట్టి గొబ్బి గోమాతకు, అలకాపరులైన ఆడపిల్లలకు చిహ్న ప్రాయమని నిర్ణయించుకోవచ్చు. నిజానికి మన పండుగలన్నీ చాలవరకు పంటల పండుగలే. సమష్టి ఉత్పాదన చర్యల చిహ్నాలే. ఆర్యుల యజ్ఞ యాగాదులే సమష్టి ఉత్పాదన చర్యల చిహ్నమన్నాడు డాంగే పండితుడు.

ఈ గొబ్బి, కుమ్మి నాట్యాలు సమష్టిగా కుప్ప నూర్పిడిని, సమష్టిగా వడ్లదంపును తెలిపే ప్రాచీన సంప్రదాయావశేషాలే. పండించిన ధాన్యం కుప్పపోసి, పండించిన కూరగాయలలో పెద్దదైన గుమ్మడిపండును వెర్రి సంతోషంతో కుప్పకు దిగదుడవడం, దానిని పూలతో అలంకరించడం, ఆ పూలనే పేడకుప్పలలో చెక్కి సంతోషంతో గంతులు వేయడం అప్పటి ఆచారం. ధనుర్మాసానికీ, వైష్ణవ మతానికీ సంబంధం ఏర్పడిన తర్వాత ఈ గొబ్బిగంతులు క్రమంగా వైష్ణవ మతం ప్రాబల్యంతో గోపికల నృత్యంగా భావించబడింది.

తమిళనాడులో 'గోపీయళో' అని గొబ్బిపట్టే పిల్లలు పాడడం, అండాళ్ తన 'తిరుప్పావు'లో కృష్ణుని గోపికలు కీర్తించినట్లు వర్ణించడం యిది గోపికా నృత్యంగా భావించడానికి కారణాలు.

ఈ రెండు పదాలూ ధ్వన్యనుకరణ వాచకాలే. మనం ఏ పనినైనా కాయకష్టంతో చేయవలసివచ్చినప్పుడు అప్రయత్నంగా నోటినుంచి మూల్గు వెలువడుతుంది. పదిమంది కలసి దేనినైనా లాగేటప్పుడో, ఒకచోట చేర్చే టప్పుడో, ఒత్తిడివల్ల, ఒత్తి పలకడంవల్ల ఏర్పడిన "ఉఁహ్" ధ్వని క్రమంగా పెక్కు పదాలకు తల్లి అయింది. స్థానప్రయత్నాలనుబట్టి ఈ ఉఁహ్, ఊఁహ్, ఉం, కూఁ కూం అనే ధ్వని విశేషాలు కుమై అని అయి, ముందుకు తోయు అని తమిళంలోను; కుమ్ము, (రోకళ్ళతో) దంచు అని కన్నడ, తెలుగులలోను అర్థాలు పొందింది. ఇలా కుమ్మి, ఒక తట్టు చేర్చిన వస్తువులు కుమి, గుమి, గుంపు అయింది. కుమ్మడంలో కలిగిన హస్త క్షేపాదికం కుమ్మి, గుమ్మి అయి నాట్యంగా పేరందింది. తుళులో గొబ్బు నాట్యవిశేషం, ఆట. కుమ్మి గుంపు, గొప్పు, గొబ్బులుగా మారి గొబ్బి అయిందేమో!

# మగువు - మగువ

114



మగువ అంటే స్త్రీ అని అందరికీ తెలుసు. తెలియనివారు ఏ తెనుగు నిఘంటువును తిరగవేసినా సులభంగా తెలుసుకోవచ్చును. ఈ పదం ఈ అర్థంలో నిలిచిపోవడంలో ఒక్క తమాషా వుంది.

కొందరు ఈ శబ్దాన్ని మగు + వ అని విడదీసి రభస చేస్తారు. మగ అని కన్నడంలోను, మహక్ అని ఉత్తరాది భాషలలోను సుగంధార్థక పదా లున్నవి గనుక మగువకు సువాసనగల నోరు గలది అని అర్థం లాగ డానికి ప్రయత్నిస్తారు. పురుషార్థకమైన మగ శబ్దం మగువలో తొంగి చూస్తున్నది గనుక మగవాని వంటి గట్టి వాయి గలది; మగ పోలిక కలది అని మరికొందరు వికారార్థాలు చెప్పబూనుతారు. కాని ఈ మగువ ఒక్క తమాషాగా రూపొందిందని మొదలే అన్నాను.

కన్నడ తమిళ భాషలలో మగ, మగు శబ్దాలున్నాయి. కాని తెనుగులో వున్న మగ శబ్దానికి, కన్నడ, తమిళాల మగ శబ్దానికి అర్థంలో పెద్ద అంతరం వుంది.

తెనుగులో మగ శబ్దానికి పురుషుడు, భర్త అనే అర్థాలున్నాయి కదా! తమిళ కన్నడాలలో మగ అంటే కుమారుడు; భర్త కాడు. ఈ పదమే మగువ అని రూపొందింది క్రమంగా. తెనుగులో ఒక అర్థంలోను, దాని సజాతీయమైన వాటిలో తద్విపరీతార్థాలలోను ఒకే పదం కనిపించడం వింత కాదూ? అదే సంఘం, భాష పెరుగుతున్నదానికి లక్షణం.

కన్నడంలో మగ అంటే కుమారుడు అని మొదటే అన్నాను. మగు శిశువు. ఇక్కడ స్త్రీ, పుం వివక్ష లేదు; ఏ శిశువైనా కావచ్చు. మగవు, మగువు, మొక, మొగ, మొగు, మొగువు, మొగె మగు శబ్దం పర్యాయాలు.

వీటన్నింటి బహువచనం మక్కళ్. కొన్ని ప్రాంతాలలో - ముఖ్యంగా మైసూరు వ్యవహారంలో - మొక్కొళ్ళు; మర్కళ్ అనే రూపాలు కూడా వున్నవి.

ఈ రూపా లన్నిటినీ పరిశీలించగా, మక - మగ - మర్‌లలో ఒకటి పురుష సామాన్యార్థకమైన మూల పదమని తోస్తుంది. చిన్నతనం, లేతదనం తెలపడానికి అన్ని భాషలలోను ఇకార, ఉకారాంత ప్రత్యయాలు వాడడం కనిపిస్తుంది. దానికి కారణం దీర్ఘ స్వరాలు పెద్దవిగా తోచడం, హ్రస్వ స్వరాలు చిన్నవిగా తోచడం అయి వుంటుంది.

కనుక మగకు ఉకారం చేరగా మగు అయి, చిన్నది, శిశువు అనే అర్థం నిలిచింది. అప్పుడు లింగ విశేషమేమీ లేదు; చిన్నది - అంతే. తెనుగు, కన్నడాలకు సహజమైన ఉకారాంత ప్రత్యయం మరొకటి చేరి మగువు అనే మరొక రూప మయింది. దీనికి కూడా చిన్నది, లేత వయసుపిల్ల అని అర్థం. కాని మగులాగ కేవలం శిశువు కాదు. మగువు సారూప్యంతో మగవు అనే మరొక రూపం అయింది. అకారం, గొంతుకో పలికేది; సంవృతం - అంటే అంతగా నోరు తెరవనక్కరలేదు. కనుకనే మగ మొగ అయింది ఈ మొగ మగు మగువల సాదృశ్యంతో మొగు, మొగువు అన్న రూపాలు పొందింది. అకారం సంవృతం కనుకనే సింధీ, బెంగాలీ, ఉరియా వారు అకారం ఒకారంగా పలికే వరకు ఈ సంవృతత్వం దిగజారింది. అరవింద ఒరొబిందొ అవుతాడు. అకారానికీ ఏకారానికి స్థానంలో సామ్యం వుంది కనుక అకారం ఎకారమై 'మెగె' అనే రూపం ఏర్పడింది. తెనుగు మగువ పద నిష్పత్తికి సాధకం కనుకనే కన్నడ పదాల వివరణ యింతగా అవసరమైంది.

ఇక మగ శబ్దార్థం మనకు, తమిళ కన్నడాలకు భేదించడం తెలుసుకుందాము మగ శబ్దానికి తమిళ కన్నడాలలో 'అన్' అనే ప్రత్యయం చేరి మగన్ అని, తెలుగులో మగడు అని అయింది. 'అళ్' అనే స్త్రీ ప్రత్యయం చేరి మగళ్ అని అయింది. మగన్ పుత్రుడు. మగళ్ పుత్రిక. పుత్రుడు పురుషుడే కదా! ఇంటిలోని పురుష సంతానం అన్నమాట. కొన్ని కులాలలో

నేటికీ బంధుత్వాలు తెలిపేటప్పుడు వ్యక్తిపరంగా కాక, సమష్టిగా ఇంటిల్లి పాదికీ సంబంధించినట్టుగా తెలుపడం కద్దు - మా యింటి కొడుకు, మా యింటి అల్లుడు, మా యింటి కోడలు (నా కొడుకు, నా అల్లుడు, నా కోడలు అనడానికి బదులుగా). అంటే, యింటిలోని మగ శిశువు, మగవాడు అన్న మాట, మగడు అంటే. ఇది - అవిభక్త కుటుంబం విభక్తం కాగానే, ఆ యింటి కొడుకే, ఆ యింటి మగవాడే తన యింటికి యజమాని కావడంతో- భర్త అనే అర్థం పొందింది. క్రమంగా 'ముందు వచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములు వాడి' అన్న సామెతగా మగకు గల శిశ్వర్థం, పురుష సామాన్యార్థం పోయి, పురుష విశేషార్థమైన భర్త అనే అర్థం తెలుగులో మిగిలింది; పుత్రికార్థకమైన మగళ్ అసలే జారిపోయింది.

ఈ మగడు కాస్త భర్తకాగానే మెడ బలసింది కాబోలు మొగుడయ్యాడు. 'మొగుణ్ణి కొట్టి మొగసాల ఎక్కినట్లు' అనే సామెత ఉండనే వుంది. అకారం ఒకారంగా మారిందన్నమాట. అంటే, మొదట శిశుసామాన్యార్థకంగా వున్న మగ - మగు శబ్దం రకరకాలుగా మారినట్టే మగువు అయి, తెనుగులో చేరిన తర్వాత అక్కడ తెరవ, చిలువ, పలువ మున్నగు వాంత శబ్దాల సాదృశ్యంతో మగువ అని మారిందని ఊహించవచ్చు. మగువ అంటే (తమిళ, కన్నడాలనుబట్టి) బాలికలు, బాలిక అని అర్థం చెప్పుకొనడం వుచితం.

అయినప్పుడు "మగువ పొలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్" అనే పెద్దనగారి పద్యంలోని మగువను తలుచుకున్నప్పుడు ఎవరి మనస్సైనా చివుక్కుమంటుంది.



# నేయి-
# తుప్ప

117



దేశం మొత్తంమీద పంజాబీల తర్వాత నేయి ఎక్కువగా వాడేవారం మనమే వాడేవారం అనడంకన్నా తాగేవారం అంటే బాగుంటుందేమో! "అబ్బే! ఏమిటండీ మీ భోజనం? ఝూరీ చెంబులతో నేయి అంతగా కుమ్మరిస్తే, భోజనమంటేనే మొగం మొత్తదూ? ఈ నేయి చాదస్తం ఉత్తరాదిని ఒక్క పంజాబీలకే మితిమీరి వుంది" అనేవారు బిహారీ పండితులు శ్రీ అవధానందన్ నాతో. నూనె వాడకంలో మాత్రం మనను చాలామంది మించిపోయారు. బెంగాలీలు, బిహారీలు ప్రతిదానికీ ఆవనూనె వాడుతారు. పోపుకు కూడా ఆవనూనె అంటే ఎలా వుంటుంది మీకు? పంజాబీలు కూడా నేయి ఎంతగా వాడుతారో అంత విపరీతంగా ఆవనూనె వాడుతారు.

మన మింత ధారాళంగా వాడే నేయి, నూనె (పదాలు మాత్రమే లెండి) మనవి కావంటే కొంచెం కష్టంగానే వుంటుంది.

పాడిలేని ప్రాంతమంటూ వుండదు. పాడి వున్నప్పుడు వెన్న తీయడం, నేయిగా కరిగించడం మనకు ఎన్నో సహస్రాబ్దాలుగా అలవాటయిన సంగతే గాథా సప్తశతిలో నేయి సంగతి ఎన్నోసార్లు వస్తుంది. కానీ, దీనిని మొదట కనిపెట్టినవారు ఆర్యులే. వేదంలో ఘృత ప్రస్తావం ఎక్కడ బడితే అక్కడ కనిపిస్తుంది. ఘృతం అనే శబ్దానికి నేయి అన్న అర్థమే కాక బలం, సారం, తేజస్సు, ఓజస్సు, అనే అర్థాలు కూడా తర్వాత ఏర్పడ్డాయి ఈ ఘృత శబ్దానికి పర్యాయమైన స్నేహశబ్దం మన నేయికి మాతృక కావచ్చు.

స్నాన, స్నేహ అనే పదాలు ప్రాకృతంలోను, ప్రాకృత తద్భవాలయిన తక్కిన భాషలలోను గుర్తు పట్టడానికి వీలులేనంత మార్పు

పొందాయి. కబీరు పద్యాలలో ఈ రెండు మాటలూ పద్ధ పాటు యింతా అంతా కాదు. స్నానశబ్దం నహాన. సనాన. తాన, ణహాన, సణాన. తాణ ఈ విధంగాను, స్నేహశబ్దం సణేహ, సనేహ, నేహ, సిణేహ, సిణిహ, ణేహ - ఈ విధంగాను పలుపోకడలు పోయాయి.

స్నేహ శబ్దం మనకు నేయి, నెయ్యి, నెయ్యం అయింది. తమిళంలో స్నేహ శబ్దం నేళ్, నేయం, నేయ్, నేళం - అయింది. కన్నడంలో నేయ్, నెయ్; మలయాళంలో నెయి, నై.

మైత్రి పరస్పరం సన్నిహితమైంది; ఎంత లాగినా, సంఘర్షణలు కలిగినా తెగక అంటిపెట్టుకునివుండే స్వభావం సూచించేది. కనుక - నేయి వంటిది గనుక - దానికి కూడా స్నేహ శబ్దం వాడుకలోకి వచ్చింది ఆ వాడుక ను బట్టే నెయ్యము అని కొంచెం మార్పుతో వాడుక వ్యాపించింది. నేళం అనే మరొక రూపానికి భావార్థకమైన 'తన' చేరి దానిలో 'త' మాత్రం మిగిలి నేస్తం అనే రూపాంతరం ఏర్పడింది. దానిమీద నేస్తగాఱ, నేస్త గాతి (అని కన్నడంలోను). నేస్తగాడు, నేస్తగత్తె మొదలయినవి (తెలుగు లోను) వచ్చాయి. మరి రెండు రూపాలు 'నిణం' 'నెణం' తమిళ, మల యాళ, కన్నడాల్లో క్రొవ్వు, మజ్జ అనే అర్థాలలోను మిగిలాయి.

ఇలా నెయ్యి అనేది ఆవు, బఱె, గొఱె, మేక, ఒంటెల పాల నుంచి తీసిన స్నేహసామాన్యానికి మొదట్లో వాడుక వుండేది. క్రమంగా గింజల నుంచి, కాయల నుంచీ "స్నేహ" పదార్థం తీయడం మొదలయిన తర్వాత వాటికి, మొదటి నేయికి భేదం తెలపవలసి వచ్చింది. నూవు నుంచి తీసే నెయ్యి నూనెయ్యి, నూనె అయింది. (నూనెను గురించి శ్రీ ప్రభాకర శాస్త్రి పాదులు వ్రాశారు) నూనె అనేది కూడా క్రమంగా తైల సామాన్య వాచి అయింది. ఆవనూనె, కుసుమనూనె, ఆవిసెనూనె అనే తీరుగా, తమిళ, కన్నడాలలోను యిదే పద్ధతిగా ఎళ్నెయ్యి ఎణ్ణై, ఎణ్ణె అయింది; సంస్కృతం లోను తిలశబ్ద నుంచి పుట్టిన తైలం క్రమంగా తైల సామాన్య వాచి అయినట్టే.

అయితే, ఘృతవాచకమైన తెనుగు పదం లేనేలేదా? వుంది. కాని, అది నేడు తమిళ, తెలుగులలో వ్యవహారచ్యుతమైంది, కన్నడంలోమాత్రం వాడుకలో వుంది. అది "తుప్ప" అనే పదం. గాథాసప్తశతిలో తుప్పపదం పెక్కుసార్లు వాడబడింది. తుప్ప అనేది దేశి పదమని, ప్రాకృతం కాదని గాథాసప్తశతి వ్యాఖ్యాతలు నిర్వచించారు. తుప్ప శబ్దమే నేయికి ప్రాచీన పర్యాయం.

తుప్ప ప్రాచీన రూపం **తుఌపు**. ఇది రాష్ట్రకూట ధ్రువరాజు శాసనంలో (780) ప్రయోగించబడింది. తమిళంలో ఆలమందకు తొఌవు అనే ప్రయోగం వుంది. ధ్రువరాజు శాసనంలోని తుఌపు, తొఌవుల మూల రూపం తొఌ, తుఌ అయివుంటుందని పండితు లంటున్నారు. తొట్టు పట్టు = గోష్ఠము. "ఘనభుజుండు నరుడు దన తొట్టు పట్టుల విశ్రమించి" (భారతం—ఆది. 8-210) అని నన్నయ ప్రయోగం. తొట్టులు = ధేనువులు. "తొట్టులు గాచిన నందుని" భాగవత ప్రయోగం (దశమస్కందం —పూర్వ 633) త్రువ్వ = ఎద్దు ఆవు. "త్రువ్వట బాబా, తలపై పువ్వట" అని తెనాలిరాముని ఆశుపద్య ప్రయోగం. తొఌవు - త్రువ్వ తువ్వాయిగా మారి దూడ అనే అర్థంలో మిగిలింది.

తుఌవుకు సంబంధించినవన్నిటికీకూడా లాక్షణికంగా తుఌవు అనే మాటే మొదట్లో వాడబడింది. తుఌపు, తుఌవు క్రమంగా త్రుప్పు, తుప్పు, తుప్ప అయింది. తుప్ప అనేమాట నేయి అనే అర్థంలో స్థిరపడిపోయింది. కాని నన్నయకాలానికి ముందే తెనుగులో వ్యవహారచ్యుతమైంది.



20

# టెంకాయ



విశ్వామిత్రుడు సృష్టించినవాటిలో టెంకాయ కూడ ఒక్కటని పెద్దలు అంటూంటారు.

సృష్టికి ప్రతిసృష్టి అని మొండికెత్తిన విశ్వామిత్రుడు కూరా,కాయా చేసి, మనుష్యుని చేద్దామని పూనుకుని సగం చేశాడట. అంతలోకే ఇంద్రాది దేవతలకు దిగులు పుట్టి బ్రహ్మవద్దకు వెళ్ళి "ఇక నీ పెత్తనం ఏముంది? భూలోకంలో విశ్వామిత్రుడనే నరమానవుడు వేరే మనుష్య జాతిని సృష్టించ డానికై పూనుకున్నాడు మొర్రో!" అన్నారట. బ్రహ్మ కూడ కొంచెం కంగారుపడి విశ్వామిత్రుని వద్దకు వచ్చి, సంగతి సందర్భాలు కనుక్కొన్న మీదట రాజీ బేరాలు సాగించాడట 'అబ్బితే జుట్టు, అబ్బకపోతే కాళ్లు' అనే దేగా పైవారి తత్వం! బ్రహ్మ అంతటివాడు దిగిరాగా లేనిది విశ్వామిత్రుడు తగ్గిరాడూ? తగ్గక తప్పిందికాదు. కాని బ్రహ్మకు బాగా జ్ఞాపకంవుండే షర తులు పెట్టాడట - నేను సృష్టించిన మానవమూర్తికి శాశ్వతంగా గౌరవం వుండాలి. దేవ మందిరాలలో, పూజా పురస్కారాలలో దానికి అగ్రస్థానం వుండాలి-అని. వ్రతంచెడ్డా ఫలం దక్కవద్దూ మరి? బ్రహ్మ సరేనన్నాడట. విశ్వామిత్రుడు అరకొరగా చేసిన మానవ మూర్తి భాగమే-విశ్వామిత్రుడు మానవాకార నిర్మాణం తలనుంచే మొదలుపెట్టి వుంటాడు — టెంకాయ.

కొత్తగాను, విడ్డూరంగాను కనిపించే ప్రతిదీ విశ్వామిత్ర సృష్టి అనడం మనవారి అలవాటు. ఈ అలవాటులో ఎంతవరకు నిజం వుందో తెలుసుకోవాలి గదా!

టెంకాయ పూర్వరూపం తెన్ కాయ. ఈ తెన్ దక్షిణ దిగ్వాచకం తమిళంలో తెన్, తెలుగు, తెంకు, తెంకం దక్షిణ దిశావాచకాలు. తెంకణం,

తెంకనాడు దక్షిణదేశం, కన్నడంలో తెంక, తెంకు, తెంగు, తెజ్జు, తెంబు, తెంకలు, టెంకు దక్షిణదిగ్వాచకాలు. తెంకణం, టెంకణం దక్షిణ దేశ వాచకాలు.

టెంకాయ మనకు దక్షిణాదిది. అంటే తమిళదేశం నుంచి వచ్చిందని కాదు. భారత దేశానికే, బహుశా ప్రపంచానికే దక్షిణాదిది. కనుకనే తమిళం లోనూ యిది దక్షిణాదికాయ అని స్పష్టంగా తెలుపుతాయి పదాలు: తెన్నై, తెంగు, తెంకు, తెంకంపళ్లం, తెంగంగాయ్, తేంగాయ్ (తేనెకాయ అని కూడ). కన్నడంలో తెంగినకాయ, తెంగు. తుళుభాషవారు మాత్రం దీనిని దక్షిణపుకాయ అనక, అంతకు ముందు తమకు పరిచితమైన తాడిచెట్టు పోలి కనుబట్టి 'తారె' అని వ్యవహరించారు. తాడిచెట్టుకు తారి అన్నారు. రి' ని ఎత్వంచేసి తారె మరొక పదం సృష్టించుకున్నారు.

ఇది మనదేశానికే దక్షిణప్రాంతంనుంచి వచ్చిందన్నాను కదా! మరి సంస్కృతంలోను ఆలాటి పదాలు కనిపించవద్దూ — అనే ప్రశ్న కలుగుతుంది. సంస్కృతంలోని టెంకాయ వాచక శబ్దాలు పరిశీలిస్తే నిజం తెలుస్తుంది. దీనికి వృక్షశాస్త్రజ్ఞుల సహాయం కూడా తీసుకుందాము.

టెంకాయచెట్టు బర్మా, భారతదేశాలంతటా- ముఖ్యంగా సముద్రతీర ప్రాంతాలలో, దక్షిణానికి పోనుపోను హెచ్చుగా కనిపిస్తుంది. హిందూ మహాసాగర ద్వీప సమామ్నాయంలోను, ముఖ్యంగా లక్ష ద్వీపాలు, నికోబారు ద్వీపాలు. వాటికి 40 మైళ్ళ దూరంలోని కోకో ద్వీపాలలో యిది తోపులుగా కనిపిస్తుంది. కనుక యిది భారత ద్వీప సమామ్నాయం నుంచి లంకకు, భారతదేశానికి వెళ్లి, యూరోప్ చేరి వుంటుందని, ఇప్పటి భౌగోళిక పరిస్థితులకు భిన్నమైన పరిస్థితులలో సముద్రం మీదుగా అమెరికా ఖండాలకు చేరి వుంటుందని, ఏమైనా భారతదేశానికి యిది మూడువేల ఏళ్ళకు ముందు చేరలేదని వృక్ష శాస్త్రజ్ఞులు అంటారు.

వృక్షశాస్త్రజ్ఞుల ఊహకు సంస్కృతంలో టెంకాయను తెలిపే మాటల వ్యుత్పత్తి తోడ్పడుతుందేమో చూద్దాం.

అమరకారుడు దీనికి నారికేళః, లాంగలీ అనే పర్యాయా లిచ్చినాడు. నారికేరః, నాడికేలః, నారికేలః, నారీకేలీ, నారికేరీ అని భరతుడు; నారికేళిః సదాపుష్పః అని శబ్దమాలా కారుడు; నాలికేరః, రసఫలః, సుతుంగః, కూర్చశేఖరః, దృఢనీలః, నీలతరుః, మంగల్యః, ఉచ్చతరుః, తృణరాజః, స్కంధతరుః, దాక్షిణాత్యః, దురారుహః, త్ర్యంబకఫలః, దృఢ ఫలః అని రాజ నిఘంటుకారుడు; కూర్చశీర్షకః, తుంగః, స్కంధఫలః, ఉచ్చః, సదా ఫలః అని భావప్రకాశ కారుడు; శిరఃఫలః, కరకాంభః, పయోధరః, మత్కుణః, కౌశిక ఫలం, ఫలముండః, జటా ఫలః, ముండఫలః, విశ్వామిత్ర ప్రియః అని శబ్దరత్నావళీ కారుడు; నారికేళః, సుభంగః, ఫలకేసరః అని జటాధరుడు చెప్పారు.

వీటిలో నారికేల, నారికేడ, నారికేర అనేవి నేటి ఉత్తరాది భాషలలో నారియల్, నరేల్, నరేలా, నారిల్ అని రకరకాలుగా అపభ్రంశమైంది.

రల వర్ణాల వ్యత్యాసంతో నారికేల, నాలికేర, నారికేర, నాలికేల అని కూడా ఈ పదం మారింది.

నాలి అనే శబ్దానికి గంధం గలది (నలతి, నల్యతే వా నాలిః, ణల గంధే) అని, గాలికి కదులుతూ వుండేది (కేన వాయునా ఇలతి, ఇల గతౌ) అని కేర శబ్దానికి, విడివిడిగా కొందరు అర్థం చెప్పి, గంధం కలిగి, గాలికి కదిలేది అని అన్నారు.

నారి క్రీడవలె సుఖకరమైన క్రీడగలది (నార్యాః రమణ్యాః కేల ఇవ సుఖదాయి కేలో యస్య-కిలశ్చైత్యే, క్రీడనేచ, పృషోదరాది గణం కావడం వల్ల నారీ శబ్దానికి హ్రస్వం)అని శబ్దకల్పద్రుమకారులు వ్యుత్పత్తి చెప్పారు.

పీచు, పూలు కింద పడవేసేది (నాలికాన్ వలయుక్తాన్ పుష్పాదీన్ ఈరయతి) గనుక నాలికేర మన్నాడు అమర వ్యాఖ్యాత క్షీరస్వామి

ఈ వ్యుత్పత్తులన్నీ ఏమంత సబబుగా వున్నాయి ? ఏదో అగతికంగా కల్పించినట్టు లేదూ? పృషోదరాది గణంలో దీనిని పడవేయడమే వ్యుత్పత్తి సాధ్యం కాలేదనడానికి నిదర్శనం కాదా? స్పష్టంగా ఏమీ చెప్పలేనప్పుడు సంస్కృత వైయాకరణులు పృషోదరాదులని, మరొకటని గణా

లలో పడవేస్తారు. ఇంతకూ గంధం లేని, గాలికి కదలని చెట్టున్నదా? పృథివీ పదార్థ ప్రధాన లక్షణం గంధవత్వం కదా?

ఇక సదాఫల, శిరఃఫల, తుంగ, తృణరాజు మున్నగునవి టెంకాయ చెట్టు ఆకారం, కాపు చూచిన తర్వాత కల్పించుకొన్న వనడం స్పష్టం.

కనుక ఇది—దీని వ్యుత్పత్తి అనుకున్నంత తృప్తి కలిగించడం లేదు కనుక, నీరున్నకాయ అంటేనన్నా ఎంతో సబబుగా వుండేది — అన్య దేశంనుంచి వచ్చి ఉంటుందనే వాదం అంగీకరిద్దాం. ఈ వాదానికి కౌశిక ఫలః, దాక్షిణాత్యః, విశ్వామిత్రప్రియః అనే పర్యాయాలు, ఇది విశ్వామిత్ర సృష్టి అనే ప్రథ ఆధారంగా ఉండనే వున్నాయి.

ఇది హిందూ మహాసముద్ర ద్వీప సమామ్నాయందని, దానిలోని కోకో ద్వీపంనుంచి బహుశా ప్రపంచానికి వ్యాపించి వుంటుందని వృక్ష శాస్త్రజ్ఞులు అన్నే అన్నారు గదా? కనుక అక్కడి మాటలకు నారికేల శబ్దానికి ఏమైన పోలికలు, సంబంధం ఉన్నవేమో చూద్దాం. భారతదేశంలో ఆర్య సంస్కృతికి ముందు మూడు సంస్కృతులు వెలసినవనే సంగతిని మనం ఈ సందర్భంలో మరచిపోరాదు. మొదటిది నీగ్రో, తర్వాత అస్ట్రిక్, పిదప ద్రావిడ నాగరికతలు, అటు పిమ్మటిది ఆర్యనాగరికత. ఒకప్పుడు భారతవర్షమంతటా వ్యాపించిన నీగ్రో జాతి అవశేషమే నేడు అండమాన్ దీవులలోని వోంగ్ జాతి వారని మానవ శాస్త్రజ్ఞులు అంటున్నారు. అస్ట్రిక్, ద్రావిడ శబ్దాలు సంస్కృతంలో ఎన్నో చేరాయి. ఈ నారికేళ శబ్దం కూడ అలాటి అస్ట్రిక్ పదమే

మలయా ద్వీపకల్పంలోను, దాని పరిసరాలలోను నేడున్న అనాది జాతులవారు టెంకాయను హెర్పాయి, హ్రెర్పాయి, హిపాయి, ఇపాయి, న్యోర్, న్యోర్ర్, నియోర్, నియో, నియా, నియూ అంటారని ఆ భాషా విద్వాంసు లన్నారు. సిమాంగ్ కేడా అనే ప్రాంతంలోని వారు న్యోర్ అంటారట. ఈ న్యోర్ - న్యోర్ర్ - నియోర్‌లు ఇవి వ్యవహరించబడే ప్రాంతంతోపాటు సంస్కృతంలోకి చేరి వుంటాయి. కేడా ప్రాంతంనుంచి వచ్చిన నియోర్-నియోర్‌కేడా - అన్నమాట. అంటే, కేడానుంచి వచ్చిన

టెంకాయ విదేశపదాన్ని ఏ దేశ వాసులైనా తమ మాతృభాషకు సన్ని హితంగా చేసుకుని వ్యవహరించుకొనడం అలవాటు. కనుక కేడా ప్రాంతం నుంచి వచ్చిన న్యోర్ - నియోర్‌ను మనవారు నారికేద అని అన్నారు. తర్వాత పండితులు దానికి లేనిపోని వ్యుత్పత్తి కల్పించారు.

మలయాలోని మరికొన్ని ప్రాంతాలలో కొబ్బరికాయను కలంబిర్, కలప అని అంటారట. జావాలో దీనికి కలప అని పేరట. లంకలో దీనికి తంబిలి అనే పర్యాయం వుంది. తెంబి అనేది మలయాలో ఒక ప్రాంతం. ఈ తంబిలి తెంబి నుంచి వచ్చినదని ఊహించవచ్చు. మన కొబ్బెరకు - ఉత్తరాది అంతటా ప్రచారంలో వున్న ఖోప్రా, ఖోప్రి, ఖోప్రూలకు మలయా, జావాల కలప, కలంబిర్ పదాలకు, హెర్‌పాయి, హ్యెర్‌పాయి శబ్దాలకు సంబంధం వుందేమో! హెర్‌పాయి వర్ణ వ్యత్యాసంతో హెప్రాయి అయి, కలప-కలంబిర్‌లతోపాటు సత్వరోచ్చారణవల్ల ఖెర్పాయి, ఖోర్పాయి, కొబ్బరి, ఖోప్రీ అనే రూపాలు కలుగడానికి అవకాశం వుంది. కొబ్బెర— మొదట చెట్టుకే పేరుగా వుండి, కాయలో గుజ్జుకు తర్వాత రూఢి అయి వుంటుంది.

తీయకల్లుకు వాడే నీరా అనే మాటకూడా న్యోర్ నుండి వచ్చిందేమో ఆలోచించాలి. నీరా అంటే టెంకాయచెట్టు రసమన్నమాట.

విశ్వామిత్రుడే తెచ్చాడో, మరెవరు తెచ్చారో యిది— దీని బహుళ ప్రయోజనాన్ని బట్టే— శ్రాద్ధాలవంటి వైదిక కార్యాలలోను అర్హంగా పరిగణించబడి వుంటుంది.



# కమలా - చకోత్ర



కొన్ని పదాలు సంస్కృతంలోని కొన్ని పదాల పోలికనుబట్టి సంస్కృత పదాలనే భ్రాంతి కలుగుతూ వుంటుంది. నిఘంటుకారులు కూడ ఒక్కొక్కప్పుడు పొరపడి అలాటి పదాలను సంస్కృతంగానే గ్రహించడం సంభవిస్తూ వుంటుంది. వాటిలో ఒకటి 'కమలా' పండు.

కమ్మని కమలా ఫలాలు తినని తెలుగువారుంటారా? నిమ్మజాతి చెట్లన్నీ భారతదేశంవేనని, నాగరంగ అనే సంస్కృత పదమే నేడు భారతదేశంలోను, పాశ్చాత్య దేశాలలోనూ వ్యాప్తిలో వున్న ఆరంజ్, నారింజ వంటి పదాలకు మూలమని వృక్షశాస్త్రజ్ఞుల మతం. మరి కమలా అనే వింత పేరు ఎలా వచ్చింది?

నారింజను బెంగాలీలో కమలా నేంబూ, నారుంగ, నారెంగ అని అంటారు. హిందీలో నారంగీ, నారగీ, సంతరా. తమిళంలో కమలా అనే పేరు యిటీవలిదట. దానిలో దీనికి పాత పర్యాయాలు, కిచ్చలి, కిచ్చిలి, కిత్తలి, కొళంజి, కొళ్లుంజి. తెలుగులోన కొన్ని ప్రాంతాలలో కిత్తలి, కిచ్చలి, కిచ్చిలి, కిచిలి అనే పదాలు వ్యవహారంలో వున్నాయి. కొన్ని ప్రాంతాలలో కమలా అన్నది తెలీదు కూడా. కన్నడంలో కమలా పదాన్ని కిట్టెల్ తన నిఘంటువులో గ్రహించలేదు. తెలుగులోను ప్రాచీన ప్రయోగాలు కనిపించవు. కొందరు నిఘంటుకారులు మాత్రం పేర్కొన్నారు. శబ్ద రత్నాకర సూర్యరాయ నిఘంటువుల్లో యిది ఆకారాంత నపుంసకలింగ సంస్కృత పదంగా 'కమలా ఫలం' అని పేర్కొనబడింది. వావిళ్ళ నిఘంటువులోను సంస్కృతంగానే గ్రహించబడింది. కాని గత శతాబ్దిలోని కాంప్‌బెల్లు నిఘంటువులో ఈ పదం లేదు. మన శృంగార కవులు నారింజను-నాగరంగాన్ని - రంగు, ఆకారం, పరిమాణం మున్నగు కారణాలతో

స్త్రీ వర్ణనలో భాగంగా తీసుకున్నారు. కాని కమలాను తీసుకున్నట్లు లేదు కనుక ఈ పదం మనకు అంత ప్రాచీనం కాదని, యిటీవల వచ్చిందని అనుమానం కలుగుతుంది.

బెంగాలీలో నారింజకు కమలానేంబూ అనే పర్యాయం వుందని తెలుసుకున్నాం కదా! అంటే, కమలానారింజ లేక కమలానిమ్మ అన్నమాట. ఇది ప్రత్యేకమైన జాతి అని దీనినుంచి తెలుస్తున్నది కదా! "కమలా ఆరంజ్" అని మద్రాసు వీధులలో వీటిని అమ్మేవారి కేకలు వింటే యిది అర్థం కాకపోదు. ఈ మాట భారతదేశంలోని యితర ఉత్తరాపథ భాషలలో కనిపించక ఒక్క బెంగాలీలోనే వుండడం, దక్షిణాపథంలో - తెలుగులో చాల ప్రచారంలో వుండడం. కన్నడంలో కనిపించక పోవడం, తమిళంలో ఇటీవలిదే ననడం చూడగా, కమలాజాతి నారింజపండు బెంగాలుకు ఎక్కడి నుంచో చేరి, అక్కడినుంచి కోస్తామీదుగా మనకు వచ్చినట్టుంది.

కుమాఊం జిల్లాలో సంత్రా, నారంగీ, కౌన్లా అనే మూడు నారింజ జాతులను వేరుగా పేర్కొంటున్నారని, సంత్రాకు భిన్నమైంది కౌన్లా అని అట్కిన్‌సన్ అనే శాస్త్రజ్ఞుడన్నాడు. కౌన్లాను కమ్లా, కెఓన్లా, కమ్లా అని రకరకాలుగా వ్యవహరిస్తారట. కనుక ఈ రకరకాలుగా వ్యవహరించబడే కౌన్లాకు బెంగాలీ కమలాకు, మన కమలాకు ఒకే పదం మూలమైందని అనవచ్చు.

కమలా అనే నది అస్సాంలో వుంది. ఆ నదీతీరంలో కమలాతోటలు వన్యస్థితిలో వున్నాయి. అక్కడ నుంచి బెంగాలుకు ఈ పండు ఈ నది పేరుతో వ్యాపించిందంటాడు బొనేవియా అనే శాస్త్రజ్ఞుడు. తిప్పేరా ప్రధాన పట్టణమైన కొమిల్లానుంచి ఎగుమతి కావడంవల్ల ఈ పేరు వచ్చిందని మరొకరన్నారు. కనుక ఈ పేరుతో వ్యవహరించబడే పండు అస్సాం నుంచి – కమలానదీ ప్రాంతంనుంచే అనండి, కొమిల్లా పట్టణం నుంచైనా అనండి – బెంగాలుకు, అక్కడి నుంచి యితర ప్రాంతాలకు పాకి వుంటుంది. కనుకనే బెంగాలీవారు దీనిని కమలానేంబూ అన్నారు– అంటే కమలా నారింజ.

ఇంతకూ ఈ జాతిపండు అస్సాంకు కూడా కొత్తదేనని - తియ్య నారింజ భారతదేశానికే కొత్తదని - చీనానుంచి అక్కడికి చేరిందని కొందరన్నారు. ఏమైనా మన జిజ్ఞాస యిప్పుడు పండుకాదు-పండు పేరు మాత్రమే.

ఇంతకూ సంత్రా అనే పేరుకూడా విదేశీయమేనట.

ఒకరకం నారింజపండు చీనా, కొచ్చిన్ చీనాలనుండి 16 వ శతాబ్దంలో యూరోప్ చేరింది. దీనికి పోర్చుగల్‌లోని సింత్రాపట్టణం పెద్ద కేంద్రం. అక్కడినుంచి మరల భారతదేశానికి ఎగుమతి కావడంవల్ల సింత్రా వికృతి చెంది సంత్రా అనే పేరు వచ్చిందని కొందరంటున్నారు.

మాల్టా అని వ్యవహరించబడే ఎర్రటి నారింజపండు 19 వ శతాబ్దంలో భారతదేశానికి తేబడిన కొత్త అంటు. దీనిని మరాఠీవారు మూసెంబీ అంటారు. జాంజిబార్ నుంచి బొంబాయికి దిగుమతి అయ్యే యిలాటి మరొక చిన్న నారింజపండు (బహుశా ముజాంబీ నుంచి అయివుంటుంది) దీనిలాగే ఎర్రగా వుంటుంది గనుక మాల్టా కాయ అని కూడ ఈ పేరుతోనే అన్నారు కాబోలునని వృక్షశాస్త్రజ్ఞులు వూహిస్తున్నారు. బత్తాయి అనేది బటేవియా వికృతి. కడప, చిత్తూరు, అనంతపురం జిల్లాలలో బత్తాయిని చీనీపండు అంటారు. స్థానికంగా వున్న కిచ్చిలికి దీనికి భేదం తెలియజేస్తున్నది ఈ పేరు. ఇది చీనానుంచి వచ్చిన అంటయి వుంటుంది.

ఇదంతా మనకు అప్రస్తుతం. కమలాఫలం అని సంస్కృతీకరించబడిన పదం సంస్కృతముది కాదని, ప్రాంతీయమైన పేరునుబట్టి వ్యాపించిన పదాన్ని నిఘంటుకారులు సంస్కృతీకరించారని తెలుసుకున్నాము;చాలు.

ఇక పంపరపనాసపండు సంగతి: ఇది పూర్తిగా విదేశీ పండు. ఇది మలయాద్వీపసమామ్నాయంలోను, ఫ్రెండ్లీద్వీపాలలోను, ఫిజీద్వీపాలలోను వన్యస్థితిలో వుంటుందట. దీనిని జావానుంచి భారతదేశానికి, పడమటి ఇండియా దీవులకు కెప్టెన్ షాడి లాక్ అనే ఆయన తెచ్చాడట. నే డిది

ఆంధ్రదేశమంతటా-మన దేశందే అన్నంత భ్రాంతి కలిగిస్తూ-కనిపిస్తుంది. బెంగాలులోను, సరిహద్దు రాష్ట్రంలోను హెచ్చుగానే పండుతుంది. దీనికి మన దేశంలో వ్యవహరించబడే పేర్లే యిది విదేశీయ మనడానికి నిదర్శనం.

చకోతరా, చకోత్ర, మహానీబు, చకోతా, బటావీనీబూ, సదాఫల్-హిందీ, బటావీ నేబూ, మహానేబూ, చకోత్ర, బటోర్ నెబూ - బెంగాలీ. చకోత్ర-పంజాబీ. బీజోరో-సింధీ. ఓజకొట్రూ - గుజరాతీ. పనస్, పప్‌నస్, పాప్‌నాస్, పనిస్, పప్పనాసా - మరాఠీ. పంబిలినాస్-తమిళ్. పంపరపనాస, చకోత్రపండు, ఈదపండు - తెలుగు. సకోత్ర, చకోర, చకోత, చక్కోత - కన్నడం. చక్కుల్లి-తుళు బొంబెలి-మలయాళం. పూంప్లేమూస్-మలయా.

ఇది అన్ని ఋతువుల్లోనూ పండేది గనుక సదాఫల్ అన్నారు హిందీ, బెంగాలీవారు. పూంప్లేమూస్ అనే మలయా పేరుతో దక్షిణాపథానికి వచ్చిన ఈ పండు బొంబిలినాస్, పంపరపనాస అనే పేర్లు పెట్టుకుంది. జకార్తానుంచి ఎగుమతి అయిన నాటిపేరు కాబోలు చకోత్ర, సకోత్ర అని మారుతూ, చకోర అని సంస్కృతపద భ్రాంతివరకు దిగజారింది. బటావీనేబూ, బటోర్ నేబూ అనేవి బటేవియా భ్రష్టరూపాలని వేరుగా చెప్పనక్కరలేదు. మల యాలో బాగా పండిన ఈ పండును పొంపేలేయస్ అని, పండనిదాన్ని పోంపిల్ మోవ్‌సెస్ అని అంటారట.



# కోటలో పాగా



ఏమోయ్! కోటలో పాగా వేశావే! కోటలో పాగా పడిం దన్న మాట! ఇకనేం? కోటలో పాగా వేసినట్టే! - అని అభినందిస్తాం; ఎవరైనా పని సాధించినప్పుడు. ఇలా ఈ నానుడి గెలుపు అనే అర్థంలో వాడుకలో వుంది. కాని, దీనికి ఈ అర్థం ఎలా వచ్చిందో కొంచెం చర్చిద్దాం.

"కోటలో పాగా వేయడమంటే కోటలో పాగా ధరించి రాజోద్యోగం సంపాదించడ మన్నమాట. రాజోద్యోగం సంపాదించడమనేది పూర్వం ఎంతో ఘనకార్యం దివానులను, తక్కిన దివాణం ఉద్యోగులను ఆశ్రయించి ఎంతో శ్రమపడితేనేగాని ఉద్యోగం దొరికేది కాదు ఇంత శ్రమ పడడంవల్ల లభించిన ఉద్యోగం గనుకనే ఎంతో అభినందనకు పాత్ర మయ్యేది ఇక భయంలేదు కోట్లో పాగా పడింది - అని సంతృప్తి పొందేవారు" అని కొందరి వివరణ

ఈ దృష్టితో చూస్తే పాగాలు ధరించడం, ముఖ్యంగా రాజసభలలో ప్రత్యేకంగా దుస్తులు ధరించడం మనకు అనాదిగా వుంది. అమరావతి చిత్రాల్లో శిరోవేష్టనాలు కల బొమ్మలను చూడవచ్చు.

విజయనగర రాజుల దర్బారు వేషం వింతగా వుండేది కనుకనే శ్రీనాథుడు "కుల్లా యుంచితి కోక సుట్టితి మహా కూర్పాసమున్ దొడ్గితిన్" అన్నాడు. ఆ కాలంలో రాజభటులు, పెద్ద మనుష్యులు కూడా తలపాగా మొదలయిన దుస్తులు ధరించేవారు. "వంకర పాగలున్ నడుము వంగిన కత్తులు, మైలకోకలున్" అని శ్రీనాథుడు మొరసరాజ్యమువారిని ఈసడించు

కున్నాడు. "తిలకంబు కస్తూరి తిలకించి చొళ్లెంబు చెంగుల పాగతో చెన్ను మీర" అని సింహాసన ద్వాత్రింశతిలో వీరుని వర్ణన మున్నది.

వెలమ దర్బారీ వేషం మరొక విధంగా వుండేది. ఆ వేషం లేనిదే దర్బారులో ప్రవేశం దొరికేది కాదు. కనుకనే మల్లినాథుడు సింగభూపాలుని చూడడానికి వెళ్ళినప్పుడు, ఆయన చీకిరి బాకిరి గుడ్డలు చూచి యిరుగు పొరుగువారు నవ్వగా, "సర్వజ్ఞసింగని చూడడానికి వైదుష్య మొకటే సహాయమోయ్ తక్కినవన్నీ ఎందుకు?" అని జవాబు చెప్పాడు.

తర్వాతి కాలంలో రకరకాల పాగాలు ధరించే వారు. కరణం 'పొసగగా బోడకుల్లా' చుట్టాడట. వైష్ణవ భాగవతుడు 'పోలగా పొత్తి పాగా చుట్టాడట (పరమయోగి విలాసం). "గంధపు బొట్టు వీడియము పచ్చల పాగయు కావి దుప్పటిన్" కోమటి వేసమట. (చంద్రభాను చరిత్ర.)

చక్కని వేషంలో యితరులను మోసం చేసేవారిని వేమన మాటాగా అన్నాడు:

"తలను పాగ, పైని తగు పచ్చడము, బొజ్జ
చెవుల పోగు లరసి చేరు నర్థి,
శుద్ధ మూర్ఖులనుచు బుద్ధిలో నరయక
విశ్వదాభిరామ, వినుర వేమ!

పాగ, పచ్చడంబు, పైకి కూసంబును,
పోగు, లుంగరములు, బొజ్జకడుపు,
కలిగినట్టివాని కందరు చుట్టాలు
విశ్వదాభిరామ వినురవేమ!"

రాజుల దర్బారులు పడిపోయిన తర్వాత మామూలు రెడ్ల (గామ మునసబుల) దగ్గరకు కూడా కరణాలు ఈ తలపాగాతోనే వచ్చేవారు. "ముదుక తలపాగయును.... కరణ మేతెంచి రెడ్డి చెంగట వసించె" (విప్ర-చరిత్ర.)

మాడుగుల కృష్ణ భూపతి ఆస్థానంలో కవులు, పండితులూ తల పాగా ధరించే వెళ్లేవారు "పాగా గల కవులిద్దరు బా గొప్పగ కృష్ణమూర్తి భాస్కరులు" - అని ఇద్ద రుండేవారు.

ఇలా పాగాలు ధరించడం ఆచారంలో వున్నా, పాగా వేసుకొనడం, పెట్టుకొనడం అనాలి గాని, పాగా వేయడం అనే దానికి వేసుకొనడం అనే అర్థం ఎలా వస్తుంది? కనుక యిది సరిపడదు. కోటలోని ఉద్యోగులే కాక, తక్కిన ఘరానా మనుష్యులు పాగాలు ధరించేవారే గనుక, శిరోవేష్టనం అనాది ఆచారం గనుక ఈ అర్థం ససిపడదు. మరొక విధంగా కుదురుతుందేమో చూద్దాం.

పచ్చీసు ఆటలో పావు లున్నాయి. ఆ ఆటలో గెలుపొందడానికి మధ్యన వున్న కోటలో - కొండలో పావులు పడెయ్యాలి. అన్ని కాయలూ పడి ఒక్క కాయ మిగిలి వుందనుకోండి. అదీ వేశాం. ఇక గెలిచాం. కోటలో పాగా వేశాం అన్నమాట. పావు పావా అయి, వ గ వర్ణాలకు గల వ్యత్యయాన్ని బట్టి (పవడము: పగడము, పవలు: పగలులాగ) పాగా అయి వుంటుందని, పచ్చీసు కాయల ఆటలకు సంబంధించినదే ఈ నానుడి అని శ్రీ తాపీ ధర్మరావుగారు సూచించారు. ఏమైనా కోట్లో పాగా వేయడం టోపీ వేయడంవంటిది మాత్రం కాదు!

కాని యింకొక విధంగా పరిశీలిస్తే యింకేమయినా అర్థం స్ఫురిస్తుందేమో చూద్దాం.

ఉడుము కేలరా ఊళ్ళో పెత్తనం?— అని సామెత. కాని, ఊళ్ళపై పెత్తనం చేయడానికి, ఊళ్ళు, కోటలు సాధించడానికి ఉడుము పూర్వం రాజులకు చాల వుపయోగపడేది.

ఉడుముకు వుండే ప్రధాన గుణం గట్టిపట్టు. భల్లూకప్పట్టు ఎంత భయంకరమో, ఉడుముపట్టు కూడా అంతే. అందువల్లనే "ఉడుము పోయినా చేయి వదిలించుకొని వచ్చినాడు" అనే సామెత కూడ పుట్టింది. ఉడుము నాలుగు కాళ్ళూ అప్పళించి అతుక్కుందంటే ఏనుగు పట్టుకొని లాగినా

పట్టు విడువదు; పిగిలి పైకి రాదు ఎంత నిటారుగా వున్న గోడలనైనా ఉడుము గబగబా ఎక్కిపోతుంది. అందుకే "ఉడుంలాగా ఎక్కిపోతాడు" అనే సామెత ఏర్పడింది, జీవితంలో గబగబా పైకి ఎక్కిపోతున్న వ్యక్తిని ప్రశంసించే సందర్భంలో. వీటికి నీటిపై పాకిపోయే శక్తికూడా వుంది.

రాజులు వీటిని సాకి ప్రత్యేకంగా తర్ఫీదు యిప్పించేవారు. వీటి తోకకు పగ్గం కట్టి కోటగోడలమీదికి విసిరేవారు పగ్గం వదులుగా వున్నంత సేపూ ఉడుము ఎక్కిపోతూ వుంటుంది. లాగితే ఆగుతుంది. లాగినకొద్దీ బిర్రుగా అతుక్కుంటుంది గోడకు. ఆ పగ్గం పట్టుకుని సైనికులు పైకి ఎక్కిపోయేవారు.

ఉడుములు సాకడానికి ప్రత్యేకంగా సిబ్బంది వుండేవి, ప్రతి రాజు దగ్గరా. తరచు వీటిని బోయవారు సాకేవారు. ప్రస్తుతం కోయంబత్తూరు జిల్లాలో "ఉడుమల్‌పేట" అనే వూరుంది. ఇది తాలూకా కేంద్రం. ఈ వూరికి ఏడు మైళ్ళలో "దలి" అనే మరొక గ్రామం వుంది. ఇది నేడు గ్రామమైనా పూర్వం ఒక పాళేగారు రాజధాని ఉడుమల్‌పేట మైసూరు రాజ్యం సరిహద్దుల్లో వుంది. "దలి" పాళేగారు మైసూరు సరిహద్దు రక్షకుడుగా వుండేవాడు. ఆ పాళేగారు మైసూరు రాజులకు ఉడుమల్‌పేట అడవులనుంచి ఉడుములు సరఫరా చేసేవాడు. ఉడుముల వ్యాపార కేంద్రం కావడంవల్ల ఆ వూరికి ఆ పేరు వచ్చింది. ఇలాగే ప్రతి రాజుకూ ఉడుముల శాఖ (డిపార్టుమెంటు) వుండేది.

కోటలు ఎక్కువగా వున్న మరాఠ్‌వాడా, రాయలసీమలలో ఉడుము సహాయంతో కోటలను సాధించిన కథలు, లెక్కలేనన్ని, జనం నాలుకపై వున్నాయి. సింహగఢ విజయంలో శివాజీకి కుడిభుజమైన తానాజీ ఉడుము తోకకు పగ్గం కట్టి గోడకు విసిరివేయడం, అది తిరిగి రావడం, ఇలా రెండు సార్లు తిరిగివస్తే, మూడోసారి దానిని బెదిరించి పంపడం, అది తిరిగిరాకుండా అతుక్కుపోవడం-ఈ కథంతా అందరికీ తెలిసిందే. దీనిని శ్రీ గడియారం శేషశాస్త్రిగారు "శివభారతం"లో అతిమనోహరంగా వర్ణించారు.

"పెదబొబ్బిలి రాజు కథ" అనే గేయ రచనలో ఉడుము ప్రస్తావన వుంది. బొబ్బిలివారి పుట్టకోట బూసీకి స్వాధీనం కాకపోయిందట. అప్పుడు ఉడుములు పనికి వచ్చాయి.

"సాధ్యానికి రాకయున్నది పుట్టకోటయున్న,
సీమ ఉడుములు తెప్పించినారు ప్రాంచీ దొరగారు.
కోటపై తగిలించినారు జాతులవారూనూ
ఉడుముతోక పట్టుకొని లగ్గల కెక్కిరి."

ఇక చెప్పవలసింది కోటలో పాగాకూ, ఉడుముకూ గల సంబంధం మాత్రమే. సైనికులు పొడుగాటి పాగాలు ధరించేవారు. వాటి నేతే వేరు. వెడల్పు మూరెడే అయినా, పొడవు మాత్రం ఎనిమిది బారలు, పదారు బారలు వుండేవి మనకు తలకట్టు ధరించడం వేల సంవత్సరాలుగా ఆచారమైనప్పటికీ 'పాగాల' పద్ధతి మాత్రం విదేశీయం. 'పాగా' తెలుగు పదం కాదు. పాగాలు శిరస్త్రాణాలుగా వుపయోగపడేవి; శత్రువులను రెక్కలు విరిచి కట్టడానికి వుపయోగపడేవి; పేని పగ్గాలు కట్టి కోటలు ఎక్కడానికి పనికి వచ్చేవి. కొందరు సైనికులు కోటవద్దకు వెళ్ళేవారు. నిచ్చెనలు, మోకులు వగైరా సామాను తీసుకొని వెళ్ళడంలో ముట్టడి గుట్టు బట్టబయలయిపోదూ? ఉడుములను మాత్రం వెంట తీసుకొని వెళ్ళేవారు. తలపాగా తీసి పెనవేసి దాని తోకకు కట్టేవారు. ఇవతలికొన పట్టుకుని చేతికొద్దీ ఉడుమును కోట గోడమీదకు విసిరేవారు ఉడుము కోటకొనకు వెళ్ళి అక్కడ అనువుగావున్న చోట్లో అతుక్కునేది. సైనికులు పాగా పట్టుకొని ఒకరొకరే పైకి పాకి వెళ్ళేవారు ఆ పాగానే కోటగోడ అవలివైపుకు జారవిడిచి కోటలోపల దిగేవారు. వీరు రహస్యంగా వెళ్ళి కోటలోపలి తలుపులవద్ద వున్న కావలి వారిని చంపి, తలుపులు తీయడమేమిటి, కోటవెలుపల పొంచి సిద్ధంగా వున్న దండు ఒక్కుమ్మడిగా లోపలికి జొరబడడమేమిటి - నిమిషాలమీద జరిగేవి.

ఇది చెప్పినంత సులభమైన పని కాదు. కోట బురుజులలో వుండే కావలివారు ఈ ఎత్తులు కనిపెట్టి ఉడుములను చంపివేసేవారు; పాగాలు తెంపివేసేవారు. కనుకనే కోటను జయించగోరిన సైనికులు ఎంతో గుట్టుగా, దిట్టతనంతో పాగా ఉడుమును విసరవలసి వుంటుంది; కాపలావారి కంట బడని ఏ మారుమూలో చూడవలసి వుంటుంది; కాపలావారి కన్ను తప్పించుకొని వేయవలసి వుంటుంది. వేసి గోడ ఎక్కినా, లోపల దిగే ప్రదేశం ఆనుపానులు చూడవలసి వుంటుంది.

అలా వేశాక యిక విజయమే. కోటలో పాగా వేయడమంటే యిదే ననుకుంటాను.



# జీడి - జీడిమామిడి



"వాడి జోలి మనకెందుకు - వట్టి జీడి మనిషి!", "జీడిలాగ అంటుకుంటాడు!" అని అంటుంటాము కదపంగానే విడిచి పెట్టకుండా మాట్లాడే వారినీ, ఊరికే నస పెట్టేవారినీ చూచి.

జీడి ప్రధాన గుణాలు తాకగానే అంటుకోడం, అంటుకోగానే వ్రణం చేసి రభస పెట్టడం. ఈ గుణాలనుబట్టే దీనికీపేరు వచ్చిందేమో! సంస్కృతంలో జీడివాచకాలకున్న వ్యుత్పత్తి మన ఈ ఊహకు కొంత తోడ్పడుతుంది.

అమరకోశకారుడు వీరవృక్షః, అరుష్కరః, అగ్నిముఖీ, భల్లాతకీ అనే పేర్లిచ్చాడు జీడికి. దీని రంగును గుణాన్నిబట్టి మహాకాలః, పావకః అని మరి రెండు పేర్లు చెప్పారు కొందరు. రక్తాన్ని విశేషంగా రెచ్చగొట్టే చెట్టు (విశేషేణ ఈరయతి) వీరవృక్షం. పుండ్లు కలిగించేది (అరూంషి స్ఫోటైః వ్రణాన్ కరోతి) అరుష్కరం. నిప్పుకక్కేది (అగ్ని వన్ముఖమస్యాః దాహకత్వాత్) అగ్నిముఖి భల్లాయుధంవలె అంతటా వ్యాపించేది. (భల్ల ఇవ అతతి) భల్లాతకీ - అని వ్యుత్పత్తి చెప్పారు.

దీని గుణా లన్నిటినీ కలిపి ధన్వంతరి నిఘంటుకారుడు -

"భల్లాతకః స్మృతో దుఃఖో దహనః తపనోగ్నికః,
అరుష్కరో వీరతరుః భల్లీ చాగ్నిముఖీ ధనుః"

అని క్రోడీకరించాడు. (ధ 3-193)

తెనుగుకు సజాతీయమైన భాషలలో జీడికిగల మాటలను తెలుసుకుంటే జీడి పదం వ్యుత్పత్తి సుగమమౌతుంది. తమిళంలో దీనికి సే, సేర్ అని పేరు. మళయాళంలో చేరన్. కన్నడంలో కేర్, గేర్, కేరు, గేరు, గేర.

కొన్ని సజాతీయ పదాలు తాలవ్యీకరణ ప్రక్రియనుబట్టి తెనుగులో మారుతాయి అంటే ప్రాచీన సజాతీయపదంలోని కవర్గం తెనుగులో చవర్గ మౌతుందన్నమాట. కిళి (త, క) - చిలుక, కిచ్చు - చిచ్చు. కిలుబు - చిలుము; గిడ - చెట్టు. ఈ విధంగా కేర్ - గేర్ - కేరు - గేరు శబ్దాం లోని కకారం జకారమై రేఫం డకారంగా మారి జీడి అయింది.

కెరె, కేర్, గేర్ పదాలకు రాచు, గీరు అనే అర్థాలు కన్నడంలోను వున్నాయి. "కెరె సఖ క్రియాయాం" అని శబ్దమణి దర్పణకారుడు ధాతు పాఠంలో పఠించాడు. ఈ శబ్దాలు క్రమంగా గీఱు గీఱ గీత, గోరు, జీఱు. జీఱ జెట్టి మున్నగు పదాలకు పుట్టుకయాయి

కనుక తాకగానే చేతితో గిల్లినట్లు గీతలు, గీరలు (పుండ్లు) కలి గించేది; జీఱలు కలిగించేది అనే అర్థంతో గేరు కేరు, జీడి అనే రూపాలు ఏర్పడి వుంటాయని మనం వూహించుకోవచ్చు

తమిళంలోని సే అనే పదానికి సెన్ అనే పదం మూలమని ఇది సేంగొట్టె అనే దానిలో స్పష్టంగా వుందని, జీడిరంగు తర్వాత లేత ఎరుపు గాను, నలుపుమీది ఎరుపుగాను మారుతుంది గనుక ఎరుపు వాచకమైన సెన్ నుంచి యిది పుట్టిందని కొందరన్నారు. సేర్ అనేది బురదకు వాచకం కనుక జీడిరసం బురదగా వుండడాన్నిబట్టి బురదలాగా, నల్లగా వుండేది అని కొందరన్నారు.

ఈ జీడి గుణం పోలికతో దేశాంతరం నుంచి వచ్చిన మరొక చెట్టుకు కూడా ఈ పేరే వచ్చింది. అదే జీడిమామిడి

జీడిమామిడి మన నిఘంటుకారులను కొంచెం తికమకలు పెట్టిం దనవచ్చు శబ్దరత్నాకరకారులు జీడిమామిడి అన్న పదానికి మోంటి అనే సంస్కృతపద మిచ్చి దీని కాయలలోనిదే చాఱపప్పు అన్నారు చాఱపప్పు అనే పదం అర్థంలో జీడిమామిడి గింజలోని పప్పు అన్నారు. చాఱపప్పు వేరు, జీడిమామిడిపప్పు వేరు ఇవి రెండూ వేరే వేరే జాతి చెట్లు.

రైలు ప్రయాణం చేసేటప్పుడు 'జీడిపప్పో, జీడిపప్పండి!' అని కేక లతో మన చెవులు అదిరిపోతాయి ఈ చెట్లు కోస్తా అంతటాను, చిట్టగాంగు

ప్రాంతాలలోనూ, బర్మాలోని టెన్నాసిరం రాష్ట్రంలోను, అండమాన్‌లోను, దక్షిణాది అంతటాను నేడు విపరీతంగా పెరుగుతాయి. కాని యిది దక్షిణ అమెరికా నుంచి తెచ్చిన-ముఖ్యంగా పశ్చిమ ఇండియా దీవులనుంచి వ్యాపించిన మొక్క అని వృక్షశాస్త్రజ్ఞులు అంటున్నారు

బ్రాజిల్‌లో దీనిని "అకాజూ" అంటారట. ఇది పోర్చుగల్ వారి నోట కాజూ అని, ఫ్రెంచివారి నోట కాషూ అని మారింది బుడతకీచులు దీనిని మన దేశానికి - పాశ్చాత్య దేశాలకు కూడా తెచ్చారు. వారినుంచి మొదట ఈ పదం కొంకణ-కర్ణాటకానికి కాజూ అనే రూపంతోనే దిగుమతి అయి, ఉత్తర భారతమంతటా ఆ పేరుతోనే వ్యాపించింది.

మనం ఈ పేరుతో దీనిని గ్రహించక జాతీయం చేసుకొని, మామిడి పండు పోలికనుబట్టి జీడిమామిడి అన్నాము; జీడిగుణాలు, మామిడిపండు ఆకారం వున్నాయి గనుక, ముంతలాగ వుంది గనుక ముంతమామిడి అన్నాము. కన్నడులు కెంపుగేరు-ఎర్రజీడి అన్నారు; నల్లజీడి ఆదివరకు వారికి తెలుసు గనుక, గేరుమావు అని కూడా అన్నారు. అంటే జీడిమామిడి అన్నమాట. మలయాళీలు కశుమావు - జీడిమామిడి అని, పరంమావు-పరంగిమామిడి అని అన్నారు తమిళులు ముందిరికొట్టై, కొట్టై ముందిరి-ముందు విత్తనం కనిపించేది అని కాబోలు - అన్నారు.

ఇది విదేశీయ మనడానికి హంసవింశతి వంటి అర్వాచీనులు దీనిని ప్రయోగించడం నిదర్శనం: "బ్రహ్మమేడియు జీడిమామిడియు."

జీడికున్న గుణాలనుబట్టి మామిడి టెంకలోని పప్పును, పుండు చేసే మామిడి పాలను కూడా జీడి అంటున్నాము.

కాని జీడి, జీడె, జీడియ అనే తినుబండారం జీడినుంచి వచ్చింది కాదుసుమా! దీనికి దీని సమానార్థకమైన తమిళులోని సీడై మున్నగు వాటికి అల్పార్థకమైన సిరు, చిరు అన్నవి మూలం కావచ్చు. లేక జీడిలాగ అంటుకుంటుంది గనుక ఈ పేరు వచ్చి వుండవచ్చు.

# పాడి - పంట



పాడి, పంట ఒక్కటే అని మనం అంటే నవ్వివోతారు జనం. పాడి పాలకు, పంట ధాన్యాదుల ఫలితానికి వాడుతుండగా రెండూ ఒక్కటే ఎలా అవుతాయి? వెర్రి పట్టిందా?—అని అడగనూవచ్చు. కాని, ఈ రెండే కాదు; పండు, ప్రాలు, పళిగ, పన్ను వంటి మరికొన్ని పదాలుకూడా మొదట్లో ఒక్కటిగా వుండి క్రమంగా వేరే వేరే వస్తువులను సూచిస్తూ, నేడు పూర్తిగా ఒకదాని కొకటి సంబంధం లేనివయ్యాయి.

కాని, చూచాయగా వున్న వీటి సాదృశ్యాన్నిబట్టి వెదుక్కుంటూ వెళ్ళితే వీటన్నిటి మూలం 'పఌ', 'పణ్' అనే వని తేలిపోతుంది. ఈ రెండు పదాలూ ధ్వన్యనుకరణవాచకాలు.

ఏ వస్తువైనా పైనుంచి పడినప్పుడు వస్తు పరిమాణాన్ని, పతన వేగాన్ని, పడే స్థలం ఉపరితలాన్నిబట్టి ధ్వని కలుగుతుంటుంది. మన పూర్వులు చెట్లనుంచి పండి రాలిన వస్తువులను మొదట చూచినప్పుడు వింత అనుభవం పొందివుంటారు. పండి రాలి ఎండిన ఆకుల మధ్యన ఆరముగ్గిన పండ్లు పడినప్పుడు 'పఌ పఌ' అనే చప్పుడులా వినిపించి వుంటుంది మన వారికి. పడగా చూచినదానికి 'పఌ' 'పఌం' అని గుర్తు పెట్టుకునివుంటారు. 'పళ పళ రాలు' అనే వ్యవహారం మనకు వుండనే వుంది.

తమిళ, కన్నడ, మలయాళాలలో కనిపించే 'ఌ' వర్ణం మనకూ పూర్వం వుండేది. ఇది క్రమంగా కన్నడంలోను, తెలుగులోను ఱ, డ, ణ, య, ళ, లు గాను, కొన్నిచోట్ల క్రావడిగాను మారిపోయింది.

తమిళ,కన్నడ,మలయాళాలలో పళ్ళ శబ్దానికి పాత, చితికిన, ముసలి దైన పండిన అనే అర్థాలున్నాయి. ఈ అర్థాల క్రమ పరిణామాన్ని పరిశీలిస్తే మనవారి జ్ఞాన వికాసం, పదజాలవికాసం తెలుస్తాయి.

మొదట ధ్వన్యనుకరణ వాచకమైన 'పళ్ళ' పండు అనే అర్థంలో స్థిర పడిన తర్వాత తక్కిన అర్థాలు వచ్చి వుంటాయి. పండు రాలితేగాని చిత కదు; చితికిందేమో పండి రాలివుండాలి. పండి రాలినది పాతది కాక మరే మవుతుంది?

ఈ అర్థాలనుబట్టే తెనుగులో 'పళ్ళ' రకరకాలుగా మారింది. ఆ తర్వాత వున్న ళ్ష వెనక్కువెళ్లి రేఫమై 'ప్రా' అయింది; కొళ్షవి క్రోవి అయినట్టు. ప్రాకు 'లు' చేరి ప్రాలు అయింది. బియ్యం అనే అర్థం రూఢ మయింది. ప్రా భావార్థకమైన 'త' చేర్చుకుని ప్రాంత, ప్రాంత అయ్యింది. మధ్య అనునాసిక ధ్వని ఎలా వచ్చిందో,ఏ పరిస్థితిలో వచ్చిందో చెప్పలేము. కాని, ళ్ష అనునాసిక సహిత రేఫంగా మారడం మరి కొన్నింటిలోను కనిపి స్తున్నది. కుళ్షగు - క్రుంగు; ముళ్షగు - మునుంగు, మునుగు, బ్రుంగు.

ఏ సంగతైనా పాతది కాగానే వాడుకై పోతుంది పళ్ష, పళ్షక, పళ్షక్కం అయి, వళ్షిగై, వాడికై, వాడుక, బాడుగ అయింది. ఇక్కడ ళ్ష కోళ్షి కోడిగా మారినట్టు డ గా మారింది.

పళ్షలోని ళ్ష అగా మారి పఱగ అయింది. పాత ఆకు అని కన్న డంలో వాడుకకు వచ్చి, మనకు పఱిగ అయింది.

ళ్ష ఒత్తి పలకడంలో ఏర్పడిన ణకారం ప్రబలమైనపుడు 'పణ్' అనే మరొక పదం రూపుదాల్చింది. దీనికి పండు, పండగు అని కన్నడంలో అర్థాలు. పణ్‌లోని 'ణ్' కారం ఉచ్చారణ సౌకర్యంకోసం "ణ్ణు" అయింది. కణ్, కను, కన్ను; మిన్, మిను, మిన్ను; వెన్, వెను, వెన్ను లాగ. అప్పుడు పణు, పణ్ణు, పను, పన్ను అనే మాటలు పుట్టాయి. పణ్‌లోని 'ణ్' మారడం తెనుగుభాష విశిష్టతలో ఒక ఘట్టం. రామన్, రామను, రామన్ను, రామండు, రాముండులాగ పణ్ శబ్దం పణ్ణు, పండు అయింది.

కన్నడంలో పణ్ణు అనేమాట మిగిలింది; దాని తర్వాతి రూపమైన పండు మనకు మిగిలింది. కన్నడంలో పణ్ణుకు పండు, పండగు, సిద్ధంచేయు, పేర్చు, అలంకరించు అనే అర్థాలున్నాయి. తమిళ మలయాళాలలో పణ్ణుకు చేయు, తయారుచేయు, తీర్చు అనే అర్థాలున్నాయి.

పండు సహజంగా తయారయిన వస్తువు. దానినిబట్టి తయారుచేయు, పనిచేయు, పని అన్న అర్థాలు పుట్టాయి మనం పన్నును కుట్రకు మాత్రమే వాడుతాము. బాగా తీర్చినపని అన్నమాట. పణ్, పన్, కొంచెం మార్పుతో పని అయి చేత అనే అర్థంలో తెలుగులోను, పణి అని మలయాళంలోను నిలిచాయి

పణ్ 'త' తో చేరి పంత, పంట అయింది; మన్ - మంత - మంట లాగ. పండు సామాన్య వాచకమైంది (వ్యవహారంలో వస్త్ర పోతలలో ఈ త మిగిలింది )

పండ్ల అనుభవమున్న మనవారు పశుపాలనం ప్రారంభించిన తర్వాత పణ్‌ను దీర్ఘంచేసి ఒత్తిపలకడంలో - ఊడడంలో, పాణ్ - పాండి, పాఁడి, పడ్డ అయింది; వేణ్. వెండి, వేఁడి వెట్ట అయినట్టు. పాలు అనే అర్థం రావడానికి కొంత తంతు జరిగి వుంటుంది ఈనడానికి సిద్ధమైన ఆవును మొదట ఫలించబోయేది, పండబోయేది అనే అర్థంలో పణ్, పంద, పడ్డ అని మనవారు వ్యవహరించి వుంటారు. కన్నడంలో పడ్డె, పడ్డ, ఫలించి, ఈని ఇచ్చే వస్తువును పాండి, పాఁడి అని అంటారు.

కాగా, ఫలించే వాటి కన్నిటికీ మనవారు వాడిన పదాలన్నిటి మూలం ఒక్కటే.

సంస్కృతంలోను, ఫల, పాక, పక్వ అనే పదాలుకూడా ధ్వన్యనుకరణ వాచకాలే.

పణ్, పక్ష్, అనే పదాల మూలం వేరనేవారు వీటి సాదృశ్యాన్ని, పైన పేర్కొన్న పరిణామాన్ని గుర్తించవలసి వుంది.

# కరాంబువు



చిరుతొండనంబి తన కుమారుడైన సిరియాళుని పశుపతికి వండిపెట్టిన కథ మనకు తెలిసిందే. (ఇది మానవాదుల నాగరికతకు చిహ్నమేమో!) సిరియాళుని మాంసాన్ని అతని తల్లి, పరిచారిక కటికగుండెతో ఎట్లు వండిందీ శ్రీనాథుడు హరవిలాసంలో ఈ విధంగా వర్ణించాడు:

"మిరియము నుల్లియుం బసపు
మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గ
రాంబువు గమ్మని నేయి తైలమున్
బెరుగును మేళవించి కడు
బెక్కు విధంబుల బాకశుద్ధి వం
డిరి సిరియాళునిం గటికి
డెందమునం దరళాక్షు లిద్దరున్" (2-120)

సిరియాళునిమాంసాన్ని మసాలాదినుసులతో రకరకాలుగా వండారట. మిరియం, ఉల్లి మొదలైనవి మనకు బాగా తెలిసిన సంబరువులే. కొత్తగా కనిపించే పదం ఒక్క కరాంబువు మాత్రమే. కరాంబువంటే లవంగాలు.

మన తెలుగు నిఘంటువు లేవీ ఈ శ్రీనాథ ప్రయోగాన్ని ఉదాహరించలేదు. శబ్దరత్నాకరకారులు కరాపువు అనే పదమిచ్చి, వైకృతమని తెలిపి, లవంగం అనే అర్థ మిచ్చారు. వైకృతమంటే ప్రాకృత సమం, సంస్కృత ప్రాకృత భవం అయిన పద మన్నమాట. బ్రౌను పండితుడు తన రెండు (తెనుగు, మిశ్రభాషా)నిఘంటువులలోను ఈ పదాన్ని గ్రహించలేదు. శబ్దార్థ చంద్రికాకారులు దీనిని తద్భవంగా గ్రహించి లవంగమనే

అర్థమిచ్చారు. సూర్యారాయ నిఘంటువుకారులు మరొక అడుగు ముందుకు వేసి, కారముగల పూవు కరాపువు అని వ్యాఖ్యచేసి శబ్దరత్నాకరకారుని ఉదాహరించారు. వావిళ్ళ నిఘంటువులోను కారముగల పూవు అనే వివరణ యివ్వబడింది. (ఈ నాలుగు నిఘంటువులు హరవిలాస ప్రయోగ మివ్వ లేదు.) కరాంబువు కారంగల వస్తువన్నమాట నిజమే. కాని, దాని కి పేరు వచ్చిన కారణం వేరు.

లవంగాల తొలిపుట్టుక ఆగ్నేయాసియాలోని మొలక్కా దీవులని, తర్వాత అవి దక్షిణ భారతానికి, పిదప యావదుష్ణమండల ప్రాంతాలకు వ్యాపించాయని వృక్షశాస్త్రజ్ఞు లంటున్నారు. ఒకప్పుడు ఈ లవంగాలు పండే ప్రాంతాలు డచ్చివారి స్వాధీనంలోకి వచ్చినప్పుడు లవంగాలను ఆంబోయ్నా ద్వీపాలలో తప్ప మరెక్కడా ఇతరులు పండించుకోకూడదని చూచారట. కాని ఈ పంట భారతదేశానికి, ఇతర ఉష్ణమండల ద్వీపాలకూ ప్రాకడం ఆగలేదు.

లవంగాలు మనకు ఎన్నో శతాబ్దాలుగా తెలుసు. కాళిదాసు 'ద్వీపాంతరానీత లవంగ పుష్పైః' అని వర్ణించాడు (రఘు 6-57) ఇది ఎప్పుడూ పచ్చగా ఉండేది గనుక శ్రీసంజ్ఞం, లక్ష్మీకరం అని, అన్యద్వీపాలనుంచి వచ్చే అపూర్వ కుసుమం గనుక దేవకుసుమ మని మనవారన్నారు. లవంగానికి దేవకుసుమం, శ్రీసంజ్ఞం అని అమరకారుడు పర్యాయాలుగా యిచ్చాడు. లూయతే - కోయబడేది; లునాతిశ్లేష్మం-కఫాన్ని కోస్తుంది అని లవంగానికి వ్యుత్పత్తి చెప్పారు. లుఞ్ ధాతువుపై అంగచ్ ప్రత్యయ మన్నారు. రాజనిఘంటుకారుడు లవం, వారిసంభవం అనే పర్యాయాలిచ్చాడు. వారిసంభవం అంటే ద్వీపాంతరంనుంచి వచ్చిందనే ధ్వని ఉంది కదా!

నేడు ఉత్తర భారత భాషలలో వాడుకలో వున్న లవంగ, లంగ (బెంగాలీ), లోంగ్, లవుంగ్, లబంగ్ (హిందీ), లౌంగ్, కరన్‌ఫుల్ (పంజాబీ), రవుంగ్ (కాశ్మీరీ), లవంగ్, లవింగ్ (మరాఠీ, గుజరాతీ) అనే పదాలన్నీ లవంగశబ్దం భ్రష్టరూపాలే.

దక్షిణభారతంలోను లవంగ పదానికే ప్రాచుర్యం. కాని తమిళంలో కరాంబు, కిరాంబు కరువాపూ అనేవి; మలయాళంలో కరయాంబు, కరాంబు అనే పదాలు కూడా వాడుకలో వున్నాయి. తమిళ నిఘంటుకారులు దీనిని ఉరుదూ పదంగా పేర్కొన్నారు. పార్సీలో దీనికి మెఖాక్ అని పేరు. ఇది మొలుక్కా భ్రష్టరూపమై వుంటుంది.

గ్రీకులో దీనిపేరు కార్యోఫుల్లోన్. కార్యోన్ అంటే కర్ణిక, ఫుల్లోన్ ఆకు. ఇది లవంగపు పూల ఆకారాన్నిబట్టి ఏర్పడిన మాట అయివుంటుంది. ఇది యూరోపియన్ భాషలలో జిరోఫిల్, గిరోఫల్, జిలోఫిల్, జిరోఫిర్, గారోఫిరో, జూలైఫ్లవర్ అని రకరకాలుగా భ్రష్టమైంది. ఈ కర్యోఫుల్లోన్ అరబ్బీలో చేరి, ముస్లిముల ద్వారా తమిళ మలయాళాలలో కరాంబు, క్రాంబు-మొదలయిన రూపాలతో ప్రవేశించి వుంటుంది. శ్రీనాథుడు కంచికి వెళ్ళినప్పుడు అక్కడ వ్యవహారంలో వున్న ఈ చక్కని పదాన్ని గుర్తించి ప్రయోగించాడు ఇది తమిళ మలయాళాలకు కూడా యిటీవలిదే ననడానికి కన్నడంలో ఈ పదం కానరాక పోవడమే నిదర్శనం. కరన్ఫుల్ అనే పంజాబీ మాట కూడా ముస్లింలు తెచ్చిందే.

ఈ లవంగ శబ్దానికి మనవారు చెప్పిన వ్యుత్పత్తి తర్వాత కల్పించిందే నని అనుమానించవచ్చు. ఇది కాళిదాసు కాలానికే ద్వీపాంతరానీతం కనుక ఆగ్నేయాసియాలో ఇది పండే మొలుక్కా, అంబోయ్నా, సుమత్రా దీవులలోని ఏ ప్రాంతం పేరునో తెచ్చుకొని ప్రచారంలోకి వచ్చి వుంటుంది. లంగ, లింగ, లాబాన్‌వంటి పేర్లుగల ద్వీపాలు, పట్టణాలు ఆ ప్రాంతాల్లో చాలా వున్నవి.

ఇలాటిదే మరొక మాటను ఉదాహరిస్తాను. ఓమం అనే మాటకు సంస్కృత పర్యాయాలలో ఒక్కటి 'అజామోద' అనేది. దీనికి మేకవాసన కొట్టేది అని పండితులు అర్థం చెప్పారు (అజ + ఆమోద అని). ఓమం మేకవాసన కొడుతుందంటే ఎవరైనా నవ్వరూ? మరికొన్ని సుగంధ ద్రవ్యాల లాగే యిదీ అరేబియాలోని అజా(ర్)మత్ అనే ఒక ప్రాంతం నుంచి వచ్చింది. అజా(ర్)మత్, అజామత్, అజామద, అజామోద-అని మారింది.

# చెవిలో ఇల్లు



ఇల్లు కట్టిచూడు. పెళ్ళి చేసిచూడు—అన్నది సామెత. ఇల్లు, పెళ్ళి మానవ జీవితంలో అతి ముఖ్య విషయాలు. ఇల్లు మనడానికి అవసరమైతే, పెళ్ళి (ఇల్లాలు) మనగడకే అవసరం.

మనుగడకు మొదట మనికి ముఖ్యం గనుక, ఇల్లు ప్రధానావశ్యకాలలో ఒకటి. 'తిన తిండి, కట్ట గుడ్డ, మన నిల్లు అందరికీ కల్పిస్తాం మా రాజ్యంలో' అని రాజకీయ నాయకులు వోట్ల కోసం జనసామాన్యాన్ని మభ్యపెడుతుండడం మనం రోజూ చూస్తూనే వున్నాం. నిరాశ్రయులుగా ఉన్న వారిని 'ఇల్లు లేదు, వాకిలీ లేదు; పెళ్ళీ లేదు, పెటాకులూ లేదు' అని ఎగసక్కెమాడడం (అజ్ఞానంకొద్దీ) కద్దు

ఈ కాలంలో పెళ్ళి చేసుకోడం, ఇల్లు కట్టడం సులభంగా వున్నాయేమో కాని, పూర్వం వీటికోసం పడే తాపత్రయం యింతా అంతా కాదు. ఇల్లు కట్టడమంటే మహా యజ్ఞం. నచ్చిన స్థలం కావాలి. ఇరుగు, పొరుగు తనకు కావలసిన వారుండాలి. మంచికీ, చెడుకూ అదుకొనేవారుగా వుండాలి. కనుకనే మన పాతవూళ్ళలోను, పేటలలోను కొన్ని కులాలవారు తరచు ఒకే ప్రాంతంలో ఉండడం చూస్తున్నాం. ఒక వూళ్ళో స్థిరపడడమంటే సుమతి శతక కర్త చెప్పినట్టు "అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎప్పుడు నెడతెగక పారు నేరును, ద్విజుడున్ చొప్పడిన యూరు" చూచుకునేవారు.

ఇలా 'చొప్పడిన' వూరు చూచి స్థిరపడ్డారంటే యిక కదిలేవారు కారు. ఇళ్ళు మార్చడం, ఊళ్ళు మార్చడం వారికి పిల్లి కాపురం. ద్రవిడ జాతులలో తక్కిన వాటికంటే ముందుగా స్థిరపడిపోయింది కాబోలు తెలుగు జాతి – ఉన్న వూరంటే అభిమానం ఎక్కువ. "పొరుగూరి పది రూపా

యలకన్నా ఉన్నవూరి రూపాయే మెరుగు" అని యిల్లు కదలక, కడుపులో చల్ల కదలక ఉన్నచోటనే పడివుండే స్వభావం మన విశిష్టత. ఇది నేడు క్రమంగా తొలగుతున్నది.

ఇల్లు కట్టడమే యింత కష్టమయితే. గుళ్ళు, కోటలు కట్టడంలో గల చిక్కు, శాశ్వతత్వదృష్టి చెప్పనక్కరలేదు. కనుకనే. హాస్యానికైనా, "ఇంటికన్నా గుడి భద్రం" అనే సామెత పుట్టింది.

ఇంతవరకూ చెప్పడంలో ఉద్దేశం యిల్లు కట్టడం, ఇల్లు కట్టుకుని కూచోడం అనేవి స్థిరపడడం అని వివరించడానికే జీవిత సంపాదన నంతా, శ్రమనంతా ధారపోసి కట్టిన యిల్లు వదలడమంటూ ఉండదు మరి.

అయినప్పుడు చెవిలో యిల్లు కట్టుకొనడం అంటే చెవిలో స్థిరంగా కూచోడం అన్నమాట. మామూలు యిల్లు కట్టుకొనడానికే యింత యిబ్బంది పడవలసి వచ్చినప్పుడు చెవిలో యిల్లంటే ...?

మనకు "చెవి"తో సంబంధించిన నానుడులు కొల్లలుగా వున్నాయి— చెవి కొరుకు, చెవియారు, చెవులారు, చెవిబడు, చెవిబెట్టు, చెవియొగ్గు, చెవి వ్రేలవేయు, చెవుల పండువు, చెవికరచు - మున్నగునవి.

చెవిలో యిల్లు గట్టుకొనడం అంటే ఒక ఊరిలో మకాంవేసి కదల నట్టే, చెవి దగ్గర చేరి విపరీతంగా చెప్పి, నూరిపోసి, ఒప్పించడ మన్న మాట. "చెవిలో యిల్లు కట్టుకు పోరినా, వినడండీ!" అంటారు, ఎంత చెప్పినా పెడచెవి బెట్టేవాణ్ణి చూచి. "కొడుకు యింటికి వచ్చాడో లేదో, చెవిలో యిల్లు కట్టుకుని చెప్పడం ప్రారంభిస్తుంది కోడలిమీద!" అంటారు ఎప్పుడూ కోడలిపై పితూరీలుచెప్పే అత్తగారిని చూచి.

నిరంతరం చెప్పి ఒప్పించడం అనే అర్థంలోనే మన ప్రాచీనులు దీనిని ప్రయోగించారు సుగ్రీవవిజయంలో రుద్రకవి యిలా వర్ణిస్తాడు:

వాలి వధ తర్వాత సుగ్రీవుడు విజయ గర్వంతో కిష్కింధకు వెళ్లతాడు ఆయనను చూడడానికి వచ్చిన జనం పలు పలు విధాలుగా అనుకుంటారు:

"జంపె:

కట కటా! ఏల నిష్కారణము జంపె నీ
కుటిలునకు నా వాలి కువలయేశ్వరుడు?
చెవి నిలు గట్టుకుని చెప్పి చంపించె నీ
రవిసుతుండే ద్రోహి రాము డేమెరుగు?"

"ఎల్లవేళల నేం జెవి నిల్లు గట్టి,
విన్నపము చేయు నా మాట వినవు నీవు" (మొల్లరామా, యుద్ధ.)

మంచిని పదిసార్లు చెప్పి ఒప్పించినట్టే అబద్ధాన్నయినా పదిసార్లు చెప్పి నిబద్ధిచేయవచ్చు కొంతకాలంవరకు. ఇది హిట్లరు, గోబెల్సు అనుసరించిన విధానం. నిలకడమీద నిజం తెలిసిన తర్వాత అబద్ధం బట్టబయలవుతుంది.

చెవిలో యిల్లు గట్టుకొని చెప్పడమంటే పదే పదే బోధించడ మన్న మాట. ఇల్లు స్థిరంగా ఉన్నట్టు ఎదుటివాని మనస్సును, బుద్ధిని మనవైపు స్థిరపరచుకోడమన్న మాట.



# సీతాఫలప్పండు



సీతాఫలం, రామాఫలం ఎంత తియ్యని పండు! మనను కళ్లతోనే పిలుస్తున్నట్లుంటాయి అవి. ఆలంకారికులు ద్రాక్షాపాక మన్నారు. కాని, సీతాఫలపాక మనివుంటే ఎంతో బాగుండేది!

ఈ సీతాఫలం తెనుగునాడులో, ముఖ్యంగా తెలంగాణా, రాయలసీమలలో వన్యస్థితిలో కనిపిస్తుంది. మన రాజధాని హైదరాబాద్ నగరంలో ఒక పేటకు సీతాఫల్ మండి అనే పేరు. సీతాఫలం రామాఫలం అనే పేర్లు అచ్చంగా సంస్కృతంవే గనుక యివి మన దేశంవే నని భావించడం సహజం కాని నిజం వేరు.

వృక్ష శాస్త్రజ్ఞులు యివి మన దేశంవి కావని స్పష్టంగా తెలుపుతున్నారు "అజంతాలో సీతాఫల చిత్రాలు, శిల్పాలు, బార్హుత్‌స్తూపంలో సీతాఫలం శిల్పాలు, మధురలో దీని శిల్పాలు కనిపిస్తున్నాయి. ఇంతేకాక వీటికి దేవతలపేర్లు ఉండడమే యివి దేశీయ మనడానికి నిదర్శనం." అని కొందరి వాదం "అబ్బే! అజంతా, మధుర బార్హుత్‌స్తూపాలలో కనిపించే శిల్పచిత్రాలు పనసపండువేకాని సీతాఫలంవి కావు. పనసను చూచి సీతాఫల మని మోసపోకండి రుచ్యమైన అన్ని పళ్ళకూ పేర్లేవో ఉండగా, వీటికే దేవతల పేర్లెందుకు? అన్యదేశ్యాలు కనుకనే వీటి కా పేరు పెట్టారు భయంకరంగా ఉండేవాటిని రాక్షసుల పేర్లతోను, అందంగాను, రుచిగాను ఉండే వాటిని దేవతల పేర్లతోను వ్యవహరించడం మన అలవాటు; రాకాసి మట్టలు, రాక్షసిబొగ్గు, రావణాసురుని గడ్డం, రావణాసురుని మీసాలు-లాగ" అని మరికొందరి వాదం. మన దేశంలోను, ఇతరాత్రాను దీనికున్న పేర్లను పరిశీలిస్తే నిజం తేలుతుందేమో చూద్దాం

షరీఫా, ఆట్, ఆటా, సీతాఫల్, లౌనా - హిందీ గుజరాతీ, మరాఠీ. షరీఫా, ఆటా-అరబ్బీ. షరీఫా, బేహ్లీ - సరిహద్దు రాష్ట్రం. ఆటా, లూనా, నోనా (సీతాఫల్, రామాఫల్ ) - బెంగాలీ. ఆటా, కాటాల్ - అస్సామీ, షరీఫా, కాజ్ - పార్సీ. అవుజా, అజ్జా - బర్మీ సీతాఫలం - కన్నడం, తమిళం. సీతాఫలం, సీతాఫలప్పండు - తెనుగు. మొత్తంమీద భారతదేశ మంతటా ప్రచురంగా వ్యవహారంలో ఉండేమాట సీతాఫలం

పాశ్చాత్య వృక్షశాస్త్రజ్ఞులు దీనిని అనోనాజాతి పండ్లంటారు. అనోనా రెటెకులటా - రామాఫలం. అనోనా స్క్వామోనా - సీతాఫలం. ఈ అనోనా అనే మాట మలయాలో వీటికి వ్యవహారంలో వున్న మనోవా అనేదాని వికృతరూపమని కొందరంటున్నారు. బండా ద్వీపాలలో దీనిని మెనోవా అంటారట. "అన్నోనా అనే లాటిన్ మాటనుంచి యిది వచ్చింది. హాయన అనే సంస్కృత పదానికి సమానమైన అన్నస్ అనే పదమే అన్నోనాకు మూలం. అన్నోనా సంవత్సర ఫలం. సీతాఫలం సంవత్సరానికొక సారి పండుతుంది గనుక ఈ పేరు." అని అతిపాశ్చాత్యవాదు లంటారు.

పాశ్చాత్యుల వాదం ఎలా ఉన్నా, యిది మన సాహిత్యంలో ఉదాహరించబడిందా అంటే, కనిపించదు నామలింగానుశాసనంలాంటి ప్రాచీన నిఘంటువుగాని, మొన్న మొన్నటి వాచస్పత్యంకాని వీటిని పేర్కొనలేదు. ఇటీవలి ఆప్టే మాత్రం తన సంస్కృతాంగ్ల నిఘంటువులో యిచ్చాడు.

ఇక తెనుగు సాహిత్యంలో దీనిని ప్రాచీన కవులు పేర్కొన్నట్టు లేదు. ప్రజాజీవితాన్ని ఎక్కువగా తన రచనలలో ప్రతిఫలింపజేసిన పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పెక్కుపండ్లు చెప్పాడు. కాని వాటిలో సీతాఫలం లేదు. తెలంగాణాలో అంత విరివిగా వన్యస్థితిలోను. పొదల్లాగాను నేడు కనిపిస్తున్న సీతాఫలం సోమనాథుని కాలానికి ఉంటే, అడవి గొగ్గిపండ్లులాంటివి కూడా చెప్పినవాడు, సీతాఫలం వంటి మధుర ఫలాన్ని వదులుతాడా! కబీరు, తులసీదాసువంటి ప్రజాకవులు దీనిని పేర్కొన్నట్టు లేదు.

కనుక యిది మన దేశంది కాదనే వాదమే సమంజసంగా కనిపిస్తుంది. బెంగాలీలో నోనా, ఆటా అని; హిందీలో లొనా అని ఈ జాతికి పేర్లుండడం చూడగా యివి అనోనా, అనోనా స్క్వామోనా అనే విదేశీపదాల తద్భవాలనే తోస్తుంది: అనోనా అనేది నోనా, లొనా కావడం ఆశ్చర్యం కాదు. రెటెకులటాలోని ఆటా మిగలటం అంతకన్నా అబ్బురం కాదు. ఇది ఉత్తర అమెరికా నుంచి, పశ్చిమ ఇండీస్ దీవులనుంచి దక్షిణ అమెరికాకు, అక్కడి నుంచి యూరప్‌కు వచ్చి బుడతకీచుల ద్వారా మన దేశానికి వచ్చిందనే వాదమే అంగీకరిద్దాం. అయితే సీతాఫలం అనే పేరుకు కారణమేమై వుంటుంది?

దీన్ని బుడతకీచులు మన దేశానికి తెచ్చారని అనుకున్నాం కదా; ఆ తేవడం ఉత్తర భారతానికి తెచ్చారు. సీతాఫలం పైబెరడు చెక్కులు చెక్కులుగా, కళ్లు కళ్లుగా చుక్కలు చుక్కలుగా వుంటుంది కదూ! సీతాఫలాంలో కొన్ని రకాల బెరడు కళ్ళపై ఊదారంగు చుక్కలు, లేబసరు రంగు చుక్కలు ఉండడం అందరికీ తెలిసిందే. బాగా మాగితే నల్లటి చుక్కలు పడడంకూడా అందరూ చూచిందే హిందీలో - ఉత్తర భారత భాషలన్నిటిలోను ఛీంటా చీంటా అంటే మచ్చ, తేప, బుడగ, చుక్క, బొట్టు అన్న అర్థాలున్నాయి ఈ పండును ఉత్తరాదివారు "ఛీంటాఫల్, చీంతాఫల్" అని మొదట వ్యవహరించి వుంటారు అంటే పెచ్చులు పెచ్చులు, బుడగలు బుడగలు, చుక్కలు చుక్కలు ఉన్న పండు అన్న మాట. అదేదో వికారంగా ఉందనో, అంత రుచ్యమైన పండుకు యిలాటి మచ్చల పేరు ఎందుకనో దీనిని సీతాఫల్ అని దేవతా నామధేయంతో ఎవరో సంస్కరించి వుంటారు! లేక వ్యవహారంలో ఉచ్చారణ వేగంలో సీతాఫల్ అని మారి, అప్పటినుంచి దీనికి ఈ పేరు పడి వుంటుంది.

చిన్నపండు సీతాఫలమైతే పెద్దజాతిపండు ఏమౌతుంది? రామాఫలం అన్నారు. సీతాఫలంకన్న చిన్నదైన ఈ జాతి మరొక పండును లక్ష్మణఫల

మన్నారు. మనకు సీతాఫలం, రామాఫలం అనేవి ప్రాతిపదికములైనవి దాని తర్వాత పండు అని చేర్చి సీతాఫలప్పండు, రామాఫలప్పండు అని వ్యవహరిస్తున్నాము. "సీతాఫలప్పండ్లో" అనే కేకలు శీతకాలంలో (ఈ పళ్ళ కాలంలో) మనం మన పట్టణ వీధుల్లోనూ వింటుంటాము

శీతకాలంలో వచ్చేపండ్లు గనుక శీతాఫలం అనే పేరు వచ్చివుండ గూడదా? - అని ఒక వాణిజ్యవేత్త అన్నారు. నిజమే. కాలం, దేశం, పోలిక మున్నగువాటినిబట్టి, వస్తువులకు రకరకాల పేర్లు రావడం సహేతుకమే కాని, ఇది విదేశీయం కదా? ఛీంటా, చీటా అనే పదాల సంస్కృతీకరణమే సంభవ మనడానికి అవకాశం ఎక్కువ.



# పొంగలి - పులగం



పొంగలి చవిని గురించి వేరే చెప్పనక్కరలేదు. దాని పేరు వినగానే మనకు నోరూరడం సహజం. దానితోపాటు సంక్రాంతి పండుగతో ముగిసే ధనుర్మాసం మన కిట్టెదుట నిలచి, "రంగడే దైవం. పొంగలే ప్రసాదం" అనే సామెతను కూడా అప్రయత్నంగా మన నోటినుంచి వెలువరించడం కద్దు కాని నిజానికి పొంగలికీ, రంగనికీ కలిగిన పొత్తు అంత పాతది కాదు.

మన తక్కిన పండుగలలాగే సంక్రాంతి - పొంగలి - పండుగ కూడా మన పూర్వుల పంటల పండగే ఇది మనకు అంతా యింతా పండుగ కాదు: పెద్ద పండగ పరిశ్రమాజీవులైన మనవారు తాము పండించుకున్న పెద్ద పంటలను - ధాన్యాలు, కూరలు, కాయలు, పండ్లు మున్నగు వాటిని - విజయోత్సాహంతో పొంగించి, వండుకుని పంచభూతాలను తనియించి, తాము తనిసి, భోగి (పోగి) మంటల వెలుగులో గొబ్బితో, గొండ్లితో పొంగి మైమరచిన పండుగ యిది. ఈ పొంగుల ఫలితమే ఈ పొంగలి.

ఇంత పెద్ద పండుగను మన ప్రాచీనకవులు వర్ణించక పోవడం వింతగానే వుంది. పాల్కురికి సోమనాథుడు మాత్రం బసవపురాణంలో పులగాన్ని గురించి, పండితారాధ్య చరిత్రలో - "పదములు వాళెు పదములు గొబ్బి పదములు" అని గొబ్బిని గురించి ఉల్లేఖించాడు.

ఈ పొంగలి - పులగం, గొబ్బి - కుమ్మి అవినాభావ సంబంధంకల జంటలు. వీటిలో పొంగలి - పులగం ఒక వస్తువును తెలిపే ఒకే మాటకు

రెండు రూపాలు. గొబ్బి-కుమ్మి కూడా యిలాంటివే. వీటన్నిటికీ ధ్వన్యను కరణమే మూలం. గొబ్బి - కుమ్మిని గురించి యిదివరకే చదివారు.

ధ్వన్యనుకరణ శబ్దాలు ప్రాంతీయ భేదాలనుబట్టి రకరకాలుగా ఏర్పడు తుంటాయి. ఒకరు కాలుజారి కింద పడ్డారనకోండి. అప్పుడొక చప్పు డౌతుంది. దానిని వివిధ ప్రాంతాల భాషలవారు వివిధ రీతులుగా అనుక రిస్తారు: - ఢభీమని పడ్డాడు, దభాలున పడ్డాడు, ధమ్మంత బిద్ద, ధఢాంసే గిర్పడా - యిలా రకరకాలుగా.

ఇలాగే మన పూర్వులు ఆహార పదార్థాలను ఉడికించేటప్పుడు కలిగిన ధ్వని "పుక్ పుక్, పుకు పుకు, బుసు బుసు, బుసబుస" మున్నగు రీతులుగా వినవచ్చి వుంటుంది. ఈ ధ్వన్యనుకరణసూచి కాల్చు, వండు, పొంగు, పొక్కు, అభివృద్ధిపొందు, పొగరుపడు, పొడవగు, కంపుపట్టు, బుగ్గ, పొగ మున్నగు అర్థాలు వచ్చే పెక్కు మాటలు - వినాశాన్ని, దానికి విరుద్ధమైన అభివృద్ధినీ సూచించేవి పుట్టాయి

కన్నడంలో పొంగలి, పులగం అనే అర్థంలో పుక్కిగి. పుగ్గి పుగ్గె, పొంగలు అనే మాటలున్నాయి వీటితో ధ్వని సామ్యం గల మరికొన్ని పదాలకు కాల్చు, పొంగు అనే నిప్పు పనికి సంబంధించిన అర్థాలు కనిపిస్తు న్నాయి: పుంగు = కాల్చు, పొజ్జు = పొంగు, పొణ్మ = లేచు, పొంగు.

తమిళ మలయాళాలలో అర్థంతోను, ధ్వనితోను వీటిని పోలిన పదాలు కొల్లలు! పుక్షుక్కం = వేడి, చెమట, దుఃఖం, అసూయ పుక్షుక్కల్ = కొంచెంగా వుడికిన, ఉడికిన బియ్యం, ఉప్పుడు బియ్యం పుక్షుక్కు = వడ్లు ఉడికించు, కాల్చు, ధాన్యం వుడికించు ఉడికించిన తిండి, ఉడికించిన పప్పు బియ్యం పుక్షుంగల్ = నమంగా ఉడికించు, కోపం, ఉక్క. పుక్షుంగు ప్పూనై = వాసనకొట్టేపిల్లి, పునుగుపిల్లి పుక్షుంగు - దల్ = ఆవిరికక్కు, కొంచెంగా వుడికించు, ఉమ్మగిలచేయు, చెమర్చు, కోపించు.

పొంగు = ఉడుకు, పొంగు. నురుగుకక్కు సంతోషపడు, పైకిలేచు, అభ్యుదయం, ఐశ్వర్యం. పొంగల్ = పొగ, తీవ్రమైన కోపం. పొంగలి, పొంగలి పండుగ, ఎత్తు, నిండుదనం, అభివృద్ధి, కల్లు, విస్తృతి

పొశుక్కు = కాల్చు మసిచేయు, ఉడికించు పొశుంగు = కాల్చు, పాడుచేయు, అంగీకరింపజేయు.

ఇక తెలుగులో పొంగు అన్న మాటకు ఎక్కువగు, సంతోషించు, గర్వించు, ఉబుకు, అతిశయించు, విజృంభించు అనే అర్థాలు వాడుకలో ఉండడం మనకు తెలిసిందే.

ఈ పదాలన్నింటికి "పుళ్ష్" అనే ధ్వన్యనుకరణం మూలమై వివిధార్థాల పరిణామానికి దారితీసి వుంటుం దనుకోవచ్చు "ళ్ష" అనే ప్రాచీన వర్ణం డ, ణ, న, య అ, ల, శ, శ లుగా మారే స్వభావంగల విశిష్టాక్షరం గనక పుళ్ష్ నుంచి యిన్ని పదాలు అతి సూక్ష్మమైన అర్థ విశేషాలతో పుట్టుకు రావడానికి కారణమైంది

మన పూర్వులు మొదట తాము సంపాదించిన వస్తువులన్నిటిని ఒకే పాత్రలో వేసి ఉడికించి తినేవారు. అప్పటికి కడుపు నింపుకొనడం తప్ప రుచుల, భోజ్య వస్తువుల వింగడింపు తెలియదు ఆ పరిస్థితిలో - "పుళ్ష్ పుళ్ష్" శబ్దం మొదట ఉడుకుతున్న దశను సూచించేటప్పుడు - వేడి, ఆవిరి కక్కు, ఉడుకు, పొంగు అనే అర్థాలు ఏర్పడ్డాయి. వండి, వార్చి, ఉమ్మగిల జేయడం తెలిసిన తర్వాత, మూతలకో, పాత్రలకో ఆవిసీరు పట్టివుండడం చూచినమీదట తమకు చెమటపట్టినప్పుడు కూడా ఆ పదమే వాడారు. వండే టప్పుడు తెలుసుకున్న వాసనకూ ఆ పదమే వాడడం జరిగింది. మరొకచోట అలాటి ఏ వాసన వచ్చినా, పుళ్షుంగు అనే పదం చేర్చివుంటారు. ఇది ఒక్క పుళ్షుంగు పూనైలో మాత్రం నిలిచిపోయింది. ళ్ష కారం నకారమై పునుంగు పిల్లి అయింది. వాసన పిల్లి అన్నమాట. వట్టి వాసనకే వాడిన ఈ పదం ప్రత్యేక వాసన ద్రవ్యంలో రూఢమయింది.

పుష్గు పదం పుష్గి, పుట్గి, పుగ్గి అని మారింది కన్నడంలో పుగ్గి పొంగలి అనే అర్థంలో నిలిచింది తమిళంలో పుష్గు, పుష్ంగు, పొంగు అయి పొంగల్ రూపం ఏర్పడింది. తెలుగులో పులగం, పొంగలి - రెండు రూపాలు ఏర్పడ్డాయి. పుష్గు పుంగు, పొంగలి (పుష్ఙంగు పునుంగులాగా), పుష్గు, పుళగ, పులగము.

పదార్థ విజ్ఞానంతో కనుగొన్న ఈ పదాలు వేడిపల్ల కలిగే క్రియలకు అనురూపమైన మానసిక భావాలకు, ఆవేశాలకూ వాడడం ఏర్పడింది ఏమిటా పొంగు? ఎంత పొంగి పోతాడో? ఏమి చూచుకొని ఈ పొంగు! నీ పొంగ ణగ! - ఇలా సంతోష సమృద్ధమైశ్వర్యాభివృద్ధులకు ప్రయోగించారు.

ఈ పుష్, పుశ్ పైకి రావడం అనే అర్థంలో స్థిరపడిన తర్వాత కొంత మార్పుతో పైకుబికి వచ్చే నీటి పేరై బుగ్గ అయింది; మరికొంత మార్పుతో కన్నడంలో పొడగు; తెలుగులో పొడము, పొడుగు, పొడువు అయింది; పొగ, పొగుచు, పొంగణాలు వీని పరిణామాలే. ఉడుకు అనే అర్థ పరిణామం ప్రబలమైనప్పుడు పొక్కు వంటి పదాలు పుట్టాయి.

కాగా, పొంగలి - పులగం మన సమష్టి సంతోష భోజన సంప్ర దాయాన్ని రక్షించిన పాత పదా లనుకుంటాను.

పొంగలి విష్ణు దేవాలయాలలో ధనుర్మాసంలో ఆరగింపు చేయడానికి కారణం రాజులు వైద్య శాస్త్రాన్ని అనుసరించడమై వుంటుంది.

వాగ్భటుడు మున్నగువారు ఆయా ఋతువులలో సేవించవలసిన ఆహారాన్ని తెలుపుతూ, చలికాలంలో రాత్రిళ్ళు పెద్దవి, పగళ్ళు చిన్నవి గనుక, నిద్ర లేవగానే ఆకలివేస్తుంది గనుక స్వస్థులు మధ్యాన్నాన్ని సేవించా లని శాసించారు. ఈ వైద్యుల సలహాలను పాటించగలవారు రాజులో, శ్రీమంతులో అయివుండేవారు. వారు వైష్ణవ మతాన్ని స్వీకరించిన తర్వాత, తమ వైభవాలన్నింటినీ భగవత్కైంకర్య భావంతో అనుభవించే సంప్ర

దాయం ప్రకారం ఈ ఆచారం పెరుమాళ్ళ గుళ్ళలోకి వ్యాపించి వుంటుంది. లేక దేవాలయాలు ప్రజల ఉమ్మడి ధర్మసంస్థలు గనుక వైద్యక ఉపదేశాలను అక్కడినుంచే వ్యాపింపజేయడంకోసం ఈ సంప్రదాయం దేవాలయాలకు అంటగట్టి వుంటారేమో!

పొంగలి, పులగం పదాల పుట్టుకను తోడి భాషల పూర్వరూపాల సాదృశ్యంతో, భాషాశాస్త్రరీత్యా ఎంత వివరించినా, సంస్కృతంలోని పులాక శబ్దం ఎందుకు పులగం అన్నదానికి మూలం కాకూడదనే ఆక్షేపణ చేసేవారున్నారు.

సంస్కృతంలో పుల, పుల్ల ధాతువులున్నాయి. పుల = (మహత్యే) గొప్పకావడం, పుల = (ఉద్ధృతౌ) విజృంభించడం వీటి అర్థాలు పులక, పులాకలు వీటినుంచి పుట్టినవే. ఫార్సీలో పులావ్ శబ్దం కూడా అన్న వాచకమే. కాని పుల్ల ధాత్వర్థాలు గమనిస్తే ఈ రెండు ధాతువులు, పుల్ల ధాతువు కూడా ధ్వన్యనుకరణ వాచకాలనే నిర్ధరించుకోవలసి వస్తుంది. పుల, పుల్ల శబ్దాలనుంచే పూరీ, పూడీ, పూడా, పూల్, పూలనా అనే నేటి ఔత్తరాహ భాషా పదాలు పుట్టాయి.



# ఉల్లి — అల్లియం



**ఉల్లి** చేసే మేలు తల్లి చేయదు — అన్నది మన సామెత. ప్రపంచమంతటా దీని ప్రతిష్ఠ ఇలాంటిదే!

ఉల్లిని గురించి మనవారు చెప్పేవి రకరకాల కథలున్నాయి. వైనతేయుడు ఇంద్రునితో పోరాడి అమృతం లాక్కొని పోయేప్పుడు అమృత బిందువులు భూమిపై రాలాయి; వానినుంచి ఉల్లి పుట్టింది అన్నారు కొందరు.

ఆర్యావర్తంనుండి దక్షిణాపథానికి ఒక ఋషి యాత్రకు వచ్చాడట ఆయనకు దండకారణ్యాలలో ఒక ముసలి ముని కనుపించాడట. యాత్రకు వచ్చిన ఋషి ఆయన ఆశ్రమంలో కొన్నాళ్ళపాటు ఉండి కన్యాకుమారిని దర్శించి, తిరిగి ఆర్యావర్తం వెళ్ళుతూ తాను మొదట విశ్రమించిన మున్యాశ్రమానికి వచ్చాడట. కాని ఆశ్చర్యం ముసలి మునికి మారుగా తుమ్మెద రెక్కల్లాంటి గడ్డం మీసాలతో నవయువకుడైన ముని కనుపించాడట. ఉత్తరాది ఋషి భయపడుతూ "ఈ ఆశ్రమంలో ముందొక వృద్ధ మునీశ్వరులుండేవారు. వారు మీకు జనకులా?" అని ప్రశ్నించాడట. ఆ నవ యువకుడు మండిపడి "ఎంత అవమానించారు నన్ను? అయ్యో! అయ్యో!" అని అగాయిత్యం చేశాడట. ఉత్తరాది ఋషి తననుంచి ఏమి మహాపచారం జరిగిందో అని దిగులుపడుతూ "క్షమధ్వం" అన్నాడట. "ఎన్నటికీ క్షమించను. ఆ వ్యక్తిని నేనే! నన్ను గుర్తు పట్టలేక పోయారా?" అని మరింత గొంతు చించుకున్నాడట. ఉత్తరాది ఋషి ఆశ్చర్యపడుతూ "ఎలా సంభవం? ఆ నెరసిన గడ్డం, ఆ ముడుతలు .. " అని అనబోతుంటే "ఓహో! అదా మీ అనుమానం? నాకు ఒక మహౌషధి లభించింది. దానిని సేవించాను" అనగానే ఉత్తరాది ఆయనకు మరింత ఆశ్చర్యం కలిగిందట. ఎలాగైనా దానిని సంపాదిద్దామని ముసలి మునిని ప్రార్థించాడట, తనకు కూడా ఆ మూలిక సెలవీయ వలసిందని. కాని ససేమిరా ముసలి ముని అంగీకరించలేదట.

ఉత్తరాది ముని తుదకు విసుగెత్తి "నీ మూలిక నీకు పనికిరాకుండా పోనీ!" అని శపించాడట. దీనితో దక్షిణాది ముని తిక్క కుదిరింది; ఉత్తరాది ముని కాళ్ళా వేళ్ళా పడ్డాడు; శాపాన్ని ఉపసంహరించుకొమ్మని ప్రతిమాలినాడు. "నా శాపానికి తిరుగులేదు. మధ్యమమార్గంలో ఒకటి మాత్రం చేయగలను. ఆ మూలిక చెడు కంపు కొట్టుగాక! దానితో అందరికీ అది సులభంగా తెలిసి పోవనీ గాక!" అన్నాడట గుడ్డిలో మెల్ల అని దక్షిణాది ముని సమాధాన పడ్డాడట. ఇలాటివే మరెన్నో.

ఉల్లిరకాలు 250 వరకు ఉన్నవని ఆధునిక వృక్షశాస్త్రజ్ఞు లంటున్నారు. ఉల్లిరకాలు పెక్కు మనకు వేల సంవత్సరాల క్రితమే తెలుసు మనువు (5-5), యాజ్ఞవల్క్యుడు (1-176) దీనిని నిషేధించారు సుశ్రుతుడు-

"లశునో దీర్ఘపత్రశ్చ
పిచ్ఛగంధో మహౌషధం,
ఫరణశ్చ పలాండుశ్చ
లతార్కశ్చ అపదారికా,
గృంజనం యవనేష్టశ్చ
పలాండో ర్దశ జాతయః"

అని పది రకాల ఉల్లిని పేర్కొన్నాడు 'యవనేష్ట' అనే మాటతోనే గ్రీకుల నుంచి వచ్చిన ఒక జాతి కూడా దీనిలో వుందని మనకు తెలుస్తుంది.

ఉల్లి విదేశీయులకు—ముఖ్యంగా ఈజిప్టువారికి రెండు వేలేండ్లకు ముందునుంచే తెలుసు ఈజిపులోని పెద్ద పిరమిడ్డును కట్టడానికి పనిచేసిన కార్మికులు తిన్న నీరుల్లికింద 600 టేలెంట్లు (అప్పటి నాణెం. ఇప్పటి 4,28,800 పౌనులు—64,82,000 రూపాయలు) ఖర్చయినట్టు క్రీస్తు పూర్వం 413 లో వున్న హెరొడోటస్ శాసనంలో పేర్కొనబడిందట. కనుక ఆసియా ఖండంవారికి ఈ మొక్క చాలకాలంనుంచే తెలుసు ననవచ్చు. ఈ జాతిలోని ఒక మొక్కను దేవతగా భావించడం కూడా ఈజిప్టులో ఆచారంగా వుండేదట.

వెల్లుల్లి మొదట సైబీరియా దేశందని, తర్వాత యూరోప్‌కు వ్యాపించిందని, ఇంగ్లండుకు సిసిలీనుండి వెళ్ళిందని, నీరుల్లి పశ్చిమ ఆసియానుంచి యూరోపు చేరిందని వృక్షశాస్త్రజ్ఞు లంటున్నారు.

ఎక్కడ ఇది మొదట పుట్టి, ఎప్పుడు మరోచోటికి చేరినా, గొప్ప మొక్కగా ప్రపంచం ఏనాడో గుర్తించింది. మన వైద్య శాస్త్రజ్ఞులు "మహౌషధం" అనేశారు. మనం కన్నతల్లికన్నా ఎక్కువ స్థానమిచ్చాము.

ఈ మొక్కకు ఉల్లి అనే పేరెలా వచ్చింది? సంస్కృతంలోనో, మన దేశంలోని సంస్కృత జన్య భాషలలోనో దీనికి మూలముందా అంటే కనిపించదు. సంస్కృతంలో వెల్లుల్లికి ఎక్కువ ప్రచారంలో ఉన్న మాటలు రసోనః, లశునః అనేవి ఒక్క రసం-పులుపు-తక్కువగా ఉంది గనుక రసోనః అనే పేరు వచ్చిందన్నారు రసజ్ఞులు. ఇది కామోద్దీపనం, పాప హేతువు, కనుక పెద్దలచే పరిహరింపబడుతుంది (ఊన్యతే) గనుక రసోన మయిందన్నారు ఆచార పక్షపాతులు. రోగాలను పోగుడుతుంది గనుక (లశతి) లశునః అయిందన్నారు రోగులు. శబ్దం కలిగిస్తుంది (గృంజతి) కనుక గృంజన మయిందన్నారు ఆక్షేపకులు. ధాతువులను పోషిస్తుంది లేక రోగాలనుంచి రక్షిస్తుంది గనుక పలాండు అయిం దన్నారు దుర్బలులు. గృంజన మనేది షల్గం అని ఉత్తరాదిని వ్యవహరించే చిరుచేదుగా ఉన్న ఉల్లి జాతి మరొకగడ్డ (టర్నిప్) అన్నారు కొందరు.

సుశ్రుతుడు పలాండు (ఉల్లి) జాతులు పది అని చెప్పగా, అమరకోశ కారుడు నీరుల్లికి పలాండు, సుకంద అనేవి పర్యాయాలుగా ఇచ్చి, లతార్క, దుద్రుమాలు పసుపుపచ్చ నీరుల్లి అన్నాడు. వెల్లుల్లికి మహౌషధం, లశునం, గృంజనం, అరిష్టం, మాహాకందః, రసోనః అనేవి పర్యాయపదా లిచ్చారు.

పై సంస్కృత పదాలతోను, సంస్కృతభవాలైన నేటి ఉత్తరాపథ భాషలలో ప్రచుర వ్యవహారంలో ఉన్న లస్‌హన్, లసన్, ప్యాజ్, కందా అనే మాటలతోను ఉల్లికి పోలిక కనిపించదు. కనుక ఇది అప్పటమైన దక్షిణాది పదం.

తెనుగుకు సజాతీయమైన తమిళ, కన్నడ, తుళు భాషలలో తక్కిన పర్యాయాలతోపాటు ఉల్లి అనే పదం కూడా ఉంది. నీరుల్లికి తమిళంలో ఉళ్ళి ఈరుళ్ళి, ఈరవెంగాయం, వెంగాయం అనేవి సమానార్థకాలు. కన్నడంలో ఉళ్ళి, నీరుళ్ళి, ఉళ్ళేగడ్డి తుళులో ఉళ్ళి, ఉల్లి. వెల్లుల్లికి తమిళంలో వెళ్ళై పూండు, పూండు, ఉళ్ళిపూండు అనేవి సమానార్థకాలు, కన్నడంలో బెళ్ళుళ్ళి.

కన్నడంలో ఉళ్ళి కారుళ్ళి (అడవి ఉల్లి), ఈరుళ్ళి (నీరుల్లి), కేసుళ్ళి (ఎర్ర ఉల్లి), బెళ్ళుళ్ళి (వెల్లుల్లి) అనేవి నాలుగు వాడుకలో వున్న రకాలు.

వీటిలో పలాండుకు పూండుకు పోలిక ఉంది పూండు అనే మాటకు చిన్న ముక్క అనే అర్థం కూడా ఉంది. ఉల్లి చిన్న ముక్కే గనుక ఈ అర్థం సరైందిగా కనిపిస్తుంది పలాండు అనే మాటకు ఇచ్చిన వ్యుత్పత్తి (రోగాలనుంచి పలతి రక్షిస్తుంది పలశబ్దం మీద అండుచ్ అనే ప్రత్యయం) మాత్రం తర్వాత అగతికంగా కల్పించిందేనని స్పష్టమౌతున్నది. అధికాక్షర పదాలు ఉచ్చారణ సౌలభ్యంకోసం అల్పాక్షర పదాలుగా మారడం శబ్దశాస్త్ర రీత్యా సహేతుకం కనుక పలాండు నుండి పూండు శబ్దం పుట్టిందని కొందరు వాదిస్తారు. కాని పలాండు వ్యుత్పత్తి పదంలో సగం-సగమేమిటి మూడు వంతుల - వున్న అండు శబ్దాన్ని ప్రత్యయ మనడం చూస్తే పూండు సంస్కృతీకరణమే పలాండు కావచ్చుననే అనుమానం కలుగక మానదు.

ఉల్లికి సంస్కృత పదాలతో పోలిక ఏమీ లేదని, సజాతీయ తమిళ కన్నడ పదాలతోనే సంబంధమని తెలుసుకున్నాము. ఇక దీని పుట్టుకను తెలుసుకోవలసి వుంది.

తెనుగులోను, దాని సజాతీయ భాషలలోను లోపల, లోపలది అనే అర్థాలలో ఉళ్, ఉళ్ళం, ఉళ్ళ, ఉల్లము, లో అనే పదా లున్నాయి ఉళ్ళం నుంచే ఉళ్ళి-ఉల్లి పుట్టిందా? భూమిలోపల ఉండేది పొరలు ఎన్ని విడ దీసినా యింకా లోపల - లోలోపల కనిపించేది అనే అర్థం అయి వుంటుందా?

కాని తిరుగు, గుండ్రని అనే అర్థాలలో ఉరళ్, ఉరళు, ఉరలు, ఉరళి, అనే పదాలు తమిళ కన్నడ తెలుగులలో ఉన్నవి. ఉళ్ళి, ఉరళి అనే మాటకు కన్నడంలో గుండ్రని, ముద్ద అని అర్థాలు. ఈ ఉరళ్, ఉరలు, రోలు అయింది. ఉరండు, ఉండ్ర ఉండ ఉంట అనే మరికొన్ని రూపాలయింది. మరొక విధంగా ఉరళి, ఉళ్ళి, ఉల్లి అనే రూపాలు దాల్చిందేమో? గుండ్రనిది,

ఉండగా ఉండేది అన్నమాట. కీర్తిశేషులు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు కూడా ఉరళ్ క్రమంగా ఉళ్ళిగా మారడమే సబబని ఈ చర్చ చేసినప్పుడు నాతో అన్నారు.

అయితే గుండ్రనివన్నీ ఉల్లిగడ్డలు కావా? అతివ్యాప్తిదోషం రాదా?— అని అంటే, భాషలో యోగంకంటే రూఢి బలీయసి కాదా అని జవాబు. ఈ ఉరళ్, ఉరళి ఎప్పుడు మారిందో? తిరిగి తిరిగి అరిగి అరిగి, ఉరళి ఉళ్లి— ఉల్లి అయిందే: ఉరళై కిళంగు (ఉర్లగడ్డ, బంగాళాదుంప)లో మారలేదే మరి? మారదు ఉరళ్ అనే స్థిరరూపంపై కిళంగు ఇటీవల చేరిన పదం. ఈ పదం మన ప్రాంతానికి యిటీవలదే. రెండింటికే ఒకే పదం ఒకే ఆకారం మూలమైనా, వాటి గుణాలను బట్టి గ్రహించడంలో—వస్తుభేదం సూచించే, అర్థభేదం తెలిపే శబ్దస్వరూపభేదం ఏర్పడుతుంది. కనుక ఇంత కన్న సహేతుకమైన మరొక వ్యుత్పత్తి తోచేవరకు ఉరళ్ నుండే ఉళ్ళి-ఉల్లి పుట్టిందని సంతృప్తి పడకూడదూ?

మరొక చిత్ర మేమిటంటే, ఉల్లి అనే పదంతో లాటిన్‌పదం పోలి ఉండడమే. ఉల్లితో పోలికగల పదాలు సంస్కృతంలోను తజ్జన్య భాషల లోను లేదనే సంగతి నిశ్చయం కాదా! లాటిన్ సంస్కృత సజాతీయభాష. దానిలో ఉల్లికి అల్లియం అనే మాట సమానార్థకం. అల్లియం ఆనియన్ అని మారడం అబ్బురం కాదు. ఈ తెలుగు ఉల్లికి లాటిన్ అల్లియం-ఆనియన్‌కు సంబంధం ఉందేమో పరిశీలించాలి.



# మాచకమ్మ



ఎదుగూ బొదుగూలేని ఆడపిల్లను చూచి "మాచకమ్మనా ఏమిటి చెప్మా!" అని విస్తుపోతారు ఇల్లాండ్లు పిలగా ఉండే ఏ పడుచునైనా 'మాచకమ్మా!' అనండి. కోపంతో మొగం ఎర్రబడిపోయి ఇక జన్మలో మాట్లాడదు.

మాచకమ్మ అంటే ఏమిటి? దీనికి ఇంత కోపం ఎందుకు?

మాచకమ్మను మాసకమ్మ అని కూడా అంటారు స్త్రీత్వం లేక కేవలం ఆకృతి మాత్రంతో అతివగా ఉన్న స్వరూపాన్ని మాచకమ్మ అంటారు.

ప్రాచీన సాహిత్యం గాలిస్తే వల్లభరాయని క్రీడాభిరామంలో మాచకమ్మకు ప్రయోగమూ కనిపిస్తుంది. వివిధ వనితా దశలను వర్ణించిన శ్రీనాథుని దృష్టిని మాచకమ్మయినా తప్పించుకోడం ఎలా సాధ్యం?

"చెలగి చెలగి పొత్తి చీరలు కట్టెడు
మాసకమ్మకు దీర్ఘమాయు రస్తు"

(క్రీడాభిరామము, పుట-68)

మాచకమ్మకు ఆకృతిమాత్ర స్త్రీ అనే వ్యవహారం నేడు వుండగా మన నిఘంటుకారులు మరొక విధంగా అర్థం చెప్పారు.

శ్రీ బ్రౌనుగారు మాసకమ్మ = మాచకమ్మ అనే రెండు రూపాలూ ఇచ్చి, మాచ + అక్క + అమ్మ = మాచకమ్మ అని పదవిభాగంచేసి, మీసములు గలిగి రొమ్ములులేని ఆడుది అని అర్థం చెప్పారు.

శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరంలో మాచకమ్మ పదార్థ వివరణంలో శ్రీ బ్రౌనుగారి పద్ధతినే అనుసరిస్తూ "మీసములు

గలిగి రొమ్ములులేని ఆడుది" అని అర్థమిచ్చి, పోట అనే సంస్కృత పర్యాయ పదం ఇచ్చారు. ఆకారాంత స్త్రీ లింగమైన పోటా పదానికి అమరకారుడు "పోటా స్త్రీ పుంసలక్షణా" అని అర్థం చెప్పాడు. అంటే పురుష లక్షణములు గల ఆడది. స్త్రీ లక్షణాలు గల పురుషునిలాగే పురుష లక్షణాలు గల స్త్రీ పోటా. మగవారిలో ఆడంగిరేకలాగ ఆడవారిలో మగరాయుడు పోటా. అంతేకాని మాచకమ్మ కాదు. మాచకమ్మ అంటే స్త్రీత్వంలేని ఆడదని నేడు యే పల్లెటూరి వారిని అడిగినా చెబుతారు. స్త్రీత్వానికి ప్రధాన లక్షణం ఋతువు; గర్భాధాన శక్తి. గర్భధారణ శక్తికి మూలం ఋతుమతి కావడం (ఋతువు కలిగినా గర్భం ధరించే అర్హత లేకపోవడమనేది విషయాంతరం). ఇలాటి ఋతువు లేని స్త్రీ మాచకమ్మ. స్తనాద్యవయవ వికాసానికి దీనితో అంతగా సంబంధం లేదు.

అయితే, ఈ పదానికి ఋతువులేనిది అనే అర్థం చెప్పటానికి విని గమనం, నిర్ధారకం మనకు మరొక పదం కనుపించదు. మాస్, మాసు అనే పదానికి ఋతువు అనే అర్థం మరెక్కడయినా కనిపిస్తే, మన అర్థనిర్ధారణకు ఎంతో తోడ్పాటు అవుతుంది. కాని, అలాటి అవకాశం మనకు లేదు. అందువల్ల సోదర భాషలలో ఈ పదంగాని, ఈ పదార్థానికి బలమిచ్చే పద ప్రయోగాలు గాని వున్నాయేమో చూద్దాం.

కన్నడంలో ఈ పదం వ్యవహారంలో వుంది. కాని సాహిత్యంలో కనిపించదు. తమిళంలో అసలే కనపడదు. తమిళంలో దీనికి సమానార్థకం ఇరుడి. దీనికి ఋతువులేని స్త్రీ అని నిఘంటుకారులు సవ్యంగానే అర్థం చెప్పారు. కాని ఇది సిసలయిన తమిళపదంగా తోచదు. ఋతురహిత అనే పదంలోని పూర్వార్ధమైన ఋతు అనే పదం తద్భవమై అంతస్థాల వెనుక అకార ఇకార ఉకారాలు చేర్చి పలికే తమిళ సంప్రదాయం ప్రకారం ఋతు-ఇఋతు—ఇరుతి—ఇరుడి అని మారింది. కనుక అప్పటమైన తమిళపదం ఏమో స్పష్టంగా తెలియదు. తెలుగులో మాత్రమే మాసకమ్మ కనిపిస్తుంది.

అందువల్ల మనం మాస్ అనే పదాన్ని-క్రియనూ, తజ్జన్యపదాలను-పరిశీలిస్తే, మాచకమ్మ మాసకమ్మల కలరూపు మనకు తెలుస్తుంది.

మనకు మాయు అనే ధాతువు వుంది. దీని పూర్వరూపం మాస్ అని మనం సులభంగా గ్రహించవచ్చు వివిధ రీతులుగా కనిపిస్తున్న తజ్జన్య రూపాలను బట్టి మాయ్, పాయ్, మూయ్ కూయ్ వంటి యాంతధాతువులన్నీ మొదట చ-శకారాంతాలేనని, తర్వాత స్థానసామ్యాన్ని బట్టి (ఇచుయశానాం తాలు స్థానం) యకారం ఆదేశమయిందని వివిధ రూపాలలో శకారమే మిగిలి అది కూడ ఉచ్చారణ వేగంవల్లనో, మరే కారణంవలననో సకారంగా మారిందని తజ్జన్య శబ్దాలు, శబ్దపల్లవాలు పరిశీలిస్తే సులభంగా తెలుసుకోగలం మాయ్ - మాశ్ - మాసిన - మాసెను. మూయ్-మూశ్-మూసిన-మూసెను. కూయ్-కూశ్-కూసిన, కూసెను పాయ్-పాశ్-పాసిన-పాసెను.

కాని మాయు భావార్థకంలో మాపు అయినది; మాసు అనే రూపం సకృత్తుగా వుంది. మూయు-మూత కూయు-కూత. పాయు-పాసు అనే రూపం వుంది. ఈ పాసు అనే పదాన్ని బట్టి, మాసి అనే పదాన్ని బట్టి మాసు, మాస అనే రూపాలు పూర్వం వుండి వుంటాయని వూహించడానికి అవకాశం ఉంది. సోదర భాషలు ఈ ఊహకు ఏమైనా తోడ్పడుతాయేమో చూద్దాం.

కన్నడంలో మాచు - మాజు - మాసు అనే క్రియల రూపాలు ఈ విధంగా కనిపిస్తున్నాయి. మాచు, మాజు = మాయునట్లు చేయు, మసక మసక చేయు, మాంజు = వంచించు, మాయకప్పు, మాయ; మాసు = జరాయువు, గర్భాశయం, గర్భపు సంచి, మాసిన; మాసలు = మురికి; మాసు = మురికి, మావి, అపరిశుభ్రత.

ఈ అర్థాలు శ్రద్ధతో పరిశీలించదగినవి. మాయుట, మురికి, అపరిశుభ్రత, మావి, గర్భాశయం ఈ అర్థాలన్నీ మాయటం, మురికి అనే అర్థాల క్రమ పరిణామమే. మావి, గర్భపు సంచి, గర్భాశయం మురికైనవే. మన సంప్రదాయం ప్రకారం గర్భంలో పడటం, మావిలో చిక్కుకొనడం మరొక జన్మ యెత్తడం మహాపాపపంకం.

తమిళంలోను ఈ పదానికి ఏతత్సదృశార్థాలే వున్నాయి. మాచు(శు)= చుక్క, మరక, నలుపు, పాపము, చెడువు, మురికి, దుమ్ము, దేహపు మురికి, పిత్తము, చీకటి, లోపము. మాశుతీర్మాన్=కేశాలంకర్త (నాపితుడు) మాచంకం=(మాచ+అంకం)=అంటు, ముట్టు, సూతకం. మాస్+ఇలా+మణి=నలుపు - మురికి లేని మణి శుభ్రమణి–సుబ్రహ్మణ్యుడు.

సోదర భాషలలో మాచ్ మాస్ పదాలకున్న అర్థాలనుబట్టి మాస్ లేక మాసు అనే పదం తెలుగులోను మురికి మొదలయిన పై అర్థాలలో ఒకప్పుడు ఉండేదని క్రమంగా వ్యవహారచ్యుతమయిపోయి మాసకమ్మలో మాత్రం మిగిలిపోయినదని ఊహించవచ్చు.

అందువల్ల మాస్ లేక మాసు+అక+అమ్మ=మాసకమ్మ - మురికి, దేహపుమురికి-అంటు, మావి అర్థాత్ ఋతువు లేని స్త్రీ అని అర్థం చెప్పుకోవచ్చు. సృష్టికి ప్రధానమైన ఋతువును–ప్రకృతిలో ఒక్క మానవ స్త్రీలకే కాక వారివంటి మానవేతర జీవులకు కూడా సహజమైన ఋతువును మురికిగా, పాపంగా భావించడం మన దేశంలో నేటికీ వుంది. దీనిని యింత పాపంగా భావించడానికి కారణం మన పూర్వులలో కొందరికి అధ్యాత్మిక దృష్టేనని అనుకుంటాను. మన పూర్వులలో కొందరు పుట్టుకను పాపమని భావించడంవల్ల దానికి మూలకారణమైన ఋతువునుగూడ నీచాతినీచంగా పాప కర్దమంగా పరిగణించారు. మన పూర్వులు అంటే అత్యంత పూర్వుల మాట కాదు; మధ్యకాలపు పూర్వులే. పుట్టుక, సంతతి పాపమని వేదకాలం వారు భావించివుంటే, "ప్రజయా హి మనుష్యః పూర్ణః, దశాస్యాన్ పుత్రా నాధేహి పతి మేకాదశం కృధి" అని ఉద్ఘోషించివుండరు. ప్రాచీన వైద్యకాచార్యులు సుశ్రుతుడు మొదలయిన వారుగూడ ఋతువును పాపంగాను అస్పృశ్యంగాను భావించలేదు "ప్రవాహంలో బీజం వేస్తే నిలుస్తుందా? నిలువదు. అట్లే ఋతుస్రావ కాలంలో సంగమంవల్ల బీజం నిలిచి గర్భోత్పత్తి జరుగదు. ప్రయోజనం లేని పని చేయడం బుద్ధిమంతుని లక్షణం కాదు. కనుక ఋతుస్రావకాలంలో మిథునకర్మ వద్దు." అన్నారు. స్త్రీ పురుషుల మలాలతో, ముఖ్యంగా ఋతు రక్తంతో మధ్యకాలంలో, తాంత్రికులు

అభిచారాదిదుష్టక్రియలు, వశీకరణాది అకృత్యాలుచేసి ప్రజలను భయపెట్టడం వల్ల ఋతువు అంటే అంటు అనే సాకుతో ఋతుమతిని యెంతో భద్రంగా కాపాడడం ప్రారంభమయి నేటి విపరీతాచారానికి కారణమయిందని నా నమ్మకం. చాల శాఖాచంక్రమణం అయింది. ఇక మొదటికి వద్దాము.

మాస్.మాసు + అక + అమ్మ = మాసకమ్మ = ఋతువులేని స్త్రీ అని వ్యుత్పత్తి. అర్థం చెప్పుకున్నాము మాచంకం. మాసంకం = అంటే ముట్టు. అంటు అనే అర్థాలు ఇదివరకే తమిళంలో వున్నట్టు చూచాము గనక మాసంకం + అమ్మ = మాసకమ్మ అని కూడా వ్యుత్పత్తి చెప్పుకోవచ్చు. అప్పుడు, ఋతువులేనిది అనటానికి మారు, ఋతువు గలది అనే అర్థం వస్తుంది కాని, తద్వ్యతిరేకార్థం రాదుగదా అనే ఆక్షేపణ వస్తుంది "అమంగళ మపి మంగళమితి బ్రూయాత్" అశుభంగా వున్నదాన్ని కూడ శుభమనే చెప్పాలి—అని ధర్మశాస్త్రాదేశం. ఈ వ్యతిరేక లక్షణతో మాసంకం లేనిది అనే అర్థం ఏర్పడివుంటుంది.

శ్రీ బ్రౌనుగారు ఆయనను అనుసరించి శ్రీ సీతారామాచార్యులుగారు పదవిభాగం సరిగా చేసినా అర్థం సరిగా చెప్పలేదు. వ్యుత్పత్తి అసలే చెప్పలేదు.

దీన్నంతా, పై చర్చనంతా పూర్వపక్షంచేసే ప్రమాదం ఒక్కటి వుంది మాసః అంటే సంస్కృతంలో నెల, తల్లక్షణతో మాసమంటే నెల నెల కలిగే ఋతువు, అది లేనిది, విపరీత లక్షణతో, మాసకమ్మ - అని వ్యుత్పత్తి చెప్పవచ్చు గదా సులభంగా—అనవచ్చు ఎవ్వరైనా. నిజమే, కాని ఒక పదం పుట్టుపూర్వాలు తెలుసుకోవాలంటే, ఆ పదానికి ఆనుపూర్విగా వున్న వివిధ స్వరూపాలూ, అర్థాలూ, తజ్జన్యపదాలూ, శబ్దపల్లవాలూ మొద లయినవి కోకొల్లలుగా వున్నప్పుడు, సోదర భాషలలోనూ ఆ పదం ఆ అర్థం లోనో, తత్సమీపార్థాలలోనో కనిపిస్తున్నప్పుడు, పరాయి పదంతో వ్యుత్పత్తి కోసం ప్రాకులాడటం జిజ్ఞాసువుల లక్షణం కాదు కాకతాళీయమైన పోలికలు ప్రతి భాషలోను కొన్ని పదాలకు వుండనే వుంటాయి అంతమాత్రాన అది

ఆ భాషనుంచి ఈ భాషకు వచ్చిందని త్వరపడి నిర్ణయం చేయలేము. పొలం అనే పదం తెలుగులో క్షేత్రార్థకం సోదర కన్నడాది భాషలలోను ఈ అర్థం లోనే వుంది 'పోలే' అనే పదం రష్యన్ భాషలో వుందని దానికికూడా ఇదే అర్థమని ఒక రష్యన్ మిత్రుడన్నాడు. అంతమాత్రాన ఈ పదాలు రెండూ ఒక సంతతివని చెప్పగలమా? అందువల్ల ఘుణాక్షర న్యాయంగా కనిపించే పోలికలను పట్టుకొని పదాల పుట్టుపూర్వోత్తరాలు వెదకటం సహేతుకం కాదు.

మాస్-ఇలా-మణి, మాసిలామణి, సుబ్రహ్మణ్యు డయినదీ వింతగానే ఉంటుంది మాసిలామణికి సంస్కృతానువాదం శుభ్రమణి - పరిశుద్ధమయిన మణి ఇది ఉచ్చారణలో సుబ్రమణి అయింది క్రమంగా సంస్కృతంలో సుబ్రహ్మణ్య అనే పదం ఉంది. సుబ్రహ్మణ్యుడు అంటే, విష్ణువు, శని; వేదానికి, బ్రహ్మకు హితుడు మొదలయిన అర్థాలున్నాయి ఏ దశలోనో ఆ సుబ్రమణి, ఈ సుబ్రహ్మణ్యుడు ఒకటనే భ్రాంతి కలిగింది ఈ పదాన్ని కూడా కుమారస్వామికి వాడసాగినారు ఇదేమిటి అని అడిగితే కుమారుడు వేదబాహ్యుడా అంటారు.

పులుమావి కూడ ఇటువంటి పదమే. మావి అంటే ఉత్పత్తి, పులు అంటే గడ్డి గడ్డిలో పుట్టినవాడు శరవణ భవుడు, మన పూర్వులకు దేవ సేనాని అయిన స్కందుడు ఆరాధ్య దేవత. కనుక అతని పేర్ల రాజులు చాల మంది ఉన్నారు.



# పస్తు — పసి



పస్తు అంటే తిండిలేక వుండటం, ఉపవసించటం అని ఆబాల వృద్ధానికి తెలుసు. "రెండు రోజులు పస్తండీ బాబూ! పస్తుగా పడివున్నాను తల్లీ! ఇంత కవళం వేయించండమ్మా!" అని మనం అనుదినం బిచ్చగాళ్ళనుంచి వింటున్న మాటే.

ఏ నిఘంటువు తిరుగవేసినా ఈ అర్థం కనుపిస్తుంది. శ్రీ బ్రౌనుగారు పస్తు = ఉపవాసం అని అర్థమిచ్చి, పస్తుండు, పస్తుగానుండు అనే ప్రయోగాలు ఇచ్చారు. శ్రీ సీతారామాచార్యులుగారు పస్తు = ఉపవాసం అనే అర్థమిచ్చారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పదబంధ పారిజాతం పస్తుండు = ఉపవాసముండు అనే అర్థమిచ్చి-

"ఎన్నేళ్ళనుండియో ప
స్తున్నాడీ యడవిలోన నొంటి మహేశుం
డన్నెగులు మాన్పవలదా?" (కాళహస్తి మాహాత్మ్యం 3-85)

అనే ధూర్జటి ప్రయోగమూ ఉదాహరించింది. ఈ పదబంధ పారిజాతం పసిపడు అనే మరొక పదమూ ఉదాహరించి, దానికి కామాతుర యగు అనే అర్థం పేర్కొని "గొల్లపడుచా! పసిపడి తిరిగేవు బకివాయక" (తాళ్ళపాక వారి పదాలు-సం 1-197) అనే ప్రయోగమూ ఇచ్చింది ఇది మరొక విధమైన ఆకలి.

మనకు క్షుత్తు అనే అర్థంలో ఆకలి అనే మాట ఒక్కటే నేడు వ్యవహారంలో వుంది. పస్తుండు అంటే ఆకలిగొను అని కదా అర్థం.

ఈ పస్తు ఎప్పుడు వ్యవహారంనుంచి జారిపోయిందో! సోదర భాషలలో ఈ మాట వుందేమో చూద్దాం.

కన్నడంలో పసి, పసు, పసువు, హసివు, హసివి, హసువు అనే మాటలు కనిపిస్తాయి. పసిదు + ఉణ్ణు = ఆకలిగొని భుజించాడు; పసిదు = ఆకలిగొని అనే క్త్వార్థకరూపాలు శ్రీ కిట్టెల్‌గారు తమ నిఘంటువులో ఉదాహరించారు.

తమిళంలో పసి = ఆకలి, పసి త్తల్ = ఆకలి అగు అనే రూపాలున్నాయి. ఆకలి దారిద్ర్యానికి, జీర్ణం కావడానికి గుర్తు కనుక లక్షణయా పేదరికం, నిప్పు అనే అర్థాలూ తమిళంలో వచ్చాయి పసి అన్న పదానికి

దీనినిబట్టి మనం ఊహించగలిగిన దేమిటి? పసి అనే మాట తెలుగులోను వుండేది కాలక్రమాన కనుమరుగై పోయి వుంటుంది - అని. ఈ పసి ధాతువు క్త్వార్థకరూపం పసిమ = పస్తుపడి అనే అర్థంలో వుండడం మనం యింతకుముందు చూచాము.

ఆకలిగొని వుండు ఆకలి అగు అనే అర్థాలలో ఇలాటి మాటే మనకూ వుండి వుంటుంది, పశిత్తు, పసితు అనే విధంగా. కాని, అది ఎన్నో పదాలలాగే రూపు లేకుండా పోయి వుంటుంది. దాని ఛాయే పస్తులో వుండిపోయింది. పసితు అనేది పస్తుకావడం పెద్ద ఆశ్చర్యమేమీ కాదు. క్త్వార్థకమైన ఈ పదం క్రమంగా నామవాచక మయిపోయింది, పస్తు = ఉపవాసం, తిండి లేక వుండడం అనే అర్థాలలో.

పస్తు అర్థ నిర్ధారణ జరిగింది కాని. వ్యుత్పత్తికి ఇంకా గవేషణ జరగాలి.

"పసి అనే పదం సుమేరియన్ భాషలలో ఉంది. దీనికి ఆహారం, ఆహారవాంఛ అని అర్థాలు. పసులకు ఎప్పుడూ తిండి మీదే వాంఛ కనుక పసు అయింది. ఇది సుమేరియన్‌లో కనిపిస్తుంది." అని అంటారు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి.

"పసి గట్టడమంటే వాసన చూడడం, కుక్క పసిగట్టింది అంటే ఆహారాన్నో, తన ఘ్రాణేంద్రియ శక్తివల్ల తెలుసుకోదగిన వ్యక్తినో, వస్తువునో కనుగొన్నదన్నమాట దీనికి సుమేరియన్ పదం సమానార్థకం, సమానస్వరూపం ఉంది.

"పశువుల సందర్భంగా ఇంకొక విచిత్రమైన పదం మనకు తెలిసింది' మన భూతేశ శబ్దానికి భూతగణాధిపతి అని అర్థం చెబుతారు. గ్రీకు పురాణాలలో ఒక బౌతేశ్ అన్నారు ఈ బౌతేశుడు మన వృషభ వాహనా రూఢుడైన శివుని పోలినవాడు. బౌ అంటే గౌః - గోవు బోస్ఫరస్ ఆవు చరించేమేర భూమి ఈ బౌతేశుడే మన భూతేశుడని, భూతగణాలు అనే అర్థం తర్వాత చేరిందని తోస్తుంది. ఈ బౌతేశ్ సుమేరియన్ బౌతేసానుంచి వచ్చాడు." అంటారు శ్రీ కృష్ణమూర్తి.

అలాగే ప్రాచీనమైన పసు శబ్దం తర్వాత సంస్కృత పశు శబ్దంతో ఏకమైపోయింది అంటారు ఆయన పండితులు పరిశీలించాలి.



# నీళ్లాడు





నీళ్ళాడు అనే మాట నేడు ప్రసవించు అనే అర్థంలోనే రూఢమైంది దీనిని స్నానసామాన్యంగా ప్రయోగిస్తే "నీళ్ళాడి వస్తాను" అని అంటే విరగబడి నవ్వుతారు విన్నవారు. కాని నీరాటరేవు, నీలాటిరేవు అని అంటే మాత్రం నవ్వరు.

నీరాట రేవు, నీలాటి రేవు అంటే స్నానఘట్టం.

దీనినిబట్టి నీళ్ళాడు, నీరాడు అనే పదాలు స్నాన సామాన్యానికే మొదట్లో వుండి క్రమంగా విశేషార్థంలో మిగిలిపోయాయని మనం వూహించవచ్చు.

కన్నడ తమిళాలలో ఈ సామాన్య విశేషార్థా లున్నాయేమో అంటే సామాన్యార్థం మాత్రమే కనిపిస్తుంది కన్నడంలో నీరాడ = నీటిలో ఆట, జలక్రీడ తమిళంలో నీరాట్టం = స్నానం, నీరాట్టల్ = నీటిలో ఆట. నీరాట్టు = స్నానం చేయించు అందువల్ల ప్రసవించు అనే విశేషార్థం వున్నట్టు తోచదు.

మన నిఘంటువులు వేటిని చూచినా, నీరాట, నీరాటము (నీరు + ఆట) = స్నానం; నీరాడు, నీళ్ళాడు = జలకమాడు, స్నానముచేయు అనే అర్థాలు కనిపిస్తాయి. వీటికి ప్రయోగాలు నిఘంటుకారులు యిచ్చారు.

నీళ్ళాడు = స్నానంచేయు అనే అర్థంలో తిక్కనగారే ప్రయోగించారు:

"అతడు సరస్వతి నవగాహనము సేయు
చుండి యా చేరువ నోర్తు తడుపు
గట్టక నీళ్ళాడగా జూడ దనదు
శుక్రము నిర్గమించిన ... .. " (భారతం శల్య. 2-16)

నీరాడు = స్నానముచేయు అనే అర్థంలో మార్కండేయ పురాణంలో ప్రయోగం వుంది.

"........ దిగంబ
రత శయనింప నీరాడ గాదు" (8-280)

నీరాట, నీరాటము = స్నానం.

"నీరాట నెపమున నిర్ఝరంబునకేగి
సవిధ వానీర కుంజముల నొందు"
(శివరాత్రి మాహాత్మ్యం, 3-113)

నీరాటరేవు = స్నానం చేసే రేవు, స్నాన ఘట్టం.

"సాక్షాత్కరించిన జలదేవత యనంగ
నీరాటరేవున నీటు చూపు" (శుకసప్తతి, 2-410)

ఇలాగే నీళులాడు అనే ప్రయోగమూ వుంది.

ఇక నీళ్ళాడు = ప్రసవించు అనే అర్థంలో పోతనగారే ప్రయోగించారు.

"అంత బాలిక యావురని యేడ్పు చిరుచప్పు
డాలించి వేకన నాకయింటి
కావలివారు మేల్కాని చూచి తలుపులు
తాళముల్ తొంటివిధమున నుండ
దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్ళాడె
రమ్మురమ్మని భోజరాజుతోడ
జెప్పిన నాతడు చిడిముడిపాటుతో
దల్పంబుపై లేచి తత్తరమున."
(భాగవతం, దశమస్కంధం - 147)

కదలికను తెలిపే ఆడు అనేమాట మనకు అన్ని పనులు తెలిపే పదాలకు అనుబంధంగా వస్తుంది. మనకే కాదు కన్నడంవారికి కూడా. మాటలు + ఆడు, స్నానము + ఆడు, జలకము + ఆడు, పోట్లు + ఆడు, ఆటలు + ఆడు, కాట్లు + ఆడు - ఇలా యెన్నయినా వుదాహరించవచ్చు. నీళ్ళు + ఆడు క్రమంగా స్నానంచేయు అనే అర్థంలో సహజంగానే వుండి పోయింది.

కాని ఈ నీళ్ళాడు ప్రసవించు అనే విశేషార్థంలో రూఢం కావడం మన అనాగరక దశకు వుదాహృతి. ప్రసవించిన స్త్రీ మావి మొదలయిన వాటితో చూడడానికి అసహ్యంగా వుంటుంది. అందువల్ల నవప్రసూతకు వెంటనే నీళ్ళు పోయడం, పిల్లకు నీళ్ళు పోయడం పూర్వపు ఆచారం. నేడుకూడా అనాది వాసులలో ఈ ఆచారం వుంది. సాధారణంగా స్నానం లేకుండా వుండవచ్చు. ఈ విశేష సందర్భాలలో స్నానం చేయకుండా వుండడం సాధ్యం కాదు. కనుక నీళ్ళాడడం తప్పనిసరి అందువల్ల యిది విశేషమైన స్నానం. కనక నీళ్ళాడు అనే మాట ప్రసూత్యనంతరస్నాన విశేష సూచకమై క్రమంగా ప్రసూతికే ఉపలక్షకమయింది.

జిజ్ఞాసువులు ఆలోచించినకొద్దీ పెక్కు పదాల కలరూపు, పాతరూపు ప్రత్యక్షమై మనోవికాసం కలుగుతుంది.



# కొమ్ములు తిరుగు – కొమ్ములు చూపు



"పరిసర ప్రాణులలో ఏర్పడిన శారీరక పరిణామం బట్టి విచిత్రమయిన నానుడులు పుడుతాయి. మనకు వ్యవసాయం ప్రధాన మయిన వృత్తి గనుక దానినిబట్టి ఏర్పడినవి ఎన్నో! ఇలాటి నానుడులలో కొన్ని పశువుల కొమ్ములతో సంబంధం గలవి కూడ వున్నాయి: కొమ్ములు చూపు, కొమ్ములు తిరుగు, కొమ్ములు మొలచు కొమ్ములు వచ్చు మొదలయినవి

పశువుల వయోనిర్ణయానికి కొమ్ములలో మార్పు, పళ్ళు రావడం తోడ్పడుతాయి కొమ్ములు మొలవగానే దూడ పెద్ద దవుతుంది. కొమ్ములు రావడం అన్నా యిదే పొట్టేలు పెద్దదై బలిసిన కొద్దీ దాని కొమ్ములు వంపులు తిరుగుతూ పోతాయి, ఎవరో పట్టుకొని మెలి పెట్టినట్టు. మరి కొన్నిటి కొమ్ములు ముదరుతాయి. ఆవు, గేదె ఎన్ని ఈతలు ఈనిందో తెలుసుకొనడానికి కొమ్ముల కణుపులు పరిశీలిస్తారు.

ఈ కొమ్ములు తిరగడం కొమ్ములు రావడం, కొమ్ములు మొలవడం ఇతరత్రా అభివృద్ధినీ, బలాన్ని, అతిశయాన్ని, గర్వాన్ని తెలుపడానికి ప్రయుక్తాలవుతూ వచ్చాయి "ఆయనా, అమ్మో! కొమ్ములు తిరిగిన పండితుడండీ!" అంటారు. గొప్ప విద్వాంసుణ్ణి చూసి పండితునికి కొమ్ములు ఏవీ? ముదిరి తిరిగిన పొట్టేలు కొమ్ముల లాగా గంభీరమయిన, గట్టిదయిన పాండిత్యం కలవాడన్న మాట.

"వాడికేమి కొమ్ములు వచ్చాయా?" అంటారు. కొమ్ములు రావడంతో పశువులకు విశిష్టత, గొప్ప, ప్రయోజకత్వం ఏర్పడుతాయి. ఈ గుణాలన్నీ మానవునిపై అధ్యారోపించబడినప్పుడు ఈ నానుడి ఏర్పడింది. కొమ్ములు మొలుచు అనేది కూడా యిలాటిదే.

కొమ్ములు చూపు అనేది మాత్రం భయం కలిగించేది. కొమ్ములు గల ఏ పశువయినా తన మీదికి వచ్చే యితర పశువులనో, మృగాలనో, మనుష్యులనో ఎదుర్కొనడానికో, తరిమివేయడానికో కొమ్ములు చూపుతుంది. అంటే బెదరించడం అన్న మాట. కొమ్ములే గదా, వాటికి పరమాయుధం.

ఈ కొమ్ములు చూపు క్రమంగా బెదరించు, భయపెట్టు అనే నానుడి అయింది. జక్కన విక్రమార్క చరిత్రలో దీనికి శ్లేషలో చక్కని ఉదాహరణ వుంది.

"కుంభోదకము బోసి యంభోజముఖి పెంప
చూతంబు కొమ్ములు సూప దొడగె" (విక్ర, 4-132)

పాపం! ఎంతో ప్రేమతో కడవలతో నీరుపోసి పెంచితే, మామిడి చెట్టు కొమ్ములు చూపిందట! (బెదరించిందట! కొమ్మలు మొలిచాయని సామాన్యార్థం!)

ఇలాగే పశువుల పళ్ళనుబట్టి సామెతలు, నానుడులూ చాలా వున్నాయి! "దానమిచ్చిన దూడను పళ్ళు లెక్కపెట్టి చూచాడట!" ఇత్యాదిగా.



# మిరియం - మిరపకాయ



మిరపకాయ నేడు దేశమంతటా ఆంధ్రులకు ప్రతీక అయింది. నిజానికి మిరపకాయను తమిళులలో రామనాథపురం, తిరునెల్వేలి జిల్లాల వారు, మహారాష్ట్రులు మనకన్నా విశేషంగా వాడుతారు; మిరియాలకారం, అల్లపు కారం ఎక్కువగానే వాడుతారు. కాశ్మీరీలయితే "కబళే కబళే గోవింద నామ సంకీర్తనం" అన్నట్లు ముద్ద ముద్దకు పచ్చిమిరపకాయలు నములుతారు అయినా మనకు వచ్చినకీర్తి పోలేదు "పోదుసుమీ కీర్తికాంత పొందిన పిదపన్" అని సుమతి శతక కర్త ఊరికేనా అన్నాడా?

కాని, ఈ మిరపకాయ శ్రీనాథునికి తెలియదు, అతనికి తెలిసి ఉంటే సిరియాళుని మాంసాన్ని మిరపపండు కారంతోనే కలిపి వండించేవాడు:

"మిరియము నల్లియుం బసపు
మెంతియు నింగువ జీరకంబు" (హరవిలా 2-120)

అని వండడానికి వాడిన వస్తువులలో మిరియం స్థానాన్ని మిరపకాయకే ఇచ్చేవాడు.

కృష్ణరాయలకు కూడ మిరపకాయ తెలిసినట్లు లేదు. విష్ణుచిత్తుడు చలి కాలంలో అతిథులకు పెట్టే భోజనంలో మిరపకాయ ప్రసక్తే లేదు. విష్ణుచిత్తుడు

"పునుగుం దావి నవోదనంబు, మిరియం
పుం బొళ్లతో జట్టి చు
య్యను నాదారని కూరగుంపు, ముకుమం
డై యేర్పు నావం జిగు

ర్కాను పచ్చళ్లను, బాయసాన్నములు, నూ
రుంగాయలన్, జే సురు
క్కను నేయుం. జిలుపాల వెల్లువగ, నా
హారంబిడన్ సీతునన్" (ఆము. 1-82)

చలి కాలంలో ఈ వెచ్చని భోజనం నేడు లభించినా ఎంతో బాగుండును! మిరియప్పొళ్లు అవ కారంకోసం వాడారు. ఉల్లి తామసాహారం వైష్ణవులువాడరు గనుక రాయలు వదలిపెట్టాడు మిరపకాయ వాడుకలో ఉంటే చెప్పక మానే వాడా? "గురుగుం జెంచలి" అని పల్లెటూళ్ళ ఆకుకూరలను చెప్పినవాడాయె మరి?

సామాన్య ప్రజలకు సామాన భాషలో అసామాన్య విషయాలు చెప్పిన వేమన కూడా మిరియం ఒక ఉపమేయానికి ఉపమానంగా చెప్పాడేకాని మిరపకాయను చెప్పలేదు:

"మిరియ మింతదయిన మీద నల్లగనున్న
కొరికిచూడ లోన చురుకు మనును
సజ్జనులగువారి సారమిట్లుండురా
విశ్వదాభిరామ వినురవేమ."

అని పైకి చిన్నవారుగా, వికృతరూపులుగా కనిపించే మహాపురుషులను మిరియంతో పోల్చాడు మిరపకాయ తెలిసి ఉంటే. కాయను, పండును పోల్చి, "పైకి పచ్చగా, ఎర్రగా వున్నా దుర్మార్గుని హృదయం మిరపకాయలాగను, మిరపపండులాగను కారం సుమా?" అని హెచ్చరించి వుండేవాడే కనుక మిరపకాయ మనకు చాల ఇటీవలిదనే స్పష్టమవుతున్నది.

మిరియం మనకు ప్రాచీనమయిన కటుద్రవ్యం. సుశ్రుతుడు "పిప్పలీ మరిచ శృంగబేరాణి త్రికటుకం" అని చెప్పాడు (సుశ్రుత శారీరం, సూత్ర స్థానం-౩౮అ) వైద్యులు దీనిని ఔషధద్రవ్యంగా గ్రహించవలసివచ్చినప్పుడు ఇది అతి ప్రాచీనకాలంనుంచే చాల అలవాటువుంటుందని చెప్పనక్కరలేదు.

కేరళనుండి అరేబియా సముద్రం మీదుగా మధ్య ఆసియా దేశాల ద్వారా మధ్యధరా సముద్రతీర దేశాలకు, మధ్య ఐరోపా ప్రాంతాలకు వుండిన

ముఖ్య వ్యాపార మార్గంలో ప్రధాన వాణిజ్య వస్తువు మిరియాలు అయినట్లు చరిత్రకారులు తెల్పుతున్నారు ఇది క్రీస్తుకు నాలుగు శతాబ్దాల ముందునుంచే పాశ్చాత్య దేశాలకు మలబార్ కోస్తానుంచి ఎగుమతి అయ్యేదట క్రీస్తుశకం 408 లో అలారిక్ అనే కార్టిజియన్ సేనాపతి రోమ్ నగరాన్ని ముట్టడించి నప్పుడు, ముట్టడి ఎత్తివేయడానికి 3000 పౌనుల మిరియాలు పణంగా కోరాడట (ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా)

ఇది పూర్వం తూర్పుకోస్తా అడవులలో వన్యస్థితిలో వుండేదని, అక్కడి నుంచి అస్సాం, మలబార్‌లకు వ్యాపించిందని, ప్రస్తుతం ప్రపంచంలో జావా, సుమత్రా, బోర్నియో మలేషియా, సయాం, ఫిలిప్పైన్స్, వెస్ట్ ఇండీస్ దీవులలో పండిస్తున్నారని వృక్షశాస్త్రజ్ఞులంటున్నారు.

మిరియము, మిరెము, మిర్యము అనే మూడు రూపాలు దీనికి కనిపిస్తాయి. ఇది మరీచం అనే సంస్కృతపద తద్భవమని మన కోశకారులందరూ చెప్పారు రూపసాదృశ్యంవల్ల అలా అనడంలో ఆశ్చర్యం ఏమీ లేదు కాని తెలుగు తోబుట్టువులలో మిరియానికి గల సమానార్థకాలు చూస్తే ఈ వ్యుత్పత్తిని అనుమానించవలసి వస్తున్నది.

తమిళంలో దీనికి మిళ్లగు, మిరియల్, ముళ్లగు అనిపేరు. కన్నడం-మెళ్లసు, మెళసు, మెణసు మలయాళం - మిళగు, ముళగు. తుళు-మిణచి. తమిళ కన్నడాలలో ళ్లకారంతో ఉండడంవల్ల ఇది సంస్కృతేతరపద మన డానికి అవకాశం ఉంది. తమిళ కన్నడాలలో ళ్లతో కనిపించే పదాల ళ్లకారం తర్వాత శ, డ, ద, ర, ల, ణ లుగా మారింది.

కన్నడంలో మెళ్, మెళె అనే క్రియ లున్నాయి. వీటికి ఉద్రేకం కలిగించు, పొదలుగా పెరుగు అని అర్థాలు. మిరియపు తీగ పొదలు పొదలుగా, వన్యస్థితిలో పెరిగేది, కటురసంతో ఉద్రేకపరచేది గనుక, మెళె, మెరె శబ్దాలనుంచి ఇది పుట్టి వుంటుందని భావించవచ్చు. మెరె, మిరె, మిరియం, మిర్యెంగా మారి ఉంటుంది.

సంస్కృతంలో మరీచ, మరిచ శబ్దాల వ్యుత్పత్తి కూడా కొంత దూరాన్వితమే మరీచం = మ్రియతే శ్లేష్మాదికం అనేన-దీనినుంచి శ్లేష్మాదికం చస్తుంది. తక్కిన పర్యాయాల వ్యుత్పత్తి యౌగికమే. వేల్లజం-సముద్ర తీరంలో పుట్టింది కోలకం - గడ్డగా గట్టిగా వుండేది. కృష్ణం - నల్లనిది. ఊషణం—వేడి కలిగించేది. ధార్మపత్తనం-ధర్మపత్తనమనే ప్రాంతంది.

ఈ వ్యుత్పత్తులనుబట్టి, మిరియం పుట్టుకనుబట్టి, మిరియం మెళ్లసు, మెళసు, మిళ్లహు సజాతిదే కాని, మరీచ తద్భవం కాదని తోస్తుంది. ఈ వాద లో మిళ్లహు, మెళసుల వ్యుత్పత్తి స్పష్టంగా తెలిసేవరకు బలం తక్కువగానే వుంది. సందేహం లేదు.

మిరపకాయ మాత్రం పూర్తిగా ఇటీవలిదేనని వృక్షశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మిరియానికి మిరపకాయకు కటురసంలో తప్ప ఏమిటా సంబంధం లేదు. మిరియం గింజలాగ వుంటుంది ఇది కారం గల కాయ. దీని గుణ సాదృశ్యంతో మిరెముకాయ, మిరెపుకాయ, మిరపకాయగా వ్యవహారం ఏర్పడింది. దీని పుట్టుకను గురించి వృక్షశాస్త్రజ్ఞులు చెప్పిన విషయాలను ఇక్కడ క్రోడీకరిస్తాను :

ఇది విషువద్దేశమయిన బ్రాజిల్‌లో మొదట పుట్టింది అక్కడనుంచి, అమెరికా నుంచి 16 వ శతాబ్దిలో యూరప్ దేశాలకు వచ్చింది. బ్రాజిల్‌లో దీనిపేరు క్వియియా (**Quiya**) దీని అర్థం తెలియదు. మిరియాలతో గుణ సాదృశ్యాన్నిబట్టి పోయి డి గినీ (గినీ మిరియాలు), పోయి డి బ్రాజిల్, పోయి డి ఇండీ-బ్రాజిల్ మిరియాలు, భారత్ మిరియాలు - అని ఫ్రాన్సు మొదలయిన దేశాలలో విధ విధాలుగా వ్యవహరించారు. దీనిని బుడతకీచులు వెస్ట్ ఇండీస్‌నుంచి తెచ్చుకొన్నారు. వారు తమతోపాటు దీనిని గోవాకు తెచ్చారు. అందువల్ల దీనికి బొంబాయిలో గోవాయిమిర్చి అనే పేరుండేది. నేడు క్రమంగా ఈ పేరు తగ్గిపోయింది. బొంబాయి ప్రాంతంలో దీనిని 1787 ప్రాంతంలో పండించడం ప్రారంభించారు. ఇది దేశమంతటా వంద సంవత్సరాలలో వ్యాపించింది; ప్రస్తుతం తెలుగువారిదే అన్నంతగా పాతుకొనిపోయింది

దీని వ్యాప్తికి కారణం. మిరియాల పంటకు కష్టపడవలసినంత కష్ట పడనవసరం లేకపోవడం, దానికి అవసరమయిన శీతోష్ణస్థితి దీనికి అవసరం లేకపోవడమూను.

ప్రస్తుతం ఇది ప్రపంచంలో చాల చోట్ల విరివిగా పండుతూంది.

*　　　*　　　*

ఆముక్తమాల్యద పద్యంలోని "ముకు మందై యేర్చు నావం జిగు ర్కొను పచ్చళ్ళు" నసాళానికి అంటే ఆవ వేసిన పచ్చళ్ల గురించి శాఖా చంక్రమణంగా ఒక్కమాట.

"శీతాకాలంబు కడి మాడ సేయ గుడుచు
భాగ్యవంతుఁడు తేపాడి పల్లె పట్ల
క్రొత్తయారెంబు నిగురావకూరతోడ
పిచ్ఛిలంబైన నేతితో బెరుగుతోడ"　　　(క్రీడా. 18 పు.)

అనే క్రీడాభిరామం పద్యచర్చలో 'ఇగురావకూరతోడ' అనే మాటలకు ఆవ వేసిన ఇగురుకూర అని శ్రీ ప్రభాకరశాస్త్రి పాదులు అర్థం చెప్పారు. ఈ పద్యానికి మూలమని పండితుల విశ్వసించే ప్రేమాభిరామంలోని

"తరుణం సర్షపశాకం
నవౌదనం పిచ్ఛిలాని చ దధీని,
స్వల్ప వ్యయేన సుందరి
గ్రామ్యజనో మృష్ట మశ్నాతి.　　　(వృత్తరత్నాకర వ్యాఖ్య.)

అనే ఆర్యలో 'తరుణం సర్షపశాకం' అని ఉన్నది గనుక ఆవ వేసిన కూర కాదు. లేత ఆవకూరే అయివుంటుందండీ!" అని నేను మనవి చేశాను. శ్రీ శాస్త్రి పాదులు తెలుగు దేశంలోని ఆవ వాడే ఆచారాన్నిబట్టి కవు లిద్దరూ తెలుగువారు కాబట్టి ఆవపొడివేసి ఇగిరించిన కూరలేనని అన్నారు. నేను వాదించలేదు; సరైన ప్రమాణం దొరికేవరకు మిన్నకుండడం నా అలవాటు.

నేను 1939 లో లాహోర్‌కు వెళ్ళడం తటస్థించింది. రైలు దిగి, స్టేషన్ ఎదుట ఉన్న హోటలులో బస చేశాను. భోజనానికి వెళ్లాను.

"పండిట్‌జీ, ఆజ్ క్యా హై సాగ్‌బాజీ?" అని ఎవరో అడుగుతున్నారు. యజమాని వెంటనే, "సరసోంకా సాగ్, మూంగ్‌కి దాల్...." అంటూ ఒక జాబితా చదివాడు. ఆశ్చర్యపడ్డాను. నేనూ "సరసోంకా సాగ్" తిన్నాను. ఆవకూర - ఆవ మొక్కల ఆకుకూర - తిన్నాను, ఆనందించాను వెంటనే, డాక్‌ఖానాకు వెళ్లాను. "తరుణం సర్షపశాకం" లేత ఆవకూరేగాని, ఆవ వేసిన కూర కాదని, నేను ఇప్పుడే తిని వ్రాస్తున్నానని శ్రీ శాస్త్రి పాదులకు దీర్ఘంగా ఉత్తరం వ్రాశాను. మరుసటి టపాకే సమాధానం వచ్చింది; "చాల ఆనందించాను మెంతికూరలాగ ఆవకూర కూడా తెలుగు దేశంలో తినేవారేమో! ఉత్తరదేశంలో నీవు చూచి, ఆరగించి వ్రాసినందుకు సంతోషిస్తున్నాను. ఎంత సులభంగా, ఎంత గొప్ప విషయం తెలుసుకొన్నాను." అని. వారి సహృదయత అలాటిది వారికి జోహార్లు.

*   *   *

బ్రౌను బ్రౌణ్య నిఘంటువులో మిరెపుకాయ, మిరపకాయ, మిరియపు కాయ అనే రూపాలిచ్చి, గోలకొండ మిరపకాయ, సీమమిరపకాయ మొదలయిన అనేక భేదాలు తెలిపాడు

మిరపకాయ గుణం, ఆకారం, రంగుబట్టి పెక్కు నానుడులు పుట్టాయి—పచ్చిమిరపకాయ సుమండీ వాడు; పొట్టివాడయినా, సూదిమిరపకాయ— మొదలుగా. లోపల శాస్త్రం లేనివాడిని "వట్టి బుంగమిరపకాయ" అని వ్యవహరించడం అందరికీ తెలిసిందే.



# అండీ? ఏమండీ?



మనం ప్రతిక్షణమూ వాడే కొన్ని మాటలు పుట్టు పూర్వాలు అకస్మాత్తుగా మనకు స్ఫురించినప్పుడు కలిగే ఆనందం అపూర్వంగా వుంటుంది.

మనం అనుక్షణం వాడే మాటలలో ఏమండీ అనేది ఒకటి. ఎవరన్నా మనకు బహుకాలానికి కనిపిస్తే "ఏమండీ, కులాసాయేనా? క్షేమమేనా? బాగున్నారా?" అని రకరకాలుగా పలుకరిస్తాము. అంగడికో, సంతకో వెళ్ళినప్పుడు "ఏమండీ, దీనిని ఎంతకిస్తారు? దీని ధర ఎంతండీ? ఇచ్చే సంగతి చెప్పండి!'' అని ప్రశ్నిస్తాము. అంగడివాళ్ళు ఎక్కువ ధర చెప్పినప్పుడు "ఇంత ఇవ్వలేమండి. కొంచెం తగ్గించుకోండి" అని కోరుతాము. ఎవరైనా మన ప్రశ్నకు సరిగ్గా సమాధానం చెప్పనప్పుడు "చెప్పండి మరి?" అని నిగ్గదీస్తాము. "పోండీ, మీరెప్పుడూ ఇంతే" అంటూ ప్రియురాలు ప్రియునిపై అలుగుతుంది. "ఏమండోయ్!" అని సంబోధిస్తుంది భార్య భర్తను.

ఈ 'అండీ' పదం ఏమిటో, ఎప్పుడు వ్యవహారంలో చేరిందో చూద్దాం. శబ్దరత్నాకరకారుడు ఈ అండీ పదానికి లోహ పాత్ర విశేషమని అర్థం చెప్పాడు గాని సంబోధనార్థకమని అర్థం చెప్పలేదు. మనకు ఉన్న సంబోధన వాచక ప్రత్యయాలు ఓ, ఓరి, ఓసి, ఆ, ఆరా, ఈ అనేవి ఉన్నాయి. గ్రంథాలలో ఓరామా, ఓరి వెధవా, ఓసి లక్ష్మి, రామా, రాములారా అనేవి ఉదాహరణలు. అతి ప్రాచీనవైయాకరణుడైన కేతన సంబోధన విభక్తి ప్రత్యయాలు ఆ, ఆరా అని చెప్పాడు. ఓ అనే ప్రత్యయం

విడిగా చెప్పకపోయినా, 'ఓ పురుషోత్తమ!" అనే ఉదాహరణ మిచ్చాడు. ఉకారాంత పదాలు సంబోధనలో దీర్ఘాంతవుతా యన్నాడు. సంబోధన వాచకంగా అండీ అనే పదంగాని ప్రత్యయంగాని చెప్పలేదు. కావ్యాలంకార చూడామణి కారుడు గాని, ఛందో దర్పణకారుడు గాని, చివరకు ఆంధ్ర శబ్ద చింతామణి కారుడు గాని, అండీని చెప్పలేదు.

మరి ఈ అండీ పదం నడమంత్రంగా వచ్చిందా? వచ్చి పాకి పోయిందా? ఇప్పుడూ, అప్పుడూ ఎవరినైనా సంబోధించవలసి వస్తే "అయ్యా, దొరగారూ, పంతులూ, రామయ్యా, కామయ్యా, లక్ష్మీ, గౌరీ, గంగులూ'' అని పిలవడం వుంది కాని, ఈ అండీ ఎప్పుడు వచ్చింది? "ఏమండీ? బాబుగారండీ, ఔనండీ, మరేనండీ, అంతేనండి, అలాగాండీ, ఎంతండీ" అని ప్రతిమాటకూ, ప్రతిమాటకూ ఈ అండీ ఎలా, ఎందుకు హత్తుకుపోయింది? పరిస్థితి ఎలా ఏర్పడిందంటే అండీ అని అనకపోతే, అవమానంగా భావిస్తున్నారు. నిజమే! వెనక వచ్చిన కొమ్ములు ఎప్పుడూ వాడే కదా!

ఈ అండీ ఎలా వచ్చిందో చూడడానికి ముందు తెలుగు తోబుట్టువుల లోని సంబోధన వాచకాలు చూడడం అవసరం. మనం వాటి పూర్వ చరిత్రకు పోక ఇప్పటి వ్యవహారంలోని సంబోధన ప్రత్యయాలు మాత్రమే చూద్దాం. తమిళ కన్నడాలలోను ఇలాటి పరిస్థితే ఏర్పడింది. "ఎన్నాంగో, ఆమాంగో, అదుదాంగ, పోంగోయ్యా, ఇల్లేంగో" - ఇవి నేడు తమిళుల గౌరవ పూర్వకమైన సంబోధన వాచకాలు. కన్నడంలో "రీ, ఏన్రీ, హౌద్రీ, నోడ్రీ, ఇద్రి, ఆయితేన్రీ" అని మర్యాదగా సంబోధించడానికి 'రీ' వాడుతారు.

కొంత ఆలోచించగా, ఈ అండీ, అంగో, రీఅనే ఈ మూడు భాషల గౌరవ సంబోధన ప్రత్యయాలకు మూలసూత్రం ఒక్కటేనని తోస్తుంది.

కేతన కాలపు వ్యవహారం సంగతి మనకు తెలియదు గాని, శబ్ద రత్నాకరకారుడు మొన్నటివాడు గదా! ఆయన కాలంలో ఈ అండీ

ప్రయోగం వ్యవహారంలో ఉండనే ఉంది గదా, నిత్య వ్యవహారంలోవున్న ఈ విచిత్ర ప్రయోగాన్ని గ్రహించవద్దూ! ఎందుచేత ఉపేక్షించాడో! వ్యవహారంలో వున్న అన్యదేశ్యాలను గ్రహించినవాడు దీనిపై ఎందుకు సీత కన్ను వేశాడో!

ఈ అండీ ప్రత్యయం మూలమేమిటని వెదుకుతూ పోగా, ఇది క్రియారూపాలలో అర్థాంతరంలో మనకు సాక్షాత్కరిస్తుంది, లోట్ మధ్యమ పురుష బహువచన రూపంలో, చేయు(డు, చేయుండు; తిను(డు, తినుండు; పడు(డు, పడుండు; కొను(డు, కొనుండు; విను(డు, వినుండు ఇత్యాదిగా. ఇది గౌరవపూర్వక సంబోధనార్థకమైన అండికి మూలమై ఉంటుందని తోస్తుంది; ఈ ప్రత్యయం క్రమంగా సంబోధనలో రూఢమయి వుంటుంది.

ఉదాహరణకు తిను ధాతువును తీసుకుందాం. నీవు తినుము-లోట్ మధ్యమ పురుష ఏకవచనం. మీరు తిను(డు, మీరు తినుండు - లోట్ మధ్యమ పురుష బహువచనం. ఇలాగే చేయు(డు, చేయుండు; పొమ్ము, పొండు; రమ్ము, రండు. ఇలా లోట్ మధ్యమ పురుష బహువచన ప్రత్యయమైన డు, ండు ఎదుటివారిని మర్యాదగా కోరడం గనుక, బహువచన ప్రత్యయాలన్నీ మర్యాదను తెలిపేవి గనుక, సంబోధనలోను గౌరవ వాచకాలుగా రూఢమయిపోయాయి. ఈ డు, ండు అభ్యర్థనార్థకంలో ఈతో కలిసి చేయు(డీ, చేయుండీ; వ్రాయు(డీ, వ్రాయుండీ; పొండు, పొండీ ఇత్యాదిగా వ్యవహారంలోకి వచ్చాయి. లోట్ మధ్యమ పురుష బహువచనంలోని (డు, ండు, ండీలు క్రమంగా లోట్ మధ్యమ పురుష ప్రయోగం నుంచి విడిపోయి సాధారణ సంబోధన వాచకాలుగా గౌరవార్థంలో వాడుకలోకి వచ్చాయి-ఏమండీ, ఎందుకండీ, చాలండీ, నిలవండీ, నిజమండీ, కాదండీ ఇత్యాదిగా. కారణమేమిటో స్పష్టంగా చెప్పలేము గాని, ఎదుటి వానిని అభ్యర్థించడం సంబోధనలోను కొంత ఉంది గనుక, అభ్యర్థనం కారణం కావచ్చు.

ఉత్తరాంధ్ర (తెలంగాణా) జానపద వ్యవహారంలోను, పశ్చిమాంధ్ర (రాయలసీమ) జానపద వ్యవహారంలోను, తమిళనాడులో

స్థిరపడిన తెలుగువారి వ్యవహారంలోను లోట్ మధ్యమ పురుష బహు వచన రూపం నేటికీ-పదుండ్రి, చేయుండ్రి, తాగుండి, తినుండి, పట్టుండి, పట్టుండ్రి అనే ఉన్నది. కూర్చుండుండి ఇత్యాదులు వింటున్నప్పుడు శ్రవణ పేయంగా ఉండడమేకాక, ప్రాచీన స్వరూపాన్ని తలపిస్తాయి. జానపద మహిళలు మాట్లాడుతున్నప్పుడు ఈ వ్యవహారం మరీ ముచ్చటగా వుంటుంది; ఏకవచంలో చేయుము + ఈ = చేయుమీ, చేయిమీ; రమ్ము + ఈ = రమ్మీ, రామీ; పొమ్ము + ఈ = పొమ్మీ, పోమీ; చూడుము + ఈ = చూడుమీ, చూడ్మీ; చెయ్మీ ఇత్యాదిగా. బహువచనంలో వివరించ నక్కరలేదు.

కన్నడ తమిళ రీ, ఆంగోలకు కూడ లోట్ మధ్యమ పురుష బహు వచనమే మూలమని తోస్తుంది. కన్నడంలోని కొన్ని ఏకవచన బహు వచన రూపాలను చూద్దాం; మాడు (చేయు) - మాడు, మాడిరి. కూడు (కూర్చొను)-కూడు, కూడిరి, కూడ్రి. ఓడ (పరిగెత్తు)-ఓడు, ఓడిరి, ఒడ్రి. తమిళంలో : సాప్పిడు (తిను) - సాప్పిడు, సాప్పిడుంగళ్. పో, పోంగళ్. అమర్ (కూర్చుండు)-అమర్, అమరుంగళ్-మొదలైనవి. ఈ రీ, గళ్, ంగళ్ ప్రత్యయాలు లోట్ మధ్యమ పురుష బహువచనం నుంచి విడిపోయి ఏన్రీ, హౌద్రీ, కూడ్రీ, ఇద్రీ అని గౌరవపూర్వక సంబోధన వాచకాలుగా కన్నడంలోను, ఎన్నాంగ, చొన్నాంగ, ఆమాంగో, పోం గోన్నా, ఎంగేంగో-అని తమిళంలోను వాడుకలోనికి వచ్చివుంటాయి.



# కోతి - కొండెంగ



ఆ మధ్య దసరాపండుగకోసం మిత్రులు కొరిడె రఘుపతిరావు గారి స్వగ్రామం మంగంపేటకు వెళ్ళాను. మంగంపేట మెదక్ జిల్లాలో హైదరాబాదుకు ముప్పై మైళ్ళ దూరంలో వుంది. అందరం ఏదో మాట్లాడు కుంటున్నాం. పిల్లలు గోలపెట్టారు - కొండెంగలు, కొండెంగలు అని, పెద్దలంతా వినోదం చూడడానికి పరుగెత్తారు; నేనూ వెళ్ళాను.

చెట్ల మీద కొండముచ్చులు ఎగురుతున్నాయి. పిల్లలు "కొండెంగలు! కొండెంగలు!" అంటూ వాటి వెంటపడ్డారు. కొండెంగ అంటే కొండముచ్చు! - అనుకున్నాను. కొండెంగలు అనే మాట ఏమిటి? మరి కొండముచ్చు అనే మాట మాత్రమేమిటి?

నా ఆలోచనలు కొండెంగ, కొండముచ్చుల మధ్యపడి కొట్టుకుంటూ, ఒక ఒడ్డుకు చేరాయి. మనం సాధారణంగా ఎర్రమూతి కోతిని కోతి అంటున్నాము. నల్లమూతి కోతిని కొండముచ్చు అంటున్నాము. కొండ ముచ్చు వ్యవహారం పూర్వపశ్చిమాంధ్రాలలో ఉన్నది. ఇది ముచ్చులాగ - దొంగలాగ - ముఖం తప్పిస్తూ విచిత్రంగా వ్యవహరిస్తుంది గనుక దీనిని కొండముచ్చు అన్నారనిపిస్తుంది. మరి ముచ్చుకోతి, కోతిముచ్చు కావాలి గాని కొండముచ్చేమిటి? కొండముచ్చులోని కొండపదానికి అర్థం స్పష్టంగా తెలియదు. ముచ్చులాగా కొండల్లో వుండేదనా దీని అర్థం!

కొండెంగకు శబ్దరత్నాకరం ఏమి అర్థం చెబుతుందో అని తిరగ వేస్తే, "కొండెంగ = వై.వి. కొండయందుండెడు నల్లకోతి. ద్వి"…. బడుగు, కొండెంగ దీని వెక్కురు తుంగదబుంగ-హరిశ్చ 2 ఖా" అని వుంది. కొండెంగను కొండ + ఎంగ అని విడదీసినట్లు స్పష్టపడుతుంది. అయితే, ఎంగ అనే పదానికి శబ్దరత్నాకరంలోను, మరెక్కడానూ కోతి అనే అర్థం కనిపించదు. ఎర్రమూతి కోతికూడ కొండల్లో ఉండేదే కదా! శబ్ద రత్నాకరకారుని అర్థం దానిలో అతివ్యాప్తం కాదా? కనుక కొండెంగ వ్యుత్పత్తి శబ్దరత్నాకరుడు చెప్పింది కాక మరొకటి అయివుంటుంది.

కోతి ప్రాచీనరూపం క్రోతి. ఈ రెండు రూపాలలోను మధ్యన అరసున్న ఉంది. దీనిని పూర్వం క్రోంతి, కోంతి అని వ్యవహరించేవారు. ఇప్పుడు తమిళనాడులో స్థిరపడిన తెలుగువారు కోంతి అనే వ్యవహరిస్తారు. 'పాటి మూంతి చూడుమీ కోంతి మూంతి' అంటారు, వికారంగా వున్న వ్యక్తిని చూచి.

ఈ కోంతి, కోతులకు తెలుగు తోబుట్టువులయిన తమిళ కన్నడాలలో సమానార్థకాలు చూద్దాం. తమిళంలో కోతిని కొరంగు, కురంగు అని, కన్నడంలో కోతి, మంగ అని వ్యవహరిస్తారు. కురంగు-కొరంగు-కొరంగి - క్రొంగి - క్రొంతి - క్రోంతి-కోంతి - కోంతి - కోతి అయినదని భాషాతత్త్వవేత్తలు అంటున్నారు.

కొండెంగకుకూడ కొరంగె మూలమని నాకు తోస్తుంది. కొండెంగను-నల్లమూతి కోతిని కడప జిల్లాలో గంద్రంగి అని అంటారని సుప్రసిద్ధ కవిమిత్రులు గజ్జల మల్లారెడ్డిగారు నాతో అన్నారు. ఈ గంద్రంగి, కన్నడంలోని మంగ పదమూ ధ్వనిసామ్యంలో కొండెంగకు దగ్గరివి. మంగ పదాన్ని కన్నడులు నల్లమూతి కోతికే వ్యవహరిస్తారు. కన్నడ ప్రాంతంలోని తెలుగువారుకూడ అవమానితుడినో, తప్పుచేసి జవాబు చెప్ప

లేని స్థితిలో పిక్కలు చూచేవాడినో- ఏమిటి అట్లా మంగమొగంతో చూస్తావ్! నేను పట్టి ఘూడించేవేళకు మంగపండయ్యాడు- అని అంటారు.

పరిశీలించి చూడగా, కురంగు పదమే మరొక విధమైన ఉచ్చారణతో కొండెంగ అయిందని తోస్తుంది. కురంగు-కొరంగు-కొడంగు-కొండంగ-కొండెంగ అని మారివుంటుంది. ఈ పరిణామం సహజంకూడ. రకారం (రేఫ) డకారం కావడం అసహజమేమీ కాదు. మొదట కురంగు పదం వానర సామాన్యవాచకమయి, క్రమంగా కొండెంగ, క్రోతిరూపాలు పొంది, వానర విశేష వాచకమయి- నల్లమూతి కోతి కొండెంగ - కొండముచ్చుగాను, ఎర్రమూతి కోతి కోతిగాను వ్యవహృతమయి- వుంటుంది. కొండెంగ ముచ్చువలె, దొంగవలె భయపడుతూ పిక్కలు చూస్తూ ఇకిలిస్తూ విచిత్రంగా ప్రవర్తిస్తుంది గనుక కొండెంగ ముచ్చు అని వ్యవహారంలో వుండి, జనం నోళ్ళలో నలిగి కొండముచ్చు అని పూర్వాంధ్ర ప్రాంతంలో వాడుకైందని, పాతరూపమైన కొండెంగ ఉత్తరాంధ్రలోను, కొండెంగ రూపాంతరమైన గండ్రంగి పశ్చిమాంధ్రలో కొన్ని ప్రాంతాలలోను నిలిచిపోయాయని తోస్తుంది.

కొండముచ్చుకు కోణంగి అనే వ్యవహారము వుంది. కోతిలాగ చిలిపి చేష్టలు చేసేవారిని మనం 'కొంటె కోణంగి' అని అంటాము. "ఏమిటా కోణంగి చేష్టలు?" అని బెదిరిస్తాం. అల్లరి చేసేవారిని ఈ కోణంగి-కోనంగి పదంకూడ కురంగునుంచి పుట్టినదే. డకార ణకార నకార సహితమై క్రమంగా రాలిపోయి ణకార నకారాలే మిగులుతాయి కొన్ని పదాలలో. ఇక్కడ కురంగు- కొరంగు- కొడంగు- కొణంగి- కోణంగి-కోనంగి అని క్రమంగా పరిణామం కలిగి వుంటుంది. వింత ఏమిటంటే, కురంగు అనే మాటనుంచి పరిణమించిన క్రోంతి-కోతి, కొండెంగ-గండ్రంగి, కోణంగి-

కోనంగి పదాలు మూడు పాయలుగా భిన్నార్థచ్ఛాయలలో రూఢం కావడం, ప్రత్యేక పదాలనే భ్రాంతి కలిగించడమున్నూ.

శబ్దరత్నాకరకారుడు కోణంగి పదం గ్రహించి 'వై.వి. అంగములను వికారముగా జూపి బిచ్చమెత్తెడు దాసరి అని అర్థమిచ్చాడు. వైజయంతీ విలాసంనుంచి ఉదాహరణము ఇచ్చాడు. కొంటె కోణంగి వికారపు చేష్టలు చేసి నవ్వించే వాడనే అర్థము ఇవ్వవలసింది.

ఇంతకూ కురంగు, కోతి ఎలా పుట్టాయో అడగరేం? కురంగు, కోతి అనుకరణ జన్య పదాలు. కోతులు క్రోం క్రో కురం, కురం అని అరవడంవల్ల, తదనుకరణంగా ఈ పదాలు పుట్టాయి.



# పుంటికూర - గోంగూర



మన రాజధానిలో "పుంటికూర, పులిచింతకూర, గంగవావిలి కూర, పాలకూర, కొత్తిమిర, కరేపాకమ్మో!" అంటూ కూరలమ్మే వాళ్ళ కేకలు వాడవాడ మారుమ్రోగుతుంటాయి. పుంటికూరంటే గోంగూర. పశ్చిమాంధ్రలో దీనిని గోసుకూర, గోగాకు, అనికూడ అంటారు. గోసుకూర, గోగాకు, గోంగూరలకు పర్యాయంగా రాజధాని జంటనగరాలలోను, ఉత్తరాంధ్రంలోను పుంటికూర అనేపదం ఎలా వ్యవహారంలోకి వచ్చింది? దీని పుట్టుపూర్వాలేమిటి?

ఈ గోంగూరను కన్నడులూ, తమిళులూ కూడ విశేషంగా వాడుతారు. గోంగూర పచ్చడి మన ప్రజాసామాన్యానికి ఎంతటి ప్రధానమైన వ్యంజనమో, తమిళనాడులో గోంగూరపులుసు ప్రజాసామాన్యానికి అంతటి ప్రధానమైన వ్యంజనం. కందిపప్పు మొదలయిన అపరాలేమీ

లేకుండా పట్టి గోంగూర పులుసు, అన్నం ప్రధాన భోజనం సామాన్యు లకు. కార్మిక సామాన్యం తిండీ ఇదే. కన్నడనాడులోను గోంగూరను పచ్చడిగాగో, పులుసుగానో, పప్పులోవేసి పుల్లగూరగానో వండుతారు. ఏ వ్యంజనమూ లేనప్పుడు గోంగూర, నీరుల్లి, మిరపకాయలు, ఉప్పువేసిన ఊరుబిండి (పచ్చడి), జొన్నరొట్టె సామాన్యుల నిత్యాహారం.

పుంటికూర అనే వ్యవహారం ఉత్తరాంధ్రంలో ఇంత బహుళంగా ఉండడానికి కారణాలు ఏదికేముందు తమిళ కన్నడాలలో దీని సమాన వాచకాలు, వాటి అర్థాలు చూద్దాం. తమిళంలో దీనిని పుళిచ్చకీరై అంటారు. అంటే పుల్లటికూర. దీని సహజగుణం పులుపు గనుక చింతపండువంటి మరొక పుల్లటి వస్తువు కలయిక లేకనే వ్యంజనం అవుతుంది గనుక తమిళ కార్మికులకు ఇది చాలా ఇష్టం; సులభంగా సంపాదించగలిగిందీని. మనకిది ఎంత ఆంధ్రమాతో తమిళులకూ, కన్నడులకూ అంతే మాత. కాని తమిళ కన్నడ ప్రాంతాల నాగరికులైన పైతరగతివారు దీనిని వాడరు. సామాన్య ప్రజలే వాడుతారు. కనుక పైతరగతి వారిలో ఇది అంత మన్నన పొందలేదు.

కన్నడంలో దీని సమానార్థకాలు పుండి, పుండియ పల్లె, పుండేపల్లె, పుండేపల్యా. వీటి అర్థం కూడ పుల్లటికూర అనే, రుచిగినట్టి; పుళి, పుళ్, పుణిసె, హుణిసె కన్నడంలో ఆమ్ల వాచకాలు. వీటి ఉచ్చారణలోను, అర్థంలోను దగ్గరగావున్న పుండి అనే పదం మొదట్లో పుల్లటి పదార్థం అనే అర్థంలోనే వ్యవహృతమై క్రమంగా కూరకు రూఢమై ఉంటుంది. ణకారం ండ కారం పరస్పరం మార్పు చెందడం తెలుగుతోబుట్టువు లన్నిటిలోను ఉన్నదే. పండు - పణ్ణు - హణ్ణు; పుండు - పుణ్ణు-హుణ్ణు. ఇలాగే పుళ్, పుళి - పుణ్ - పుండి అయివుంటుంది.

తెలుగు తోబుట్టువులలో ఇది పుళి - చ్చ కీరై, పుండి అనే వ్యవ హారంలో వుండడాన్ని బట్టి, రుచిలోను, ఉచ్చారణలోను ఇది పుళికె

దగ్గరగా వుండాన్నిబట్టి కన్నడంలోను, తెలుగులోను వుండి అని వ్యవహారం పొంది ఉంటుంది. క్రమంగా పశ్చిమ పూర్వాంధ్రలలో ఏకారణం వల్లనో వ్యవహారచ్యుతమై, ఒక ఉత్తరాంధ్రలో మాత్రమే పుంటికూర అని వ్యవహారంలో మిగిలింది.

మనకు అదివరకే నారనిచ్చే గోగుమొక్క పొడుగాటిది వుంది. దానిని కేవలం నార తీయడానికే వాడుతారు. పదం గోనుపద పర్యాయమని శబ్దరత్నకరకారుడు తెలిపాడు. కూరగా వాడే గోగును చెప్పలేదు. ఈ గోను నుంచి వచ్చిందే గోనెసంచి. మన దేశంలో వున్న గోంగూరలను పోలినవి మరికొన్ని దనాసరి గోంగూర వంటివి తనాసీర్ మొదలయిన సుదూర ప్రాంతాలనుంచి మన దేశానికి సుగంధ ద్రవ్యాలతో పాటు వచ్చాయి. రెడ్డిరాజుల కాలానికి ముందునుంచి దాదాపు రెండువేల యేండ్ల నుంచి మనకు ఆగ్నేయాసియా దేశాలతో సంబంధం వుంది గనుక, ఈ దనాసరి గోంగూర తనాసిర్ ప్రాంతంనుండి వచ్చివుంటుంది. తనాసీర్‌ను శ్రీనాథుడు తరుణాసీర అన్నాడు హరవిలాసంలో. పుల్లటి ఈ కూర మన దేశంలోని కూరగా వాడే గోంగూరను పోలింది గనుక గోంగూర పదంతోనే దనాసరి గోంగూర ఇత్యాదిగా వ్యవహృతమయింది. కొత్తకూర పాతకూరతోపాటు పాత పదాన్ని కూడ ఉత్తరాంధ్రంలో త్రోసిరాజని వుంటుంది.

కన్నడంలో వుండే పల్లె అని, తమిళంలో పుళిచ్చకీర్రై అని పూర్వరూప స్ఫోరకాలైన పదాలు ఉండడాన్నిబట్టి ఉత్తరాంధ్రంలో వ్యవహారంలో మిగిలిన పుంటికూర అనే పదం అతి ప్రాచీనమయిందని నిర్ణయించవచ్చు.

గోంగూర చాల రుచ్యమైన వ్యంజనం, పచ్చడి మరింత రుచి. గురువర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'కడుపు తీపు' అనే లఘు కావ్యంలో గోంగూర పచ్చడిని ఇలా వర్ణించారు:

"పయర కూర వేచి పచ్చిమిరెప పండ్ల
నుక్కళించి పోసి యూరనిచ్చి
కొంత గొంత పొగపికొను గోగుఁబచ్చడి
చలికి చింక నోరు బిగికి తీరు". (44)



# కవ్వడి
# కవ+వడి కాదు



కడఁగి ద్రుపదానుజుండు నె
వ్వడిఁగవ్వడి నేసె నూఱువాఁడి శరంబుల్
కడు నలిగి వాని నన్నియు
నడుమనె తునియంగనేసె నరుఁడస్త్రములన్.

భా.ర. ఆది. ఆశ్వా-6.

అనే పద్యంలోను, ఇతరత్రానూ కవ్వడి పదం వచ్చినప్పుడల్లా నాకు సందేహం కలిగేది; ఈ కవ్వడికి మన కోశకారులిచ్చిన వ్యుత్పత్తి సరైంది కాదు అని. కావని మనసు చెబుతుండేది; అసందిగ్ధంగా నిరూపించే ప్రమాణాలు కనిపించలేదు. కాని, ఇటీవల డాక్టర్ వి. యశోదా రెడ్డి గారి 'తెలుగులో హరి వంశములు' అనే సిద్ధాంత వ్యాసం చదువుతుండగా, ఒక అపూర్వ పదం కనిపించి, మెరుపు వలె కవ్వడికి వ్యుత్పత్తి తోచి ఎగిరిపడ్డాను. కాని, నా వాదం సరైనదని నిరూపించడానికి సాధన సంపత్తి పూర్తిగా దొరకక కొంత కుంటిపోవలసి వచ్చింది. అయినా, భగవంతుని వెదకడానికి నేతి నేతి వాదం వుండనే వుంది కదా! దానినే సాహిత్యంలో సత్యగవేషణకూ వినియోగించుకుంటే ఏమి పోతుంది-అనుకొని మనస్సులోనే చర్చించుకొన్నాను. దానినే ముడిముడిగా పాఠకుల ఎదుట పెడుతున్నాను.

కవ్వడికి విద్వాంసులు చెప్పే వ్యుత్పత్తి కవ + వడి = రెండు చేతుల వడి గలవాడు - అర్జునుడు అని. ఇది శబ్దరత్నాకరం ఇచ్చిన వ్యుత్పత్తి. బ్రౌణ్యమేమో వ్యుత్పత్తికి ప్రయత్నించక 'దీని మూల స్వరూపం తెలియదు' అని తన చిత్తశుద్ధిని ప్రకటించింది. ఈ పదం సంస్కృతంలోని సవ్యసాచి అనే పదానికి అనువాద రూపమయిన పర్యాయ మని సాహిత్య పరిచయమున్న ప్రతివారికీ తెలుసు. దాని అనువాదమే అయినప్పుడు దాని అర్థం పూర్తిగా తెలుగు పదంలో రావాలి కదా! మూల సంస్కృత పదమైన సవ్యసాచి పదంపుట్టుపూర్వాలు చూద్దాం.

శబ్ద కల్పద్రుమం సవ్యసాచి పదాన్ని ఈ విధంగా వ్యాఖ్యానించింది: "సవ్యసాచీ = సవ్యేన వామేన హస్తేనాపి సచతి సంధధాతి బాణ మితి. సచసంధానేణిని:. అర్జునః-ఇతి హేమచంద్రః. మహాభారతమ్ 4-12-19.

ఉభౌ మే దక్షిణౌ పాణీ
గాండీవస్య వికర్షణే,
తేన దేవమనుష్యేషు
సవ్యసాచీతి మాం విదుః.
సవ్యం వామమ్, సు ప్రేరణే. ॥

ఎడమ చేతితోనూ బాణాలు సంధించేవాడు గనుక సవ్యసాచి అని అర్థమని పై వ్యాఖ్య తాత్పర్యం. "రెండు చేతులా గాండీవాన్ని వంచి బాణాలు వేయడంలో సమర్థమైనది గనుక దేవతలలోను, మనుష్యులలోను, నాకు సవ్యసాచి అని ప్రసిద్ధి" అని అంటాడు అర్జునుడు.

"వామం శరీరే సవ్యం స్యాత్
అపసవ్యం తు దక్షిణమ్"

అని అమరసింహుడు శరీరంలోని ఎడమ భాగం సవ్యమని, దానికి ఎదురుగా ఉండేది అపసవ్యం - దక్షిణమని స్పష్టపరిచాడు. ఈ సవ్యాప సవ్య పదాల అర్థాలు తర్వాత కొంత చిక్కు కలిగించినా, సవ్య పదం వేదంలోనూ, మనుధర్మ శాస్త్రం వంటి స్మృతులలోను స్పష్టంగా ఎడమ అనే అర్థంలోనే కనిపిస్తుంది. మనువు ఉపవీతి ప్రాచీనావీతి నివీతులను నిర్వచిస్తూ-

"ఉద్ధృతే దక్షిణే పాణౌ
ఉపవీత్యుచ్యతే బుధః,
సవ్యే ప్రాచీన ఆవీతీ
నివీతీ కంఠసజ్జనే."

అని స్పష్టపరచాడు. కాని ఎందుకో ఏమో సవ్యం సరైంది-కుడి అని, అపసవ్యం సరైంది కాను-వామ మార్గమని అర్థాలు పరస్పర విరుద్ధంగా మారిపోయాయి. అనర్ఘ రాఘవ నాటకంలోని "ఏకేన సవ్యపాణినా విశిఖ ముత్థాయ కమాహరావణః. నాథురే మనుష్య డింభా సాధు." అన్న వాక్యాల లోని సవ్య శబ్దానికి వ్యాఖ్యాత "సవ్యపాణి నా దక్షిణ హస్తేన" అని అర్థమిచ్చాడు. సవ్యాప సవ్యాల అర్థాల తర్వాతి మార్పు ఏమైనా, మన వివక్ష కవ్వడి శబ్దార్థం కదా!

కవ్వడి సవ్యసాచి పదానికి అనువాదమన్నది నిస్సందేహ మన్నప్పుడు, కవ్వడి అన్న పదానికి ఎడమచేతితోను బాణాలు సంధించే వాడు అని అర్థం వుండాలి. అలా వుంటేనే సరైన అనువాదమౌతుంది.

కాని, మన వైఘంటుకులు ఈ పదాన్ని కవ + వడి అని విడదీశారు. కవ పదానికి తెలుగు కన్నడాలలో రెండు, రెండుగా చీలు, పంగ చీలు అనే అర్థాలున్నాయి గనుక కవ + వడి = కవ్వడి కావడంలో ఎలాటి విప్రతిపత్తీ లేదు. అర్థంకూడ గురికి జేనెడు దూరంగా సరిపోతూ వుంది. ఈ అర్థానికి అర్జునుడు చెప్పిన శ్లోకమూ సమర్థకమవుతున్నది. కాని ఇది సవ్యసాచి అన్న సమస్తపదంలోని ప్రతి పదానికీ అర్థమూ కాదు, అనువాదమూ కాదు. ఎడమచేతితోను బాణాలు వేసేవాడని స్పష్టంగా అర్థం చెప్పినప్పుడే ఎవరికైనా సంతృప్తి కలుగుతుంది. అందువల్ల-

కవ్వడికి నేను అనుకొన్న వ్యుత్పత్తే సవ్యసాచికి దగ్గరగా కనిపించింది. కవ్ + బడి > కవ్ + వడి > కవ్వడి అయివుంటుందేమోనని నా మనసులో చాల కాలంగా మెదలుతూ వుంది. కవ్, కవి, కవియు అనే క్రియలకు కవియు, ఆక్రమించు, ప్రేరించు అనే అర్థాలున్నాయి. కవియు + బడి > వడి. బడితోను కవిసేవాడు, బడితోను బాణాలువేసి కవియ బడేవాడు అని అర్థం చెప్పుకోవచ్చు.

మరి, బడి అంటే ఏమిటి? బడి అనే పదానికి ఎడమ అనే అర్థం వుంటే, ఎడమచేతితోను కవిసేవాడు, లెఫ్ట్ హాండర్ కూడ అని చెప్పుకోవచ్చు. కాని తెలుగు నిఘంటువులను చూస్తే, బడి పదానికి ఎడమ అనే పదం కనిపించదు. ఎడ, ఎడమ, డా అని తెలుగులోను; ఎడ, ఎడమ అని కన్నడంలోను వామార్థక వాచకాలు ఉన్నాయి. తమిళంలోను ఎడయే వామార్థకం. వలవలము, బలవల, వలదు అనేవి దక్షిణ వాచకాలు. వలలోని లకారం లడయోర భేదంగాను, వకారం వబయోర భేదంగాను మారాయని సరిపెట్టుకున్నా, వల, బడ > బడి కావచ్చుకాని అర్థం సుతరామూ కుదరదు. ఇంతమాత్రాన నాకు నిరాశ కలుగలేదు. బడి అనే పదం ఎడమ అనే అర్థంలో కనిపించింది. సాంబోపాఖ్యానంలో సూర్య వర్ణనలో బడిపదం వామార్థకంలో అసందిగ్ధంగా ప్రయుక్తమైంది.

సీ. **హరుబడి కంటికి హరికుడికంటికి**
మను విచ్చు నేవేల్పుమండలంబు." (ఆ. 2.4.)

సూర్యుడు శివుని బడికన్నుగాను అనగా ఎడమకన్నుగాను, విష్ణువు కుడి కన్నుగాను వర్ణితుడు కావడం పురాణగాథాజ్ఞులకు తెలిసిందే.

ఎడమకు బడిపదం దొరికింది కదా అని పొంగిపోతున్న నాకు డాక్టర్ యశోదారెడ్డిగారు నాచన సోముని ఉత్తర హరివంశంలోని బడి పద ప్రయోగం చూపారు. ఋషులు కృష్ణుని స్తోత్రం చేసే ఘట్టం:

పన్నగంబుల రాజు బగవాడు గూడి నీ
 శయనంబు బయనంబు సంతరింప
దుగ్ధ వారాశి కూతురు నాలుగూడి నీ
 శరణంబు భరణంబు సవదరింప
తామర పగవాడు దయితుండు గూడి నీ
 **బడిచూపు కుడిచూపు** పరిడవింప
జందురు చెలికాడు సయిదోడు గూడి నీ
 యల్లంబు మొల్లంబు నుపచరింప

గంపమాన మనోధ్యాన గతులు మాన
కేకతంబున్న మునులకు నేకతంబు
లేక పొడగానవచ్చు నీ లీలగాన
నన్యులేనాట ధన్యులే యంబుజాక్ష. (1-119)

తామరపగవాడు = చంద్రుడు బడి చూపుగాను- ఎడమ చూపు గాను, తామర దయితుండు = సూర్యుడు కుడి చూపుగాను ఉన్నవాడు

నీవని మునులు కృష్ణుని స్తుతించారు. కవిత్రయం తరువాత ప్రామాణిక తకు పరముడైన నవీన గుణ సనాథుని ఈ ప్రయోగం చూచి ఎంతో హాయి కలిగింది. ఈ పదం నిఘంటువులకు ఎక్కకపోవడం ఎంత దురదృష్టం!

బడి పదానికి ఎడమ అని అర్థం వున్న ప్రాచీన ప్రయోగాలనుబట్టి కవ్వడి పదం వ్యుత్పత్తి కవ + వడి కాదని, కవ + బడి అయి వుంటుం దని మనం భావించవచ్చు. కవ + బడి = ఎడమ చేతితోను ఆక్రమించే వాడు, ఎడమ చేతితోను కవిసేవాడు, బాణాలు వేసేవాడు అని అర్థం స్పష్టం కావడమే కాక సవ్యసాచి అనే పదానికి సరైన అనువాద పర్యా యంగాను అవుతుంది. కవ + బడిలోని బకారం వకారం కావడం, అజ్లోపంవంటి మార్పులు ప్రతి భాషలోను సహజమైనట్టివే. కవ బడుల పూర్వాపర నిపాతాలుకూడ క్వాచిత్కంగా వివిధ భాషలలో కనిపిస్తాయి.



కాని, ఇది పూర్వం స్వతంత్ర వ్యవహారంగా వుండివుంటుంది! లేకపోతే దక్షిణాంధ్రంలో అంత తరచుగా వుండదు గదా! దీని మూల రూపం సెహప్పు-ఎరుపు అయివుంటుందేమో అని తోస్తుంది. ఉదయిస్తున్న సూర్యుడు ఎర్రగా వుంటాడు గనుక దానిబట్టి సెహప్పు నుంచి సెవ్వ పరిణమించిందేమో! మనకిది వ్యవహారచ్యుతమై దక్షిణాంధ్రంలో పరిరక్షితమైంది.



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | CP03 V158 | Date | 21-7-20 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | CI, 201 | | |
| Missing Pages | NO | | |
| Prepared | D. Mounika | Scanned | Mounika |
| BOOK SIZE | H 7.3 W 5.3 | Pages | 217 |